# రహస్యశోధనము

శ్రీ గుంటి సుబ్రహ్మణ్యశర్మ
గ్రంథరచన

కవిరాజహంస - కవికులాలంకార
శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు
సంపాదితము

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
గ్రంధప్రకాశకులు : : : : రాజమహేంద్రవరం.

# రహస్య శోధనము

## మొదటి ప్రకరణము

### పల్లెవాండ్రు

అవి మొహరం పండుగ దినములు — అందును సంతదినము. మొబారక్‌వీథి యంతయు జనసమ్మర్దముచే కిటకిటలాడుచుండెను. నాఁడహమదునగరమందలి జనసంఖ్య యంతయు నందే గుమికూడినట్లుండెను. ఆ పట్టణమువారే కాక పరిసరగ్రామనివాసు లెందరో వ్యాపారార్థులై కొందఱు, దినవెచ్చములఁ గొనుటకై కొందఱు, విలాసార్థులై కొందఱు వచ్చియుండిరి. దినమణి మధ్యందినుఁడగువేళ కాజనత హిమకరసందర్శనకారణంబునఁ బెల్లుబ్బుమహోదధివోలె మఱింత హెచ్చిపోయెను. పండుగసంత — ఎంతటిదౌర్భాగ్యునికైన నాఁడచ్చట పని మిగిలియుండెను. వర్తకుల కాదినము దొరికినంతలాభ మా సంవత్సరమున నొక్కనాఁటికిని జిక్కియుండలేదు. హిందువు లొకవంకను మహమ్మదీయు లొకవైపునను జేరి తమలో నొక్కొక్కఁడును మోయఁగలిగినంత వస్తుసామగ్రిని మోసుకొని పోవుచుండిరి. కందమూలశాకరాసులచేతను, వివిధఫలపుంజంబుతోడను, నానాజాతిధాన్యోత్కరములచేతను, పలురీతుల దుకాణములచేతను ఆ తావంతయు నూత్నకళా

మండితమై నయనానందకరమై యుండెను. అచ్చటి జనకోలాహలము మహాసాగర మధ్యమునఁ దరలుతరంగ విప్లవమువోలె కడు గభీరమై యుండెను. నమమనమను సూచకవర్గము యొక్క గానధ్వను లాకర్ణితము లగుచుండెను. యాతాయాత జనవ్రాతమున కెడ తెగపిలేదు. గస్తీక భటులు నిర్నిద్రులై జనులయం దెట్టి కలహములు జనింపకుండునట్లు కై యందందు తిరుగుచుండిరి. క్రమక్రమముగ దివాకరుఁ డపరాహ్ణగతుఁ డయ్యెను ; కాని జనులసందడిమాత్రము మందగిల్ల లేదు. అది యథా రీతిగానే యుండెను.

ఆసమయమున నిరువురుపల్లెవాం డ్రొకవృక్షచ్ఛాయ నున్న రసాలక్రేతయొద్ద కేగి యందలి చెఱుకుగడలలో నొకటిరెంటిని విలిచి వానినిఁ గొంపోయి యాజనసమ్మర్దమున కించుక యెడముగానున్న యొక పురాతనమందిర ప్రాంగణమునఁ గూర్చుండి తినసాగిరి. వారిరువురు నించు మించుగ నర్ధాయువు తీరినవారివలెఁ జూపట్టుచుండిరి. అటకూర్చుండి తాము కొన్న చెఱకులఁ గొఱికికొఱికి నోటవైచుకొని నమిలినమిలి కొంతసేపటి కాయుంచు నించుమించుగా కడచేసిరి. అంతలోఁ దాంబూల చర్వణ మారంభమయ్యెను. వారిరువురును రదనవిహీనము లగుటచేసి నోళ్ల వారుకాన భుజముపై వ్రేలాడుచున్నతాంబూలోద్ధూఖలము లేక పనిని జరుపుకొననేరరైరి బాగాలు సేవించుచు నడుమనడుమ వాగునాఁటి సంతలోని విచిత్రదృశ్యములగుఱించియు, దేశకాలస్థితుల గుఱించియు మాటాడుకొనఁదొడఁగిరి. సహజముగ వారమాయకులు. పట్టణవాసుల కున్నంతవిశాల లోకజ్ఞానము వారికి లేదు. నగరవాసులకుఁ దెలిసినన్ని కుతంత్రములు కాని చిత్రచర్యలుగాని వారికిఁ దెలియవు. సాధారణ ముగ వారిసంభాషణ యంతయు నందందు కాన్పించు పెద్దపెద్ద మేడల గుఱించియు, తుఱ్ఱున మార్గమున శరవేగముతోఁ బోవు మోటారు

బండ్లను గుఱించియు, మహమ్మదీయులు కొందఱు వేడుకగా ధరించు కొనిపోవుచుండిరి. చిత్రవిచిత్రములగు వస్తులను గుఱించియే నడచిపోవు చుండెను.

ఇట్లొక గంటకాలము గడచిపోయెను. రానురాను భాస్కర బింబము చరమాద్రిదిశ వ్రాలుటను గాంచి యందులో నొకడు 'ఒరే' లచ్చన్నా! సందాలా ఉండాది. ఇంగేముండాదోయ్ యీడ? ఇంగ బడాన వూరికెళ్లేది షేలు.' అనెను. రెండవవానికింకను బయనమై పోవుటకు బుద్ధిపొడమలేదు కాబోలు. వాడు 'తాళేస్' యేముండాది వూరికాడ. ఇంగ సంవత్సరందాక యిట్లా యినోదాలు సూసేనా. పోదాం లే. ఈడుండే యాటపాళ్యానికి పొయ్యేది యెంతసేపు.' అనెను. మొదటివాడు విధిలేక తనమిత్రుని కోరికతో నేకీభవింపక తప్ప దయ్యెను. లేచినవాడల్లే కూర్చుండెను.

అప్పుడు వారిరువురుండువైపున కొకపురుషుడు వచ్చెను. వేష భాషలనుబట్టి యతడు తురుష్కుడని వారు వెంటనే గ్రహింపగల్గిరి. అతనియుడుపు లంతయును మలినములై యించుక జీర్ణములుకూడనై యుండెను. వానిచెంతనొక నతిసుందరమగు నొక పెద్ద యినుపపెటిక (Steel trunk) యుండెను. ఎవడో యొక కూలివాడు కావచ్చునని వారు తలంచిరి. వాడంత మార్గాయాసము నపనయించుచు వచ్చి మనపల్లెవాండ్రున్న తావున బెట్టెనుదింపి యుస్సురని చతికిలబడుచు 'భాయీ' నాకూ యింత పాన్సుపారియిస్తావ?' అనెను.

లచ్చన్న యనువాడు వెంటనే తనపక్కసంచిని దీసి యొక నాగవల్లీదళమును, రెండు క్రముక శకలములును యిచ్చి సత్కరించి 'ఏవూరన్నా మంది!' అని యడిగెను. ఆగంతకుడు లచ్చన్నయొసంగిన యాతిథ్యమును స్వీకరించి, తలపై నున్నగుడ్డచే ముఖస్వేదమును

దుడుచుకొనుచు 'సూది, అక్కడదవ్వు. మీది యేపూరయ్యా?' యనెను.

లచ్చన్న : మాది యీడకి దాపున్నేఉండే చూటపాళ్యంఅనేపల్లె

సాహేబు : ఆయన్ది యేపూర్?

లచ్చన్న : మా వూరే.

సాహేబు : సంతాకీవచ్చినారా భాయీ?

లచ్చన్న : అవునన్నా. నీవిపుడు యాడనుంచి రావడం?

సాహేబు : అరే, అల్లా, బలెబలె ఆయూవదంగాఉందిరా అబ్బా. నేను యిస్టేసైలుదిగి వత్తుండాను. ఈ వూర్కినేను కొత్త. ముందు రాజాకోటాకీ పోవాలి. సద్దా మీా రెవ్వో మంచోళ్లు దొరికారురా, అల్లా. పదిసలాములు మీాకీ.

మణిమెుకం : నీవు మోయాళ యాపూంన్నుంచి వచ్చావు?

సాహేబు : నాది పాలన్‌పూర్. ఆట్నుంచివచ్చాను. టేషన్ కాట్నుంచి యీాడకిరావల్నంటే పానాలు పోయిండాయిరా, అల్లా.

లచ్చన్న : పాపం. ఎండపొద్దు. నీ పేరేమన్నా?

సాహేబు : నాదీ పేరు అల్లాబక్షు. మీాదిపేర్లు యేమి, భాయీ?

లచ్చన్న : నా పేరు లచ్చన్న. ఈయన పేరు భద్రయ్య.

భద్రయ్య : ఈ పెట్టెవరిది?

సాహేబు : అరే గుగ్గూ. ఏమిట్లా అడుగుతావు? ఎవరిదన్నా యెట్లావత్తాది నాదగ్గికి? నాదే.

లచ్చన్న : కోపంసెయ్యొద్దన్నా. ఏమో తెలీకడిగిండాడు.

సాహేబు : మంచిది, లచ్చన్నా, మీారు నాకీ ఒకసిన్నమేలు సెయ్యాల్ల.

ఇరువురు : ఏమది?

సాహేబు : అరే, ఏమీ లేదు. ఆడనుకానానికి పోయ్యి ఒక కట్టబీడీలు తెత్తా. మళ్లా యీ పెట్టె యాడమోసుకపోను. దీన్ని మీ కాడ పెట్టిపోతా. సూసుకుంటారా ? ఇప్డొత్తా.

లచ్చన్న : మే మూరికి పోవల్నన్నాం, పొద్దై ఉండా.

సాహేబు : అరే, భాయీ, యిప్డొత్తా నాపెట్టె యిడిసి యాడపోతాను. ఇది అట్లాయిట్లా పెట్టె కాదు. దీన్లో సొమ్ము గిమ్ము ఉండాయ్. అందుకే మీ కాడ బద్రంగా పెట్టిపోదామనుకుండాను. ఎవ్రు లేని కాడా పెడ్తే యెవడయినా లప్పాయిత్తాడు. అందుకే సెప్పేది. మీరు ఒక మంచివాళ్ళు, జే, మీకీపైన నాకి నమ్మకం ఉంటాది. సూశావా, భాయీ,

మనపల్లెవాండ్రిరువురు ననుమానించుచు నొండొరులముఖావలోకనము గావించుకొనిరి, తమకు వృథాకాలహరణ మగునేమో యని జంకిరి. తుదకు సాహేబు మంచిమాటలతో నేదోయొకరీతి వారిని సమ్మతింపఁజేసి తనపెటికను వారిస్వాధీనపఱచి దాపునుండు నంగడికిఁ బోయివత్తునని చెప్పిపోయెను.

అతఁడు వెడలిపోయిన తర్వాత లచ్చన్నయు, భద్రయ్యయుఁ జేరి వానిపెట్టెయొక్కయందమును, దానికి వైవఁబడిన తాళమును గాంచి యాశ్చర్యముతో మాటాడుకొనసాగిరి. 'వీఁడు సూస్తే పనికి మాలోడు మన్నట్టుండాడు. ఇల్లాటి పెట్టె యీనికి యాడొచ్చిందేవి. దీన్లో సొమ్ములుండాయని సెప్పిపోయినాడు. యాడో ఆసొమ్ము యాడనన్నా దొంగతనం సేసినవో' యని లచ్చన్న యొకమాటనెను. అది విని వాని స్నేహితుఁడు 'మనకెందుకోస్. ఏమన్న ఉణ్ణిలే. అడు త్వరగావస్తే అంతేచాలు. బుద్ధిలేకుండ దీన్ని పెట్కుంటిమి. పొద్దు కూకుతావచ్చింది. ఊరు సేరేయాల్కి సీకటి పడ్తాది.' అనెను.

క్రమక్రమముగ భద్రయ్య యన్నట్టు పతంగబింబ మస్తాచలశిఖ రారోహణ మొనర్చెను. అస్తంగతభానుకిరణములు అహమహమికగను గృహమహోర్ణవముపైఁ బ్రసరించి యా పట్టణ రాజంబున శోకచింతయుంద మును సమకూర్చెను. మధ్యాహ్నమునందువలె నిపుడా వీథియందు జన సమ్మర్ద మంతగ కాన్పించుటలేదు. ఒకరివెంట నొకరు కొనువారును అమ్మువారునుకూడ నా స్థానమును వదలిపోసాగిరి. కొంతసేపటికే — అనగా — నించుకించుక నవతమస మలముకొనువేళ కాప్రదేశమున చాలవఱకు జనసంచారము తగ్గిపోయెను. ఒక క్షణకాలములోఁ దిరిగి వత్తునని చెప్పిపోయిన యల్లాభక్షు తుదకు రాత్రియైనను రాకుండుటను గాంచి వారు చాల దిగులొందిరి.

లచ్చన్న : ఒరే, భద్రయ్యా ! ఆ సాయేబు యిప్పుడొత్తానంటా సెప్పిపొయ్యి యింగా రాకుండాడే. ఏంసేత్తాము. యాడ పోయెనో గదా. ఇంగెక్కడ వుడుకుతా పోదామురా మాయబ్బా యీపూళ్లొ.

భద్రయ్య : వుండికేదే మ్రా, లచ్చన్నా. నాకు నూత్తే కొత్తోడు కనుక యాడన్న దోవతప్పి తిరుగుతుండాలని తెలుత్తా ఉంది, ఇంగీనకి వత్తాడంటా నమ్మెదెట్లా.

లచ్చ : ఉండొచ్చు. దోవతప్పిఉండొచ్చు. అయితే మనమిప్డేమి సేత్తాము. ఇదేదో పెట్టిపెట్టి పొయ్యిండాడే. దీన్నవిక్కిచ్చి పోదాము.

భద్ర : ఇచ్చేదెవ్వికి. ఇంగా కాస్సేవు సూత్తాముండు.

లచ్చ : అయితే యీపూళ మనము యూటపాళ్యానికి పోవేది లేదులే. ఈ రాత్రి కిడేసరి.

భద్ర : తాలుతాలు. ఆడెవ్వో వత్తుండారు. ఆ సాయేబే నేమో సూత్తాము.

అని వారిరువు రామార్గమున, బోవుచున్నయొక యువనను వ కుని విద్యుద్దీపకాంతిలోఁ బరిశీలించి చూచిరి. కాని యతఁ డాసాహేబు

కాదు. మరెవ్వఁడో. పాపము వారిరువురు మిగుల తహతహపాటైరి. ఎంత సేపు నిరీక్షించినను వాఁడు మరిగిడి రాఁడయ్యెను తుదకు వాఁడెందో త్రోవఁదప్పి యీ మహానగర మధ్యమున నేమూలనో పడియుండ వచ్చునని నిశ్చయించుకొని వారు వానికై కాచియుండుట నిష్ప్రయోజకమని తలంచిరి.

లచ్చ : భద్రా! ఇంగా ఆ సాయేబు వత్తాడనుకుండావా. యీాడ మాట. ఇంగీడ ఉంటే లాబం లేదు. ఈ పెట్నె మోసోకని మనూరికి పోదాంపద.

భద్ర : ఒకవేళ అల్లాబక్సు వచ్చి మమ్మల్ని పట్టుకొని యేమైనా సేత్తేయెట్లు ?

లచ్చ : ఇంగా యీాడ అల్లాబక్సుతా. అల్లాబక్సూరాడు, ఎవడూ రాడు. లెయ్యి లెయ్యేస్. పెట్టి నెత్తు.

భద్ర : దీన్ని యీాడ పెట్కుంటాము ?

లచ్చ : మాయింట్లో. ఒకాళ ఆ సాయేబు వచ్చి అడిగ్తే యిచ్చేస్తాను.

భద్ర : అదెందుకు. మా యింట్లోనే పెట్కుండాను లే.

లచ్చ : అట్లుకాదేస్. నీ యింట్లో ఉంటే ఒకాళ అయుప్ప వచ్చి యేమైన బెదిరిత్తే నీకు సరిగా మాట్లాడేది రాదు.

భద్ర : అంతా ఒస్తుందోస్. మాట్లాడేదాట్లో నీకంటె నేనేమీా తక్కువకాదు. నీకంటె హెచ్చే. ఏంభరవా లేదు. నాయింట్లోనే ఉణ్ణి.

లచ్చన్న : అట్లొద్దు. నా మాటివిను.

భద్ర : ఏంభయం లేదులే. నేనుంటాను.

లచ్చన్న : అట్లు కాదోయ్. దీన్ని నేనే తీసోకపోవల్ల.

యాలన్నంటావా? ఆసామీయేటుకు మొకట వకాల్తీనిచ్చి మంచిమాట్లా జేయాలకుకదా దీన్ని నాకు ఒప్పసెప్పి పొయ్యిండాడు. దాన్నుంచి యిది నాతోనే ఉండల్ల.

భద్ర: అట్లేమీ లేదన్నా, నీ తట్టేమి సూపి చెప్పలేదు. ఇద్దరు తట్టు సూసి చెప్పిండాడు. ఎల్లిపొయ్యేటప్డు నాతట్టే సూసి చెప్పిండాడు,

లచ్చన్న: లేదోస్ నీతో చెప్పనేలేదు. నీకెందుకీబరువు.

అని యాపెట్టె నెత్తి తలపై నిడుకొనంబోయెను. కాని భద్రుడు దండముల కవకాశ మియ్యక దానిని క్రింది కీడ్చి పట్టుకొని "లచ్చన్నా! ఈడ కొట్లాడేది బాగుండదు సూడు. మంచిమాట్లతో సెప్తాను. ఇది నాది. ఈ పెట్టె నాదగ్గుండల్ల." యనెను. ఆ మాటలకు లచ్చన్న మోము కినుకచే జేవురించెను. అది కాంచి భద్రయ్యకన్ను లెఱ్ఱపడెను.

లచ్చన్న: ఒరే, భద్రా! ఏమి తేలోన్నడు అంటా ఉణ్ణినాసిక-బాగా నేర్చుకుంటివికదరా.

భద్ర: నేర్చుకొనేది యేమి? నన్ను నమ్మించి సొల్లగయీ పెట్టిని మోస్కానిపోయి దీనిలోనిదంతా బాగా తిందామనుకుండావు కదరా, ఆ పని సాగేది లేదన్నా. నీవు నా కండ్లు మూయలేవు. ఇది నాది. నీవు ముట్టొద్దు.

లచ్చ: అయితే దీన్ని యిడిసేదిలేదా. ఇంగ పడతాయి సూడు.

భద్ర: (కోపముతో)—ఏమి, ఏమ్రా, కొట్తావా? నదీబక్కీర్తు పడని. నీతల పిచ్చిలాతాది. వ్రవనుకొండావు. తనమాటకు మేరకు దుడుకుబుద్ధి యగులచ్చన్న భద్రయ్యచెంపపై వొకద్రవేటు వైచెను. తోడనే భద్రుడు కశాఘాతమును దిన్న కాలకాకోదరమువోలె నెగిరి పడి లచ్చన్నశిఖను బట్టి వంచి మూపుపై నాలుగుదెబ్బలు వైచెను.

అంతటితో లచ్చన్న మానలేదు. వడ్డి యసలుతోఁగూడ దెబ్బలను తీర్చుకొనెను. ఇట్లే చూచుచుండఁగనే యాయిరువురికిని పోరు ఘోరమయ్యెను. ఒకరినొకరు తన్నుకొనుచు, తిట్టుకొనుచు, నుమిలికొనుచు నా వీధిలోఁ బోవువారి నందఱిని తమకడ కాకర్షించుకొనిరి. ఎందఱు వచ్చి విడిపించినను వారు తమజగడమును మానలేదు. కారణమును జెప్పరైరి. అసహ్యకరము లగుబండబూతులతో దెబ్బలాడుకొనసాగిరే కాని కలహకారణమునుమాత్రము నిరూపింపరైరి. వారట్లొక యరగంట తన్నులాడుకొనిరి.

అల్లాభక్షును మహమ్మదీయుఁ డాసందూకమునం దాభరణసందోహ ముండెనని చెప్పియుండెనుకదా. వాఁడద్దానిని తీసికొనిపోవుట కెంతసేపటికిని మగిడి రాకుండుటచే నింకెట్టును రాఁడనుతలంపుతో కడకు లచ్చన్నయు, భద్రుఁడును ఆశాప్రేరితులై మూఢబుద్ధులై యా నగలను దామే యపహరింపనగుయు నని సంకల్పించుకొనిరి. అందులో లచ్చన్నకు భాగమియ్యక యంతయుఁ దానే గ్రహింపవలయు నని భద్రుని యాశ. భద్రునకు జెందకుండ సర్వముఁ దానే యెత్తుకొని పోవలయునని లచ్చన్న యిష్టము. ఒకరినొకరు వంచించుకొన నెంచుట చేతనే యాగడబడ యారంభమయ్యెను—ఆహా! అమాయకులును, నిష్కల్మషచిత్తులును, మిత్రులును, నగువా రెంతశీఘ్రముగ ప్రబల విరోధులైరి. కారణమేమి!—ధనాశ. ధన మెవరి నేమి చేయఁ జాలదు.

వారిద్దఱిని జుట్టుకొని యొకపెద్దగుంపుచేరి యా పెనుగులాటను గాంచుచుండెను. అంత నా వీధిలోఁ దిరుగుచున్న రక్షకభటు లిరువు రాగందరగోళమును దూరమునుండి చూచి బిరబిర నామూకను త్రోసుకొని యాస్థలమునకు వచ్చిరి. లచ్చన్నయు, భద్రుఁడును వారిని

గాంచినైన జంకక మహారోషపరవశులై యింకను బ్రకల్భములాడు కొనుచునే యుండిరి. ఎంతసమాధానపఱచినను ఊరకుండకపోవుటచే కడకు పోలీసువారు కుపితులై వారిని రెండు తన్నులుతన్ని "ఓరీ గాడిద లారా! సమాచార మేమో తెలుపుదురా లేదా?" యని గద్దించిరి. మూపుపై రెండు లాటీపోటులు పడువేళకు వారికి దాపునఁ బోలీసువా రున్నారని తెలివి కలిగెను. తోడనే లచ్చన్న యా పెట్టెను వ్రేలితోఁ జూపి "చూడండయ్యా, యీపెట్టె నాది. వీఁడు తనదని కొట్లాడు తాడు." అనెను. భద్రుఁడు వెంటనే ముష్టిని బిగించి పండ్లుకొఱుకుచు "అరే, ఇది నాది. నీ దెట్లరా. ఈసారి అమాట్నంటే పండ్లూడదంతా". అని పౌరుషోక్తులాడెను. పోలీసువారు వానిని ప్రహరించి నిలిపి "ఓరీ· మీ దేయూరు?" అని యడిగిరి.

లచ్చ: మాది యాటపాళెం.

పోలీసు: ఇచ్చటి కెందుకు వచ్చియుంటిరి?

లచ్చ; సంతకు.

పోలీసు: వచ్చునప్పు డీపెట్టెను వెంట తెచ్చుకొనియుంటిరా?

లచ్చ: ఊ-ఇది నాది. నేను తెచ్చింది.

భద్ర: కాదు. కాదు. ఇది నాది. నేను తెచ్చింది.

ఉభయుల వాగ్వాదమును గాంచి యందఱు నవ్వుకొనిరి. "వీ రెవ్వరో యున్మాదు" లని పౌరులు తలంచిరి. రక్షకభటులా పేటికను బాగుగఁ జూచి, దానియందమున కచ్చెరువొంది యాపల్లెటూరివాండ్ర కట్టిచిత్రవస్తు వెందుండి వచ్చునని యనుమానమొందిరి. ఎంతనయ భయములతోఁ బ్రశ్నించినను వారు ఆ పేటిక తమదనియే వాదింప సాగిరి కాని వాస్తవస్థితిని తెలుపలేదు. తుదకు రక్షకభటు లది వారిది కాదనియు, నెందో తస్కరించుకొని వచ్చియుందురనియు శంకించి

"ఓరీ, మీరిట్లు కొట్లాడుటవలన లాభము లేదు. పోలీసుఠాణాకు రండు. ఇన్స్పెక్టరుగారు మీ వివాదమును బరిష్కరింతురు." అని వారిని చేయిపట్టి లాగిరి. లచ్చన్నయు భద్రుడును మాటాడ లేదు. "పోలీసుస్టేషన్" అనుటతోడనే వారిగుండె గుభిల్లు మనెను. అంత నాకర్మచారు లాపెట్టెను లచ్చన్న తలపైఁ బెట్టి "రండు" అని వారిరువురిని ఆ వీథిచివర నున్న ఠాణాకుఁ దీసికొని వెళ్ళిరి.

# రెండవ ప్రకరణము

## పేటికాంతర్గతము

అచ్చట రక్షకభటస్థానాధికారి వేణీప్రసాదరావు ఇతఁడు దత్తమండల నివాసి. ఉద్యోగవశమునఁ బోలీసు యిన్స్పెక్టరు పదవి ననుభవించుచు నిప్పు డహమదునగరులో నున్నాఁడు. అతఁడు నిండుజవ్వనమునఁ దన రారు మహాబలియుఁడు. ముఖ మతిగంభీరప్రసన్నభావ సంశోభితమై ప్రేక్షకుల నాకర్షించుచుండును. ఆ రాత్రి వేణీప్రసాదు కాన్స్టేబి లొకఁడు తాళవృంతముతోఁ జల్లనిగాలిని వీచుచుండ నానిశ్చబ్దసమయ మున హాయిగ బరధ్యానముతో నొక పడకకుర్చీపైఁ బరుండి యుండెను. అప్పుడు లోపలనున్న కాలపరిమాణయంత్రము టంగుటంగున నెనిమిది గంటలు కొట్టుటచే నతఁడు ఎదుటనున్న భటునితో "కృష్ణాజీ! నే నిప్పు డింటికిఁ బోయినత్తును. నా సైకిలెచ్చట?" అనెను. ఆ కాన్స్టేబిలు లోపలనున్న ద్విచక్రశకటమును దెచ్చుటకుఁ బోయెను.

ఆ సమయముననే వెనుకటి ప్రకరణమునఁ జేర్కొన్నయిరువురు పోలీసువారు వచ్చి వేణీప్రసాదునకు నమస్కరించి లచ్చన్నను భద్రుని నతని యెదుట నిలబెట్టిరి. ప్రసాదరావు వారినిఁగాంచి "ఓరీ, ఏమిసమా

చారము ? మీ రెవరు ? మీ చేతులపై నుండు పెట్టెయేమి ? ఎందైన దుముచ్చిలి తెచ్చిరా యేమి ? " అని ప్రశ్నించెను

పోలీసు : మహారాజ్ ! వీను దొంగలో మంచివారో తెలియదు కాని యీ యిద్దఱు నీ వీధిచివర నిలఁబడి యీ ట్రంకు విషయమై దెబ్బలాడుకొనుచుండిరి.

వేణీ : ఈ పెట్టె విషయమేమి ?

పోలీ : ఇది యెవ్వరిదో తెలియదు వీరిలోవీరు " నాది నాది " యని తగవులాడుకొనుచుండగా నిచ్చటికి పట్టుకొని వచ్చితిమి.

వేణీ : మీరు చూచినప్పు డిది యెవరికడ నుండెను.

పోలీ : వీరియొద్దనే, స్వామీ !

వేణీ : (లచ్చన్నతో) ఓరీ, ఆ పెట్టె నటనుంచుము, ఇది నీదేనా ?

లచ్చన్న : (భయముతోఁ జేతులు మోడ్చి) నా–నా–నా–దే.

భద్ర : లే–లే–కా–కాదు–అ–అ–ది–నా–నా–ది.

లచ్చ : కా–కా – కా–దు, స్వా–మీ –అది–నా– నా దే– ఈడబ్బాలకో–కోరి, వ–వ చెయ్యాలంటా–నూన్నాడు.

భద్ర : వాఁడు దొ–దొంగ–

అని యింకను నేమేమో యనఁబోవుచుండ వేణీప్రసాదు వాని నాపి " మీరింతసేపు కొట్టుకొని కలహించినట్లు కాదు. ఇచ్చట మీ యాటలు సాగవు. నిజముగ నీపెట్టె యెవరిదో వారు తీసికొనిపొండు. " అనెను. వెంటనే యిరువురును దానిపై జేతులువైచిరి. ఇన్‌స్పెక్టరు వారిని నిలిపి " ఇది యిరువురికిని జేరియుండదు, ఇందు మీలో నెవఁడో యొకఁడు దాని సొంతదారు కావచ్చును. లేకున్న మీరిద్దఱు దొంగలే. " అని గట్టిగ మాటాడెను. ఒకప్రక్క భయప్రచలితులగుచున్నను వారు తమలో నొకనిని వంచించి మఱియొకఁడా పెట్టెను పొంద

వలయునను ప్రబలమగు కోరికతో నది 'నాది' యని యొకఁడు, 'నాది' యని మఱియొకఁడు చెప్పుకొనుటనుమాత్రము మానలేదు. వారిపాత పాట నాలకించి విసుగొంద వేణీప్రసాదు తుదకు "అరే, సయ్యాద్ బేగ్! ఇది యీయిరువురికిని వద్దు. ఈపెట్టెను మోదికొనిపోయి స్టేషనున కవ్వలనుండు పాడునూతిలోఁ బడవైచిరమ్ము." అని యొక రక్షకభటున కాజ్ఞ నిచ్చుచు మరల పల్లెవాండ్రదెస మొగమై ఇది మీ కిరువురికిని సమ్మతిమేనా!" యని యడిగెను. ఇరువురికిని లేక పోవుట యదియొకరీతి తృప్తికావున వారు వెంటనే యందుల కామోదించిరి, అంత మేధానిధి యగు నా రక్షకభటోద్యోగి వాసనుమ్ముఖుఁడై యిట్లనెను. "దీనినిపట్టి చూడ నిది మీ యిరువురిలో నొక్కరిదికూడ కాదని తోఁచుచున్నది. మీలో నెవఁడైననొక్కఁడు దీనిని నిక్కముగ సొంతదారుఁడగుచో దీనిని కన్నార చూచిచూచి పోఁగొట్టుకొనునా? ఇది మీది కాదు కావుననే పోనిమ్మని యూరకుంటిరి."

అనవుడు లచ్చన్నయు, భద్రుఁడును విస్మయదృష్టులతోఁ బరస్పరము చూచుకొనిరి. అచ్చట నున్నవారంద ఱామాటలను విని యిన్స్పెక్టరు యథార్థము నూహించెనని యెంచి యతని బుద్ధిబలమును మెచ్చుకొనిరి. వేణీప్రసాదు లచ్చన్నను జూచి "ఏమట్లూరకుంటివి! ఈ పెట్టెను బావిలోఁ బడవైచి రావచ్చునా?" అనెను. వాడప్పుడు జంకుచు సన్ననియెలుంగుతో "ఇది నా—నాది" అనెను. భద్రుఁడు కూడ నదేమాట ననెను. అంత ఇన్స్పెక్టరు మరల పోనిండు, ఇది మీదగుచో దీని తాళపుచెవి నిటు తెండు." అని యడిగెను. వారిరువురును మరల బొమ్మరపోయి చూడసాగిరి, మాటాడుటకు నోరెగయ లేదు. క్రిందికిని మీదికిని జూచుచు నూరక నిలుచుండిరి. వేణీప్రసాదు తన తంత్రము పారినదని లోలో నవ్వుకొనుచు మరలమరల వారి నా

పేటికయొక్క బీగముచెవి నిమ్మని తీసిపెట్టెను. అందుకు లచ్చన్న "యింటిలో మఱచివచ్చితి" నని చెప్పఁగా భద్రుఁడు "పోఁగొట్టు కొంటి" నని చెప్పెను. వారి యనృతవచనముల నాలకించి యీసారి వేణీప్రసాదరావు క్రుద్ధుఁడై "ఓరీ" పశువులారా! మీ రెవరో దురాత్ములవలె నున్నారు. బీగముచెవినిమాత్ర మింటఁబెట్టి యీ పెట్టె నేల తెచ్చితివిరా? పోనిమ్ము. ఈ పెట్టెలో నేమేమి యుంచియున్నావో చెప్పుము చూతము." అని గద్దించి మొదట లచ్చన్న నడుగఁగా నాఁడు సాహెబు చెప్పినమాటలను స్మరించుకొని "సొ-సొమ్ములున్న-వి." అనెను. భద్రుఁడుకూడ నామాటనే యనెను. కాని యిరువురును లోపల నేమున్నదో యెఱుఁగరు. వివరమును తెలుపుమన్నప్పు డూరక "సొమ్ములున్నవి. సొమ్ములున్నవి." అని చెప్పఁదొడంగిరి.

దానిపై వేణీప్రసాదు ఆ యిరువురుకూడ నా పేటికకు హక్కు దారులు కారని గ్రహించి, యెందో దొంగిలించి యుండవచ్చు నని యనుమానించి మహోగ్రహగ్రస్తుఁడై లేచి లచ్చన్న నొకదెబ్బ, భద్రుని నొకదెబ్బవైచి "దుర్మార్గులారా! మీరు దొంగలు. వా స్తవస్థితి నొప్పుకొనరుకదా" అని యచ్చటనున్న యొక పోలీసుభటుని బిలిచి వారిని బాగుగఁ బ్రహరించి, యినుపకడ్డీలను కాల్చి నాలుకకు వాతలు పెట్టుమని చెప్పెను.

లయకాలకాలభైరవునిభంగి చూపట్టుచున్న యారక్షకభటుని కొరడాను సవరించుచు దాపరించుటనుగాంచి యా యిరువురును "అమ్మయ్యో, నిష్కారణముగ మాకేల యీ శిక్ష. తిన్నగ గ్రామమున కేగక గోతిలోఁ బడితిమి. ఈ సమయమునఁ గలరూపెఱింగించి తప్పించుకొని పోవుటే లెస్స" యని మనసున భావించి భయాతిరేకమునఁ జీత్కారమును జేయుచు "అయ్యో— అయ్యో— చెప్తాను.

చెప్తాము. కాపాడల్ల, ఉన్నసంగతి సెప్తాము" అని యఱచిరి. వేణీప్రసాదంత భటుల నాపి "ఏదీ చెప్పండు. ఈ పెట్టె యెవరిది ? మీ కెచ్చట దొరకినది ? మీ రెవరు ?" అని పృచ్ఛించెను. లచ్చన్నయే యప్పుడు ముందునకు వచ్చి తమచరిత్రము విశదముగ వినిపించెను.

లచ్చన్న చెప్పినదంతయు నాలకించి యందఱు విస్మయవిస్ఫారితులైరి. వేణీప్రసాదుకూడ నత్యంతాశ్చర్యచకిత చిత్తుఁడై "ఎన్ని గంటలప్పు డాతురక మీకడ కేతెంచెను ?" అని యడిగెను.

లచ్చ : సందివేళ, స్వామీ పొద్దుకూకేయాళ.

వే : తన దేయూరని చెప్పినాఁడు ?

లచ్చ : (జ్ఞాపకము లేనివానివలె) అదేదో, సెప్పిపోయాఁడు. గ్నాపకం లేదు.

అంతలో భద్రుఁ డడ్డువచ్చి "ఆ సాయేబు పాలక్పురమంట." అనెను.

హీంగా : పాలక్పూరా ! చిత్రముగ నున్నది. నాకుఁ జూడ వాఁడెందో యీయూర దారితప్పి తిరుగుచున్నట్టు తోచుచున్నది. ఓరీ, మీరు మీదికాని యీ వస్తువునుగుఱించి "నాది నాది" యని యసత్యము లాడి యెత్తుకొనిపోఁదలంచితిరి కాదా ? ఇది దొంగతనము కాక మఱేమగును ? మీకడ కాతురక యెంతసేపటికిని రానప్పుడు మీరు మాయొద్దకు వచ్చి యున్నసమాచారమును దెలిపి దీనిని మా స్వాధీనము చేయవలసియుండెను. ఇది మీ తప్పుకదా. ఇందుకై మిమ్ము శిక్షింపక విడువరాదు.

అనుటతోడనే యా యిరువురు గోలుగోలున నేడ్చుచు నతనిపాదములకడఁ బడి "మహాప్రభూ ! రక్షించల్ల. మీబిడ్డలము. మాకేమీ తెలియాదు. దేవ్రా, పల్లెవాళ్లము. ఏమో మన్నించిండేమి." యని పలుకీ

తుల నతని యెదుటఁ బ్రాఫేయుపడిరి. శేణీప్రసాదు సహాజము గుడు గా మయుఁ డగుటచే నాయకనాయకుల నేడ్పించుటచే లాభము లేదని యెంచి వారి కభయమొసఁగి కృష్ణాజీతో " కృష్ణా ! నీవు మఱికొందఱు రక్షకభటులతోఁ బోయి వీరు చెప్పినగుర్తులు కలమనుష్యుఁడీపట్టణమున నెందైన గాన్పించునేమో రేపటిదినములోగా కనుఁగొనుము. " అని చెప్పెను. ఇన్‌స్పెక్టరు చిత్తమూకస్మికముగ నొకసంశయాక్రాంతము య్యెను. ఆ యువనుఁడు తానాపట్టణమునకుఁ గ్రొత్తయగుచో మొగముకలుంగని యిరువురు పల్లెటూరివారిని నమ్మి తనయమూల్యాభరణపేటికను నా కిచ్చిపోవునా ? తనది పాలకాపూరని చెప్పినాఁడు. ఒకవేళ నామాట నిజమగుచోఁ బాలకాపూరు చిన్నగ్రామము కాదు. గ్రామస్థులవలెఁ గాక నగరవాసులు సాధారణముగ మఱియేపట్టణమునకేగినను దారుల విషయమై చిక్కులుపడరు. ఒకవేళ నట్టికొందర సంభాషించినను ద్వారలో నా కష్టమునుండి గట్టెక్కఁగలరు. ఇంతకు సమీపమునయున్న బీడీలయంగడి కేగినవాఁ డట్లే పోవుటకుఁ గారణమేమి ? గ్రద్దలెత్తుకొని పోయియుండునా లేక యూతావున నెందును వానికిఁ బోగచుట్టలు లభింపకుండునా, అల్లాభక్షి తనపెట్టె నాసించి మరల దానిని తీసికొని పోవుటకై రాకుండుట మిగుల చిత్రముగా నున్నది. వాఁడు బుద్ధి పూర్వకముగనే దాని నీయనాయకులచే నుంచి పోయెననుట స్పష్టము ఇట్లువాఁడు తప్పించుకొని పోవుట కేదేని ప్రబలకారణ ముండకపోదు. పెట్టెను తెఱచి చూచిన సంగతులు విశదము కావచ్చును. వాఁడు వీరితోఁ జెప్పిపోయిన ట్రింకు నగలుండవచ్చును. వీనిని వాఁడెందో యపహరించి తెచ్చుచు నెవరైనఁ జూచినఁ దాను పట్టుపడుదునేమో యను భీతిచే నీరీతి వీరి స్వాధీనము కావించి తానెందో పలాయితుఁడై యుండవచ్చును. అని యిట్టి యాలోచనాపరంపరలాతని హృదయమున

తోఁచెను. అతని కల్లాభక్షు నూతనుఁడు కావున నెందో దారితప్పి తిరుగుచుండవచ్చు ననుటకన్న రెండవయాలోచనయే సమంజసమని తోఁచెను. ఎట్లయినను పెట్టెను తెఱచి చూచుట మంచిది. ఒకవేళ నందున్నవి యాభరణము లగుచో వాని వివరమును పత్రికలలో వెలువరించిన బాధ్యు లెవరైన నుండిన వచ్చి తీసికొనిపోఁగల రని తలంచి యతఁడు వెంటనే సందూకమును దీయుటకు కొన్ని పనిముట్లు తెమ్మని యొక భటునితోఁ జెప్పెను. వాఁడు వానిని దెచ్చి భద్రముగ బీగమును దీయ యత్నించెను అందఱు మహోత్కంఠతులై చూచుచుండిరి. లచ్చన్నయు భద్రుఁడును యథార్థము బయలుపడునని వంగివంగి చూడసాగిరి. కొంతసేపటి కారక్షకభటుఁ డాబీగము నూడదీసి పెట్టెను తెఱచెను—అందేమున్నది ? పేటికనిండ కొన్నిబట్టలు భద్రముగా నదుమఁబడి యుండెను. అవి యందందు రక్తసిక్తములై యుండుటను గాంచి యందఱు విస్మయభయాకులితులైరి. ఇన్‌స్పెక్టరొకదాని వెంట నొకటిగా నాబట్టలన్నిటిని దీసి చూడఁగా నందొకబట్టమూట కనఁబడెను. అది సంపూర్ణముగఁ గీలాలప్లుతమై యుండెను. అందేదో కట్టఁబడినట్లుండెను. వేణీప్రసాదు తటాలున నంతయు గ్రహించినవానివలె "హాత్యా-హాత్యా" అని యఱచి యాగంటును విప్పెను—అందేమున్నది ! అతడూహించిన ట్లది హత్యయే !! ఒకానొక మానవశిరస్సందు బంధితమై యుండెను !!!

ఆ భయంకరదృశ్యమును గాంచిన యుత్తరక్షణముననే యచ్చట నున్నవారంద ఱొక్కమాఱు భయాశ్చర్యసంభృతచిత్తులై తుళ్లిపడిరి. అందఱికన్న నెక్కువగ మన గ్రామస్థులు చాల తత్తరిల్లిపోయిరి. ఆ పేటికయం దంగటి భయంకరవస్తు వొకటి భద్రపఱుపబడి యుండుట పాపము వారేమెఱుంగుదురు ! వారు గజగజ వణఁక దొడఁగిరి. ఇరువు

రొక్కమాఱు చేతులెత్తి "స్వామీ, ఎంత అన్యాయము. మోసపో తిమి—మోసపోతి" మని యఱచిరి. వేణీప్రసాదు తానూహించిన ట్లా దాభరణములు లేకపోవుటయే కాక వానికిమాఱుగ నొకరుధిరసిక్త మాంగము కానిపించుటంజేసి ప్రప్రథమమున నించుక యాశ్చర్య విహ్వలుఁడై పదపడి తానెంచినట్లిది మోసమని భావించి నాసించెను. అప్పుడతఁ డెల్లరు వినునట్లు బిగ్గఱగ నిట్లనెను. "ఆహా! ఎంతటిసాహస మిది! దురాత్ముఁడగు తురక యొకఁడో పాప మమాయకులగు సీఁకౌ వాండ్ర నెంత నెమ్మదిగఁ గూపములోఁ ద్రొబ్బిపోయినాఁడు. ఆయల్లా భక్షువాఁడు హంతకుఁడనుట విస్పష్టము. లేకున్న నితరుల ప్రోద్బల ముచే నిట్లీపెట్టెను గొనివచ్చి వీరిస్వాధీనపఱచి పోయియుండవచ్చును. వాఁడు మనఃపూర్వకముగనే యీపెట్టెను వీరికడ నుంచి తాను తప్పించుకొని పారిపోయెననుట యిప్పుడు తెల్లమైనది.—" ఆమాటల నాలకించి యందఱు జస్ఖితచేతస్కులైరి. "ఆహా! ఎవఁడావగ జంత యగు హంతకుఁడు! ఎంతసులువుగఁ దప్పించుకొని పాఱిపోయినాఁ" డని యందఱును ముక్కుపై వ్రేలుంచుకొనిరి. తోడనే వేణీప్రసాదు పోలీసుసూపరింటెండెంటుగారికి వర్తమాన మంపెను.

వేణీప్రసాదరా విదివఱకెన్నఁడు నింతటిభీకరహత్యాపరాధమును గనియెఱుఁగఁడు. అట్టివానినిఁ గూర్చి వినియుండినే కాని స్వానుభవము శూన్యము. నేఁడు ప్రత్యక్షముగ నొకటి యాకస్మికముగ నతని పాలఁ బడినది. అందుచేనతఁడు మున్ముందించుక జంకెను. అయినను ధైర్యవిహీనుఁడు కాలేదు. తానెంచినట్లా యల్లాభక్షువాఁడే హంతకుఁడని నిశ్చయించుకొని వెంటనే వాని యాకారాదులఁగూర్చి గుర్తులు లచ్చటనున్న భద్రయ్యలవలన తెలిసికొని యట్టివాఁడెందున్నను బట్టితెండని యానిమిషముననే కొందఱు కార్యశూరులగు కర్మచారుల నలుదిక్కులఁ బంపెను.

ఇంతలో సూపరెంటెండెంటుదొరగారి మోటారు వచ్చుటచే జను లందరు తొలగుచుక యెడముగా నిలిచిరి. వేణీప్రసాదతని నెమరొక్కని, యా ఖండితశిరమును జూపి యావద్వృత్తాంతమును దెలిపెను. దొర యతఁడు చెప్పినదెల్ల నాలకించి కొంతవఱకు తానుకూడ లోలోన విమర్శించుకొనెను "అయ్యా! వేణీప్రసాదరావుగారూ! మీ యభి ప్రాయము సమరోచితమే కాక నిక్కముకూడ నగునని చెప్పఁ గలను. ఈ పల్లెవాండ్రు నిరపరాధు లనియు నమాయకులనియు నేను కూడ నొప్పుకొందును. ఆ తురకయే హంతకుఁడు కాకపోయినను వాఁడు హంతకవర్గములోనివాఁ డనుట కెట్టిసందియమును లేదు." అనెను.

వేణీ: అయిన నిప్పు డీమృతుఁ డెవ్వఁడో కనుఁగొనవలయును కదా?

దొర: అగును. మఱియొక దీపమును తెండు. బాగుగఁ బరి శీలింతము.

భటుఁ డొకఁడు పోయి మఱియొక దీపమును దెచ్చెను. ఆ దీప కాంతిలో నందఱు చేరి యా మస్తకమును బాగుగఁ బరీక్షించి చూడఁ దొడఁగిరి. అది దీర్ఘశ్మశ్రుసంయుతమై యొక మహమ్మదీయునిదై యుండ వచ్చుననిమాత్ర మెల్లరు తలంచిరి. కాని యా సిరాభిక్యుఁ డెవ్వఁడో యెవ్వరికినిఁ దెలియరాలేదు. ముఖమంతయు శోణితార్ద్రమై యుండు టయేకాక యుందుందు వ్రణయుక్తమై యుండెను. ఆనవాలిడుట కెవ్వరి కిని సాధ్యము కాదయ్యెను. అశిర మెవ్వరిదో తెలియరాకుండెను. తుదకు ప్రసాదరావు "ఈ హత్యారహస్యమును భేదించుభారమును నాపై నుండనిండు. హంతకుఁ డెట్టివాఁడైనను, ఎందున్నను బట్టియే తీరుదును." అనెను. ఆ మాటలకు సూపరెంటెండెంటు హర్షప్రకటితమందహాసోదంచితముఖుఁడై "మీ యిష్టము. ఇది మీకు క్రొత్తయనుభవమును

కొందును. మిగుల జాగరూకుఁడవై నీ వగావించిన సర్కారు మన్ననలకు జనుల పొగడ్తలకుఁ గొదవ యుండదు." అని చెప్పి వేణీప్రసాదరావుతో మరల నుదయమున వత్తునని తెలిపి పోయెను.

## మూడవ ప్రకరణము

### మృతుఁడెవఁడు?

పల్లెవాండ్ర విషయమై వేణీప్రసాదునకున్న కొంత యనుమానము కూడ తీరినది. అయిన నతఁడు తీక్ష్ణదృష్టులతో మఱియొకమాఱు వారిని శిఖశిఖపర్యంత మాలోకించెను. వారు తమ సహజముగ్ధస్వాంతము కన్నులలోఁ దాండవించుచుండ మరలమరల నతని పాదములకడఁ బడి లేచుచుఁ దాము నిరపరాధుల మనియు, నేకర్మము నెఱుఁగమనియుఁ దమ్ము రక్షింపవలయుననియు దీనాననములతోఁ బ్రార్థించిరి. అప్పుడు ప్రసాదరావు లోలో నవ్వుకొనుచు నిఁకనీబీదల నేడ్పింపరాదని తలంచి "మీ విషయమై మాకుఁగల సంశయము లన్నియుఁ దీరినవి. మిమ్ముందు సాక్షులుగా నుంచుకొందుము. మీ విలాసమును జెప్పుఁడు, కావలసి యున్నది." అని వారిపేర్లను, తలిదండ్రుల నామధేయములు మున్నగు వాని నడిగి నోటుబుక్కులో వ్రాసుకొని "మిమ్ము మన్నించి విడిచి పుచ్చుచున్నాను. మేమెన్నఁడైన నీవిషయమై మిమ్మడిగినప్పుడు మీ రణుమాత్రమైన దాచక సాక్ష్యమియ్యవలయును." అనెను.

ఛప్పన్న-భద్రయ్య: సిత్తం, స్వామీ, సిత్తం. తామడిగినప్పుడు మేము సూసింది కాస్తయిన దాసుకోకుండా సెప్తాము. ఇంగ మేము పోవచ్చునా దేవా?

వేణి: ఇప్పు డెచ్చటి కేగెదరు?

భద్రు: ఈ వూళ్లోనే యెక్కడైన యింత తిండి తిని ఒకతావున పండుకొంటాము. ఇంక యీ యేళకాడ మా వూరికి పొయ్యేదెట్ల?

వేణి: మంచిది మీరింకఁ బోవచ్చును.

అని యటనున్న యొక భటునిఁ గాంచి కనుగీటెను. లచ్చన్నయు భద్రుఁడును బెబ్బులిబారినుండి తిరిగిపోవు మేకపిల్లలవలె నపారానంద పరవశులై యిన్స్పెక్టరుగారికి వంగివంగి పదిదండములుపెట్టి తమ కృతజ్ఞత వేయివిధముల వెల్లడించుచు నా స్థలమును వీడి కదలిరి. వారికిఁ దెలియకుండ రక్షకభటుఁడు వెనువెనుకనే వారి సంభాషణ నాలకించుచు వెళ్లెను—అదియే వేణీప్రసాదు కనుసన్నల కర్థము.

వేణీప్రసాదు మృతుని శిరస్సుతోపాటు పెట్టెనుకూడ తానా యుంచె భద్రపఱచి చాలరాత్రివఱకుండే యుండెను. అతనికి నిద్దుర రాలేదు. ఇంకెట్లువచ్చెడి? ఎప్పుడు హత్యారహస్యభేదనంబున కొడి గట్టుకొనెనో యానాఁడే యతనిపై నిద్రాదేవి కడకంటిచూపులఁ బఱపి నది. పట్టినకార్యము ఫలించుదాఁక శాంతచిత్త మతని కెచ్చటినుండి రాఁగలదు? హంతకుఁ డెవఁడను విషయమును విచారించుటకుఁ బూర్వ మిప్పుడతఁడు మృతుఁ డెవ్వఁడో కనుఁగొనవలసి యున్నది. అదియే యతని కార్యక్రమమునందలి ప్రథమశీర్షిక. ఆ రహస్యమును భేదించుట మాత్రము సామాన్యకార్యమా. అహమదునగరునంటి మహాపట్టణమున నేమూలనో యెప్పుడో జరిగిన చావును గుర్తించుటెట్లు? ఆ విషయమును దెలిసికొనుట కెట్టియనుసంధాన మావశ్యకమనుట చాలవఱ కతనికి సుబోధముకాదయ్యెను. స్టేషను చావడిలో నటునిటు పచారుల జేయుచు "స్థితినిఁబట్టిచూడ హత్య యొకటిరెండు దినములలోపుననే జరిగినట్లు విశదమగుచున్నది. నెత్తురింతడియైన నారలేదు. చంపఁబడిన

వాఁడెవ్వఁడో తెలిసిన తర్వాత సంగతుల భేదింపయత్నింపవచ్చును. ఉదయముననే రామగిరిపంతుగారికడ కేగి నిన్నటిదినమునఁ బురమున మరణసంఖ్యను మొదట నడిగి తెలిసికొనవలయును. అందుపై నేనైన నాపని సుకరమగు నేమో చూతము." అని యతఁడు పరిపరివిధముల నాలోచనానిమగ్నుఁడై యుండఁగనే రాత్రి తెల్లవాఱెను.

ఉదయమున వేణీప్రసాదు రామగిరిపంతుకడ కేగెను. రామగిరి యహమదునగరునఁ జావుపుట్టుకల గుర్తించు నధికారి. ఇన్‌స్పెక్టరుగారి రాక నాలకించి యతఁడు సవినయముగ నతని నెదుర్కొని పని యేమని యడిగెను. ప్రసాదరా వతనిని జూచి "అయ్యా! తమనుండి నా కొక యుపకారము కావలసియున్నది" యనెను.

రామ : ఏమి యుపకారము? చేతనైనది చేయుటకు సిద్ధముగ నున్నాను.

వేణీ : నిన్నటి దినమున నీనగరమున నెందఱుగతించిరో, వారెట్టివారో తాము నాకుఁ దెలుపవలెను.

రామ : ఇప్పుడు దానితో తమ కేమిపని?

వేణీ : కలదు. ఒక హత్యాపరాధరహస్యమును గ్రహింపవలసి యున్నది. చంపఁబడినవ్యక్తి యెవరో యింకను విశదముకాలేదు.

రామ : (వింతపడి) — హత్య జరిగినదా? ఎంతఘోరము? ఎప్పుడు జరిగినది?

వేణీ : మీ నుండి నాకుఁ గావలసిన యుపకారము కలిగినపిమ్మట నా సంగతిని నిర్ధరింపఁగలను. ఇప్పుడు నిశ్చయించుట కష్టము. సుమారొకటిరెండు దినములై యుండుననుకొందును.

రామ : ఈ రెండుదినములలో నాలెక్క కట్టిహత్యలు చేరి రాలేదు. అయినను చూతము రండు.

అని యతనిని లోపలికిఁ గొంపోయి పుస్తకముల దీసి చూచి "మహాశయా! ఇదిగో చూడుఁడు. మొన్న మూఁడు మరణములును, నిన్న నాలుగును సంభవించినట్లు మా లెక్కలవలన విశదమగుచున్నది." అనెను.

వేణీ: మొన్నటి దినమున సంభవించిన మరణములవివరమును దయచేసి చెప్పెదరా?

రామ: చెప్పెదను. మొదటి దొకభిక్షుకురాలు. కాలుజారి నూతిలో పడి చచ్చినది. రెండవ దొకమహమ్మదీయునింట శిశుమరణము. మూఁడవది యొక వైశ్యునింట స్త్రీమరణము.

వేణీ: నిన్న జరిగినవేవి?

రామ: రెండు శిశుమరణములు. మూఁడవదొకవృద్ధస్త్రీయొక్క మృత్యువు. తురీయము మన కొత్వాలుతండ్రి బాజీరావుగారి పంచత్వము. ఇందువలన తిమసంశయ మెంతవఱకు నివర్తితమైనది.

వేణీ: అణుమాత్రమైనఁ గాలేదు. మాకు దొరికినదొకఖండితశిరము. అది యొక పేటికయందు భద్రపఱుపఁబడియుండెను. ముఖముపై దీర్ఘములును, పలితములునగు శ్మశ్రువులు కానిపించుచున్నవి. అదియొక మహమ్మదీయునిదైనట్లు తోఁచుచున్నది.

రామ: అతఁ డెవఁడో తెలిసినదా? అయ్యో, మహమ్మదీయుఁడన జ్ఞాపకము వచ్చుచున్నది. ఈ ప్రపక్కపుటలో నొకమరణము సంభవించినట్లు గుర్తించినాను. చూడమఱచితిని. క్షమింపుడు.

వేణీ: ఎన్నఁడు జరిగినది?

రామ: నిన్ననే.

వేణీ: ఎవరది?

రామ: (చదివి)—మసక్కవీధిలోని తాజుద్దీన్‌ఖానను నతనిది.

జ్వరమువచ్చి మరణించినట్లు నిన్న వేకువజామున నే యువని తమ్ముడగు మహమ్మద్ యిస్మాల్ ఖాను వచ్చి తెలిపిపోయినాడు.

వేణీ : వారి యింటివసుస నంబరేది ?

రామ : **1415**

వేణీప్రసాదరా వాసంఖ్యను గుర్తువేసికొని కొంతకాలమువఱకు రామగిరివద్ద నేమేమియో మాటాడి యటనుండి కదలెను.

వేణీప్రసాదు తిన్నగ స్టేషనునకు తిరిగివచ్చెను. రామగిరి చెప్పిన సమాచారమువలన నతని హృదయము నావరించిన యనుమానాంధకార మెంతమాత్రము నిర్ధూతము కాలేదు. జరిగిన మరణములలో నొక్కటికూడ హత్యకు సంబంధించినది కాదు. ప్రసాదరావు పడకకుర్చీలోఁ గూర్చుండి పరిపరివిధముల నాలోచించుకొనెను. ఎంతసేపు విచారించినను దాని కంతము గోచరించలేదు. మఱియొకమారు రాశిరమును పరిశీలింప నెంచి యనఁ డాపెట్టెనుదీసెను. తలను చూచి వ్యక్తినిఁ దెలిసికొనుట దుస్సాధ్యమని గ్రహించినవాఁడయ్యు కేవలచిత్తచాంచల్యమునకు లోనై దానినూరక తిలకింపసాగెను. ఒకమారు అందు దట్టముగా పెరిగినగడ్డమును, అందు గాన్పించుగాయములనొకమాఱును, అరమోడ్పుకన్నులను మఱియొకమాఱును, వికారించిత ఫాలము నింకొకమాఱును చూచిచూచి విసిగెను. ఇంతలో నాకస్మికముగ నతనిదృష్టి పెట్టెలోపలిభాగమున నొకప్రక్క ప్రాయఁబడియున్న వ్రాఁతపైఁ బడెను. అతఁ డంతనాతురతతో దానినిఁ జూచి చదువుకొనెను. అది యొకరెవిలాసము. "అజీజుద్దీన్—మసక్—వీధి—అహమదునగరు" అని దానియర్థము. తోడనే ప్రసాదరావు నూతనాలోచనలోఁ బడిపోయెను. "ఇప్పటి కించుక మెఱుపు మెఱసినది. అజీజుద్దీననునతఁ డీసందూకమునకు సొంతదారు కావచ్చును. ఇది యతని

విలాసము కానచ్చును. ఇదివిక్రేతయొక్క విలాసము కాదు. కొన్న వాఁడు విలాసముగఁ దన పేరునిందు చిత్రించినాఁడు. ఇప్పుడీ యజీజుద్దీనను వానిని రప్పించిన సంగతులు కొంతవఱకుఁ దెల్లము కాఁగలవు" అని యతఁ డిగితిగఁదలపోసి వెంటనే యొకరక్షకభటునిఁ బిలిచి "ఓరీ! నీవు శీఘ్రముగఁబోయి మక్కాపీధిలో విచారించి యందజీజుద్దీనను మహమ్మదీయుఁ డెవఁడైన నుండిన నేను పిలుచుకొనిరమ్మంటి నని చెప్పి యిటకుఁ దోడితెమ్ము." అని చెప్పెను. ఆ సేవకుఁ డప్పుడే వెడలిపోయెను.

వేణీప్రసాదు స్వయముగఁ దానే పోయి యజీజుద్దీనువార్త నెఱుంగుట బాగని తలంచెను. కాని యంతలో సేవకునిఁ బంపుటలో నెట్టి పొరపాటును లేదని యూరటనందెను. పదిగంటలైనది. ఇన్స్పెక్టరు పెట్టెను మూసి వెలుపల వరాండాలో నటునిటు తిరుగుచు తన యాలోచనలందు నిమగ్నుఁడై యుండెను.

కొంతసేపటికి మక్కాపీధికి వెడలిపోయిన రక్షకభటుఁ డొక మహమ్మదీయ యువకుని వెంటఁబెట్టుకొని వచ్చెను. ఆతరుణవయస్కుఁడతి సుకుమారాకారునివలెఁ జూపట్టుచుండెను. వాని వయసంతయు నిరువదియేఁడులతిక్రమించి యుండదు. అతని దుస్తులను, ధరించినవజ్రపుటుంగరములను జూచిననతఁ డెవఁడో మహాధనికుఁడని తెలియవచ్చుచుండెను. ఆ యువకుఁడు విషాదలక్షణముతో వచ్చి ప్రసాదరావునకు సలాము చేసెను. ఇన్స్పెక్టరతని నొకచోఁ గూర్చుండనియమించి "అయ్యా! నీ పేరేమి?" అని ప్రశ్నించెను.

యువకుఁడు: నన్నజీజుద్దీనందురు. నానుండి తమకేదో శీఘ్రకార్యమొకటి కలదని మీ సేవకుఁడు తెలిపినాఁడు.

వేణీ: అవును. నిన్ను కొన్ని సంగతు లడుగవలసి యున్నది. మీ తండ్రి పేరేమి?

అజీ : అతని పేరు తాజుద్దీన్ ఖాన్.

వేణీ : ఆయన సజీవుఁడై యున్నాఁడా ?

అజీ : లేదు. మొన్ననే జ్వరగ్రస్తుఁడై యుండి పరలోకగతుఁడయ్యెనని తెలియవచ్చినది.

వేణీ : తెలియవచ్చినదనఁగా నెవరివలన ?

అజీ : మా పినతండ్రి మహమ్మద్ యిస్మాల్ ఖానను నతనివలన నిన్నవింటిని.

వేణీ : మీ తండ్రిగారి మరణకాలమున నీవూరనుండలేదా ?

అజీ : లేదు. మా మేనత్తను సందర్శించుట కంతకు నెలకు ముందే రాజకోటకు వెళ్ళియుంటిని. తుదకు మాతండ్రిగారి యాకస్మిక పంచత్వమును తెలుపుచు మా పితృవ్యుఁడు పంపిన తంతివార్తను గాంచి నిన్ననే మఱలివచ్చితిని.

వేణీ : తాజుద్దీను జ్వరముచే మరణించుట నిజమేనా ?

అజీ : మీ ప్రశ్న నాకర్థముకాకున్నది. నిజముకాక యిందసత్యమున్నదని తలంతురా ?

వేణీ. అట్లు నేను తలంచుటలేదు. అభిప్రాయము నిశ్చితమగుట కామాట నంటినంతే. అతనికి విరోధు లెవరైనఁ గలరా ?

అజీ : మహాశయా ! మీతలం పేదియో నాకు దురవగాహముగ నున్నది. మీ మాటలు వింతను గలిగించుచున్నవి. సమాచార మేదియో దయచేసి తెలుపఁగలరా ?

వేణీ : నీనుండి దాఁచుటకు కాదు. నిన్ను రప్పించినది. నిన్న సాయంసమయమున మాకొక పెట్టె దొరికినది—

అజీ : (ఆతురతతో)—పెట్టెయా ! ఎట్టిది ?

వేణీ : అది యొకనాగపూర్ యినుపపెట్టె.

అజీ: నా నొక్క టి యట్టిదే పోయినది. నేను రాజకోట కేగు నప్పుడు నా బట్టల నన్నిటిని దానిలో నుంచి పోయియుంటిని. ఇప్పుడది మూయింటఁ గాన్పింపకున్నది. మీకు దొరికిన దదే కావచ్చును.

వేణీ: అంతే కాదు. దానిలో నొకవిచ్ఛేదితమానవ శిరస్సు గోచరించినది.

అజీజు కారణమేమో కాని యీమాట నాలకించుటతోడనే భయోద్రిక్తతచే కాబోలు "హా-హా-శిరమా-విచ్ఛేదితమా! ఎవరిది! ఎవరిది!" అని యఱచెను.

వేణీ: చూపింతును. ఆతురపడకుము. పెట్టెలో నొకవిలాసము "అజీజుద్దీన్, మక్కా-వీధి——అహమదునగరు" అని యున్నది.

అజీ: ఆహా! అది నాదే. నాదే. మీ కెట్లు దొరికినది? అందులో నరునిశిర మెట్లుండెను. అంతయుఁ జిత్రముగ నున్నదే. అయ్యో! అది మీ కెందు దొరికెను!

వేణీ: మాకును వింతగనే తోఁచుచున్నది. నిన్న మునిమాపు వేళ నా పెట్టెను మోచికొనివచ్చి మహమ్మదీయుఁ డెవఁడో యుల్లాభఖును పేరివాఁడు మొబారక్‌వీథిలో నిరువురు పల్లెవాండ్రుండగాఁ వారిని నమ్మించి దానిని వారియధీనముఁ గావించి తాను పాఱిపోయి నాఁడు. అనితరువాత జరిగినసంగతులన్నియు నాతనికిఁ దెలియఁజేసెను.

అజీ: (మహాశ్చర్యముతో) ఆతల యెవరిదై యుండునని మీ యభిప్రాయము?

వేణీ: ఆ సంగతి మాకు విస్పష్టము కానందుననేకదా నిన్ను రప్పించినది! పెట్టె నీదగుటచే నీ పెట్టెలో నుండుతల యెవరిదో నీకుఁ దెలియకుండ నుండదనుకొందును.

అజీ: ఏదీ, దయచేసి త్వరగ నా కాఖండిత మస్తకమునుఁ జూపుము. నా మనసు తత్తరిల్లుచున్నది.

వేణీ—ఏల తత్తరిల్లుచున్నది ?

అజీ—కారణము దురూహ్యము. తర్వాత తెలిపెద.

అజీజుద్దీనుయొక్క వేగిరపాటును గాంచి ప్రసాదరావు మఱే మియుం జెప్పక యతనితో లోపలికేగెను. అజీజుహృదయము మేలకో దడ దడలాడుచుండెను. వేణీప్రసాదతనిని పేటికదాపునకుం గొంపోయి దానిమూతనుదీసి యందలిశీర్షమును జూపెను—అజీజొక్కక్షణమాత్రము దానిని విలోకించెను— అహా ! అతఁడేల యట్లున్నాఁడు ! కన్నులనీరు గ్రమ్ముకొన్నది — తలగిఱ్ఱున తిరుగుచుండెను కాబోలు — హృదయావేదన మించిపోయినది — వెంటనే యతఁడు 'హా ! తండ్రీ' అని కెవ్వునఁ గేకరించి క్రిందఁ బడిపోయెను ! ! !

# నాల్గవ ప్రకరణము

## అనుమాన మెవరిమీఁద ?

అజీజుద్దీన్ దుఃఖావస్థను గాంచి వేణీప్రసాదు విస్మయచకితుఁడయ్యెను. అతఁడా మూర్ధమును గాంచియేటికిట్లు శోకించుచున్నాఁడు ? తన తండ్రి యగు తాజుద్దీనుఖానుదేనా యా మస్తకము ! తాజుద్దీన్ మరణమునకు జ్వరము కారణమనికదా యతఁడు విన్నది. ఇప్పుడు తన వినికి పొరపాటా, లేక యజీజుద్దీను ప్రమాద మొందుచున్నాఁడా ? ఇకాస్పక్ర రిట్టియూహాలతో నొకక్షణకాలము గడపెను. అప్పుడతఁడజీజును గాంచి 'అయ్యా ! ఏమియీ తత్తరము ? నీసంతాపహేతువు విశదము కాకున్నది. ఈతల యెవరిదైనట్లు గుర్తుపట్టితివి ? అని యడిగెను.

అజీజుద్దీను మాటాడనేరఁ డయ్యెను. అతని కంఠము బాష్పజల నిరోధిత మైన ట్లుండెను. పొంగిపొంగివచ్చు దుఃఖతరంగము లశ్రుజలావతారము నొంది నేత్రద్వయద్వారములనుండి వెలికురుకుచుండెను. ఎట్టకేల కతఁ డించుక ధైర్యమును వహించి గద్గదకంఠముతో నిట్లనెను. "ఆర్యా! ఇంకేమున్నది? నేనూరలేనికాలమున భయంకరకృత్య మొకటి నడచి పోయినది. మాతండ్రి జ్వరనిహతుఁ డయ్యెననుట కల్ల. అతఁడు హత్యా కావింపఁబడినాఁడు. అతనిదే యీ శిరము —" అని యజీజిఁక మాటాడఁజాలకపోయెను.

వేణీప్రసాదు మనశ్చక్షువులముందు నిష్పాదోకయగాఢరహస్య గహ్వరము నోఱు తెఱచుకొని కాన్పింపఁదొడఁగెను. అతని కేమియు బోధపడకుండెను. ఒక్కత్రుటికాలములో నెన్నియోయూహాశకటము లాతని మస్తిష్కవీథిలోఁ బరుగిడి పోయెను. అజీజుద్దీ నిప్పు డాతల తన ప్రియజనకునిదే యని చెప్పినాఁడు. పొరపడ లేదుకదా! మహమ్మద్ ఇస్మాల్ ఖా నేల తాజుద్దీన్ జ్వరపీడితుఁడై మరణించెనని సమస్తలోక మును వంచింపవలయును? ఇందు కేదేని ప్రబలకారణ ముండితీరవల యును. మున్ముందు వారి కుటుంబచరిత్ర నెఱింగిన సంగతులు తెల్లము లగును. వేణీప్రసాదరా వీరీతిగఁ బర్యాలోచించుకొని పితృమరణకారణ మున — దుఃఖించుచున్న యజీజు ననేకభంగుల నాశ్వాసించుచు "భాయీ! పురుషచిత్తమును వహింపుము. ఇప్పు డిఁక నేడ్చి యేమి లాభము? ఇది నీతండ్రిశిరమేనా! బాగుగ గుర్తించితివా?" అనెను.

అజీజు దుఃఖము నుపశమించుకొననేరఁడయ్యెను. శోకతరంగతాడితమై యాతని వక్షస్థల మెగిరిపడుచుండెను. పాపమతఁ డెట్లూఱడిల్లగలఁడు. కన్నతండ్రి ఖండితోత్తమాంగమును గాంచి శోకింపని కఠినకఠినాత్మ కుమారుఁ డుండునా? అందును నజీజుద్దీను కోమల హృదయుఁడు ఎట్టకేల

కతఁడు కన్నీరు దుడుచుకొనుచు "అయ్యో, జనకా! ఇంతటితో మనకు ఋణముతీరెనా? ఇంకెట్లీదుర్భరశోకమును భరింపఁగలను. ఆహా! ఇన్‌స్పెక్టర్‌జీ! ఇది మా తండ్రిగారిశిరమే-అయ్యో-అయ్యో!" అని విలపింపసాగెను. ప్రసాదరావునకుఁగూడ కన్నులలో నీరు తిరిగి పోయెను. "మిత్రుఁడా! నీ దుఃఖమును మాని నా యడుగు ప్రశ్నలకు సదుత్తరము నిమ్ము. ఇది యేడ్చునకు సమయము కాదు. ధృతిదూలి కూర్చున్నచో కార్యము చెడును." అనెను. అజీజించుక యూఁజడిల్లి "ఆర్యా! మీరడుగదలంచినదంతయు నడుగవచ్చును. మీ యెదుట నొక్కసంగతిని దాఁచుట లేదు." అనియెను.

వేణీ: మీ పినతండ్రి మీ యింటనే యున్నాఁడా?

అజీ: అవును. అతనికి వివాహము లేదు. మాతండ్రి తనజీవిత కాలమున నతనికిఁ బెండ్లి చేయవలయు నని యెంతయో యత్నించి తుదకు నిఫలమనోరథుఁ డయ్యెను.

వేణీ: ఇస్మాయిలు పెండ్లి కియ్యకొనకపోవుటకుఁ గతమేమి?

అజీ: అయ్యా, మీకడ దాఁచుసంగతి యొక్కటియును లేదు. అతఁడు దుష్టస్వభావుఁడు. కపటచిత్తుఁడు. స్త్రీలోలుఁడు. నిష్కారుణ్య చిత్తుఁడు. కృతఘ్నుఁడు, ఘోరపాపి.

అజీజు చెప్పినదాని నాలకించి వేణీప్రసాదు వింతపడి చూచెను. ఆ వాగ్ధోరణియం దతిమాత్రముగ జుగుప్సామర్షలు మిళితములై యుండెను. అతఁడు కొంతవడి యూరకుండి మరల నిట్లనెను. "ఇస్మాయిల్‌ఖానంత కుటిలవర్తనుఁడా!"

. అజీ: నిస్సందేహముగ. మా తండ్రి మోసపోయి కాలాహి నోడిలోఁ బెట్టుకొని పోషించెను.

వేణీ : అజీజ్ ! నీ మాటలనుబట్టి మీ పినతండ్రియెడ నాకిం చుక సంశయ మొదవుచున్నది. ఇస్మాలునుండి మీ కేదో యుపకారము జరిగియుండునని యెంతును.

అజీజు మాటాడక తలవాల్చెను. ఆమౌన మర్ధాంగీకారముగా వచ్చునని ప్రసాదరావు తలంచెను. ఆ రహస్య మేదియో భేదింప నెంచి "ఏమూరకుంటివి ? నే నెంచినట్లు మీ కతఁ డపకారియేనా ?" అనెను.

అజీ : అయ్యా ! దాఁచుటచే లాభము లేదు. వినిపింపరాని వార్తనైనను మీ యెదుట చెప్పవలసినదే. అట్లు చేయకున్న మాతండ్రి గారికి ఘోరమగు ద్రోహమొనర్చినవాఁడ నగుదును.

వేణీ : అవును. ఆమాట నిజము. ఇప్పుడు మేమీహత్యారహస్య మును భేదింప సమకట్టి యున్నాము. నీకుఁ దెలిసినదంతయుఁ జెప్పి మాకీ సమయమునఁ దోడ్పడిన మీతండ్రియాత్మ యంతటితోనే తృప్తిని వహించును.

అజీ : కావలసినదంతయు నడుగుఁడు. తెలిసినంతవఱకంతయు విశదము కావింతును,

వేణీ : హంతకుఁడు నీ పెట్టెలోనే యీ శిరముంచుటకుఁ గారణ మేమి ? ఇది వాని కెట్లు లభించెను ?

అజీ : ఎట్లో సంగ్రహించినాఁడు.

వేణీ : ఇప్పుడు మీ యింట నీపెట్టె లేదా ?

అజీ : లేదు. నేను రాజకోటనుండి మఱలివచ్చినంతనే యిది లేదని గ్రహించితిని.

వేణీ : మీయింటివారి నడిగితివా ? వారేమనిరి.

అజీ : తమకు తెలియదనిరి.

వేణీ : పరులెవ్వరైన తస్కరించియుందురని నమ్మెదువా ?

అజీ : మాయింట నీనడుమ నేదొంగతనమును కాలేదు. సాధారణముగ వచ్చిపోవువారి కిది లభించునట్టి స్థలమున నుండలేదు.

వేణీ: అయిన నిది హంతకుని కెట్లు దొరికియుండును ?

అజీ: అయ్యో! ఇంటిదొంగ నీశ్వరుఁడైన పట్టలేఁడు కదా. యిదమిత్థమని యెట్లు చెప్పఁగలను ?

వేణీ: అయిన నింటివారే యీ ఘోరము నడపియుందురని తలంతువా ?

అజీ: అదియే నా యనుమానము.

వేణీ: మీ యింట నిప్పు డెవరెవరు కాపురమున్నారు ?

అజీ: మా సవతితల్లి రజియాబీబీ. పినతండ్రి మహమ్మద్ యిస్మాలు. మఱికొందఱు సేవకులుమాత్ర మున్నారు.

వేణీ: ఇందులో నెవరిపై నీ సంశయము ?

అజీ: మా పినతండ్రి ఇన్మాలుమీఁద.

వేణీ: అతనిని నీవు శంకించుటకుఁ గారణమేమి ? మీతండ్రికిని, యిస్మాలునకును అన్యోన్యవిరోధభావములేమైన నుండెనా ?

అజీ: అవును. మూఁడునాల్గు నెలలనుండి యెక్కువగానున్నవి.

వేణీ: కారణమేమి ?

అజీ—పెద్దయింటివారిసంగతి, చెప్పరానిదైనను చెప్పకతప్పదు. దురాత్ముఁడగు యిస్మాలు వృద్ధుఁడగు మాతండ్రిని వంచించి యాయన ద్వితీయజాయ యగు రజియాబీబీని తనవశము కావించుకొనుటే యిందుకుమూలహేతువు.

వేణీ—మీతల్లి జీవించి యున్నదా ?

అజీ—లేదు. మాతండ్రిగారికి రెండువివాహములు జరిగినవి. ప్రథమకళత్రమువలనఁ జిరకాలము వఱకు సంతానలాభము చేకూర మిచే నతఁడు మరల రజియాబీబీని వివాహమాడెను. ఈమె సౌందర్య

లావణ్యముల కెంతో పేరుపొందినది. అప్పటికికూడ నిస్మాలుఖాను మాయింటనే యుండెను. మాతండ్రిగా రెంతబోధించినను వినక వేశ్యా లంపటుఁడై, దుర్మార్గ ప్రవర్తనుఁడై తిరుగుచుండెను. అయినను భ్రాతృప్రేమచే నతనిని మాతండ్రియింటినుండి తఱుమఁగొట్టఁడయ్యెను. ద్వితీయలగ్నానంతరము దైవవశమున నొకటిరెండు యేఁడులకే నేను మొదటి భార్యకు జనించితిని. అప్పటికి నాపినతల్లి యింకను బది యేడులబాలికయఁట. క్రమక్రమముగ వయసుమీరుకొలఁది నామెకు మాతల్లిపై సపత్నీమత్సర మతిశయించుటయే కాక వృద్ధుఁడగు మాతండ్రిపై నొకరీతిజుగుప్సకూడ జనించెను. ఈనడుమ ప్రబలాఘ పూరితుఁడగు నిస్మాలునకును ఆపాపమతికిని ప్రణయచేష్టలు ప్రారంభ మగుటచే నామెదుర్బుద్ధి ప్రబలుటకుఁ గారణ మయ్యెను. అదిమొదలు వారిరువురికి నామీఁదను, మాతలిదండ్రుల మీఁదను ఈర్ష్యాక్రోధము లుప్పతిలసాగెను. తుదకొకనాఁడు మాతల్లిని వారిద్దఱును చేరి విష ప్రయోగముచేఁ జంపివైచిరి. అయ్యో! గృహచ్ఛిద్రములు చెప్ప నలవికాదు. అయినను నిప్పట్టున భవాదృశులయెదుట దాచఁదగిన దొక్కటియును లేదు. అట్లుమాప్రియజనని యంతమొందిన తర్వాత నాపాపులయన్యోన్యప్రేమ మఱింతసుదృఢమై బహిరంగపడెను. ఈవిప రీతమునుగాంచి మాతండ్రి తమ్ముని దండింపనులేకఁ యతనిదుర్వృత్తి మును సహింపనులేక లోలోన కుమిలికుమిలి మనోరోగములకు లొంగి పోయెను. తనభార్య నెంతో బెదరించెను. తమ్మునితోఁగూడ నొక నాఁడు తీవ్రముగ కలహించెను. కాని లాభముమాత్రము లేకపోయెను. ఇస్మాలునకు మఱింతరోషము ప్రబలెను. వృద్ధుఁడగు మాతండ్రి యిట్లు తమస్వేచ్ఛావిహారమున కంతరాయుఁడై యుండుటచే నత నినిఁగూడ నెట్లయినఁ గడతేర్పవలయు నని యత్నించుచున్న ట్లప్పు

డప్పుడు వారిచేష్టలవలన నూహించితిని. కాని నేను సదా యతని ప్రక్కఁ బాయకుండుటచే వారియాటలు సాగినవి కావు. పిమ్మట నెల క్రిందట మామేనత్త కతితీవ్రమగు జాడ్యము సంభవించుటచే నే నెంత చెప్పినను వినక మా తండ్రిగారు బలవంతపెట్టి, తన కేమియు భయ ముండదని చెప్పి నన్ను రాజకోట కనిపిరి. నేను తిరిగివచ్చునంతలో నిట్టి ఘోరము నడచిపోయినది.

వేణీ : రజియాబీబీనిగురించి నీ యభిప్రాయ మేమి? ఆమెకూడ నీ కుట్రలోఁ జేరియుండునని భావింతువా?

అజీ : మహాశయా! విషయము లున్నవున్నట్లు తెలిపితిని. అందుపై విమర్శించి యనుసంధానము గావింపుఁడు! నిజము నిలుకడ మీఁద తేలఁగలదు.

వేణీ : నీ విప్పుడు చెప్పినయుదంతమునుబట్టి నాకుఁగూడ నిస్సాల్ ఖాను విషయమై సంశయ మొదవుచున్నది. మీతండ్రినట్టి యపాయ కరమగు తావున నొంటరిగ విడిచి పోవుట నీది సాహసము కాదా?

అజీ : అవును. కాని యాతని ప్రోద్బలము మిక్కుట మగుటచే నేనట్లు చేయక తప్పదయ్యెను.

వేణీ : నిన్న నీవు రాజకోటనుండి తిరిగివచ్చిన తర్వాత మీపిన తండ్రి తాజుద్దీను జ్వరపీడితుఁడై మరణించె నని చెప్పినప్పుడు నీవా మాటను విశ్వసించితివా?

అజీ : ప్రప్రథమమున నమ్మితిని. కాని మాతండ్రి కిష్టులైన యొకరిద్దఱింటిసేవకులు నను డాసి తాజుద్దీన్ రోగగ్రస్తుఁడై గతించె నని చెప్పుటకవకాశము లేదనియు, అతనికిఁ జేయవలసినకర్మ యేమియు నిస్సాలు జరుపలేదనియు, తుద కతనికళేబర మతిరహస్యముగఁ గొంపోఁబడెననియు, ఆ సమయమున నెవరో యిస్సాలునకుఁ గావలసిన

వారొకరిద్దఱు వచ్చియుండిరనియుఁ జెప్పిరి. అప్పటినుండి నాకనుమానము కలిగి యీరహస్యమేమో తెలిసికొనుటకై యత్నింపఁదలంచితిని.

వేణీ : అజీజ్ ! ఆ విషయమును మేము కనుగొందుము. ఇప్పుడు నేను మీ యింటికి వచ్చి విచారించెదను. ఇందును నీవేమందువు ?

అజీ : నేనేమందును ? మీరాపని గావింపవలయుననియేకదా నేనింతదూరము మీకు సర్వము వినిపించినది. హత్యజరిగిన రాత్రి గడచిన విశేషముల నన్నిటిని చూచిన సేవకు లొకరిద్దఱు కలరు. వారిచే తగినసాక్ష్యమిప్పింతును. మీ రిస్మాలునుకూడ విచారింపవచ్చును.

వేణీ : నీవు మాకు మహోపకారముఁ గావించితివి, ఇందుచే మీ తండ్రిగారు పరలోకమున సంతసింపఁగలరు. విశేషశ్రమ లేకయే యిందలి రహస్యముల ననేకములను నీ మూలమున వినఁగల్గితిని. మున్ముందు నాకిదియెంతో సహకారి కాఁగలదు.

అజీ : మీరెప్పుడు మాయింటికి వత్తురు ?

వేణీ : ఈదిన మెప్పుడో యనుకూలసమయమును జూచుకొని వత్తును. మారాకనుగుఱించి పరులతోఁ జెప్పకుము.

అజీ : అయ్యో ! నాకాసంగతి తెలియదా ? ఇప్పుడు నేనిచ్చటికి వచ్చుటకూడ నిస్మాల్ ఖానునకుఁ దెలియదు. నేను వచ్చునప్పుడతఁడింట లేఁడు.

వేణీ : మంచిది. నీవిపు డింక నింటికిఁ జనుము.

అజీజుద్దీను వెడలుటకు లేచెనుకాని యతనిదృష్టులు మఱియొకమాఱు పటముపైఁ బడెను. అతఁడు పూర్వశోకమును స్మరించుకొని "హా ! తండ్రీ ! " యని కన్నీరుఁ గార్చెను. వేణీప్రసాదరావాతని ననేకరీతుల నాశ్వాసించి యింటికి సాగఁబంపెను.

# ఐదవ ప్రకరణము

## మహమ్మద్ యిస్మాల్.

అజీజుద్దీన్ పితృవ్యుఁ డగుమహమ్మద్ యిస్మాల్ ఖాను తనసోదరునికన్న నిరువదిసంవత్సరములు చిన్నవాఁడు. వీరిరువు రేకోదరులుకారు. అన్నదమ్ములబిడ్డలు. అయినను దోఁబుట్టువు తనకు లేనికారణమునఁ దాజుద్దీ నిస్మాలునే సహోదరునిగ భావించి ప్రేమచే బుజ్జగించుచుఁ దనయింట నుంచుకొనెను. కాని చిట్టచివరకు దుర్హృదయుఁడగునిస్మాలుఖా నెంతకృతఘ్నత చూపినది యజీజు చెప్పినకుటుంబచరిత్ర వలన విశదమైనది. అజీజుద్దీను నన్నృతము నాడలేదు. అతఁడన్నట్టిస్మాలు రజియాను తనమోహపాశమునఁ దగిలించుకొని యన్నను మోసగించినమాట నిక్కము. మక్కావీధిలోఁ బలువుర కీసంగతి తెలియును.

ఇస్మాల్ ఖా నాజానుబాహుఁ డగుసమున్నత గౌరవర్ణవిరాజితమూర్తి. ముఖమునం దొకవిధమగు నాకర్షణప్రభ కలదు. నాఁటిసాయంసమయమున విలాసప్రియుఁడగు నతఁడు వింతదుస్తులను ధరించి యొకసుందరమందిరమున నుపవిష్టుఁడై తమయింటిగుమాస్తా యగు రోషికావారా యనువానితో నేమియో మాటాడుచుండెను. వాఁడందుకు తగినసమాధాన మిచ్చుచుండెను. వారుబిగ్గఱగ మాటాడినప్పుడు వినవచ్చిన సంభాషణమాత్ర మీవిధముగ నుండెను.

ఇస్—రోషిన్! పోలీసువారు నామాటను నమ్మినట్లున్నది.

రోషి—అవును, మహారాజా! వారేమో నమ్మిరి కాని లోకమును నమ్మించుట కష్టముకదా. అనేకు లనేకరీతులఁ జెప్పుకొనుచున్నారు.

ఇస్—ఏమని యనుకొనుచున్నారు?

రోషి : మీరు మీ యన్నగారి శవమును మతాచారము ననుస రించి సాగించుకొనిపోనందున జనులు పలురీతుల సంశయించుచున్నారు. కొంద ఱతనిని మీరేమైన హత్య గావించినారేమో యని కూడ శంకించుచున్నట్టు వింటిని.

ఇస్ : కాకతాళీయముగ సంభవించిన యీ ఘోర హత్యాప రాధ మెచ్చట నాపైఁ బడునో యని నాకుఁ గూడ మిగుల భీతిగ నున్నది. ఇది తప్పించుకొనుట కుపాయమేమైనఁ దెలుపఁగలవా ? నాకు నీకన్నఁ బరమాప్తుఁడు లేఁడుసుమా.

రోషి : నా కేమియుఁ దోఁచకున్నది. భావికార్యస్థితినిఁ దలంచు కొన్న నా హృదయము చెదరిపోవుచున్నది. అజీజుద్దీను కూడ మీ విషయమై యిప్పుడు సంశయించుటకు మార్గ మేర్పడినది. అతఁ డూర కున్న కార్యమంతయు నిమ్మళముగ సాగిపోవును. పోలీసువారి యెదుట తన యనుమానమును గూర్చి ఫిర్యాదునిచ్చిన మిగుల చిక్కు కలు గుటయేకాక మిమ్ము వారు కారాగారనిబద్ధులఁ జేయుట నిజము.

ఇస్ : అయిన మనమిప్పుడు సామోపాయమున నజీజును మన యధీనముఁ గావించుకొనుట మంచిది కదా.

రోషి : నాకును నదియే సమంజసమని తోఁచుచున్నది. అతని యెడ మీకుఁగాని. బీబీగారికిఁగాని యెట్టి యసూయయు నున్నట్లు తెలుపరాదు.

ఇస్ ! అవును. ఇప్పట్టున నిది మేలైనయుపాయము. పోయి వాఁడింట నున్నాఁడేమో పిలుచుకొని రమ్మా. తగినరీతిని వానితో మాటాడి వానికి నాపై నెట్టిసంశయము లేకుండఁజేయ యత్నింతును.

రోషిణి వారా వెడలిపోయెను. ఇస్మాల్ ఖాను కన్నులు మూసి కొని పాలు త్రాగుచున్న మార్జాలమువలె పిచ్చియాలోచనలఁ గావించు

చుండెను. పరోక్షమున జరుగు నాటక మతని కేమి తెలియును ! అజీజును నమ్మించి తనవలలో వైచుకొనఁ జింతింపసాగెను. అజీజు తనవశుఁడైన తాజుద్దీన్ హత్యాపరాధమునఁ దన్ను శంకించువా రుండరనియు, తదనంతర మొకనాఁడజీజును గూడ నిగూఢమరణముపాలు గావించి రజియాతో సమస్తభోగభాగ్యము లనుభవింపవచ్చు ననియు నామంద మతి గాలిలో గోపురములు నిర్మించుచు పైయంతస్తు మెట్లెక్కి-పోయెను.

అతఁడట్లు వెడలిపోయిన యొకటిరెండు నిమిషములకే మన వేణీ ప్రసాదరా విద్దఱు రక్షకభటులతో నచ్చటికి వచ్చెను. ఆ యుత్తరక్షణ మున నే రోషిన్‌వారా యజీజును వెంటఁబెట్టుకొని వచ్చెను. ఇస్మాల్ ఖా నందు కాన్పింపనందున నతఁడు జనానాలోనికి పోయియుండు నని తలంచి రోషిన్ తమయింటికి వచ్చినవారిని సున్నింపకుండుట బాగుకాదని యెంచి పోలీసు వారిరాకకు లోలోన విషాదాశ్చర్యచకితుఁ డగుచున్నను వేణీప్రసాదరావు నొక యాసనముపైఁ గూర్చుండఁ బెట్టి యజీజును గాంచి "అయ్యా! మీ పినతండ్రిగారు మీతో మాటాడవలయు నని యున్నారు. దయచేసి రావలయును తమరు వచ్చువఱ కిన్‌స్పెక్టరుగా రిండే యుండఁగలరు." అనెను. అజీజు కదలలేదు. "నా కతనితో ముచ్చటింపవలసిన రహస్యము లేవియు లేవు. అతనినే యిందు తోడితెమ్ము" అని యుదాసీన భావముతోఁ బ్రత్యుత్తర మిచ్చెను. రోషిన్ మౌనవదనుఁడై మఱియేమియో చెప్పఁ బోవుచుండ వేణీప్రసాదు వారినిఁ జూచి "అయ్యా! మీ యజమానున కొకమాఱు రమ్మని చెప్పఁగలవా !" యనెను.

రోషిన్ : మహారాజా ! అతఁ డిప్పుడు జనానాలో నున్నాఁడు. మాబోంట్లచ్చటి కేఁగరాదు. దాసీజన మెవ్వరు నింట లేరు.

వేణీ: అజీజుద్దీను నిరభ్యంతరముగ నచ్చటికిఁ బోవచ్చును కదా?

రోపిన్: పోవచ్చును. కాని—

వేణీ: "కాని" యేమి! అతఁడు పోవుట కెట్టిమాటంక మున్నది?

అని వీరిట్లు మాటాడుకొనుచుండగనే మ్రొక్కఁబోయినదేవుఁ డెదురైన ట్లిస్మాల్‌ఖానే మెట్లు దిగివచ్చెను. పాప మాకస్మికముగ నతనికి పోలీసువారిదర్శన మైనది. వారిలో నజీజుకూడ దృశ్యుఁ డయ్యెను. తోడనే యతని హృదయమున నవాచ్యభావోదయ మగు టచే మేనెల్ల నొకమాఱు చంచలించెను. ఎవరో క్రిందిగదిలో మాటాడు చుండి రని వచ్చెను. కాని రక్షకోద్యోగు లని తెలిసియుండిన నాతఁడు వచ్చియుండఁడు. కాని యిప్పుడు వెనుకకుఁ బాఱిపోవుట కవకాశము లేదు. అట్లుచేసినఁ బోలీసువారికి నిక్కముగఁ దనపై గాఢసంశయము నెలకొనుననుట నతఁడు గ్రహించెను. ఇదియుఁగాక ఇస్మాలు కాన్పించి నంతనే వేణీప్రసాదు "అయ్యా! రమ్మ! నీకొఱకే వేచియున్నాము" అని పిలిచెను. పాప మతఁడు విధిలేక వచ్చి యట కూర్చుండెను. అతఁ డంత భావగోపనఁ గావించి లేనియుల్లాసము నభినయించుచు వేణీ ప్రసాదును గాంచి, "మహాశయా! కుంటివానిపై భాగీరథి ప్రవహించి నట్లు మీరు వచ్చి మా మందిరమును పవిత్రముఁ గావించితిరి. తమ రాకకుఁగత మేమి?" అనియెను.

వేణీ: ఇస్మాల్‌జీ! పని లేనిచోఁ బరులయిండ్లకు మే మేల వత్తుము? ఒక హత్యావిషయమై నిన్ను కొన్నిసంగతు లడిగి సంశయ నివారణ నొందవచ్చితిమి.

ఇస్మాయల్ ఖాను మనసుననే భయకంపితుండయ్యెను. అతని మేను జల్లుమనెను, అతని కేమియు బోధపడలేదు. ఎట్టకేల కతండు సంక్షోభిత చిత్తము నించుక సద్దుకొని, "అయ్యా! మీ మాటలు నాకు వింతగా నున్నవి. హత్యావిషయ మేమి? నన్నడుగు టేమి? నే నెవరిని హత్యం గావించితిని? ఈ యాగడ మేమి?" అనెను.

వేణీ: నీవు హంతకుండ వని చెప్పుటకు రాలేదు. నిన్నటి దినము మాకొక పెట్టెలో ఖండితశిర మొకటి దొరకినది. మీ యజీజుద్దీను వానినిం గాంచి పెట్టె తనది యనియు, తల తనతండ్రిదియు, మీ యన్నయు నగు తాజుద్దీన్ ఖానుదనియు నానవాలిడి తెలిపినాండు. అది యొక హత్యయనుట నిజము. మీ సోదరుం డట్లు చంపంబడి యుండుట నీకుం దెలియదా?

ఆకస్మికముగ మహోన్నతపర్వత మొకటి మీందంబడినవాని వోలె నా మాటలు విని మహమ్మదు పాతాళమునకుం గ్రుంగిపోయెను. అతని కేమి చెప్పుటకును నోరాడలేదు. అజీజుద్దీను నొకమారు తీక్ష్ణ దృష్టులతోం జూచెను — మఱియొకమా రిన్‌స్పెక్టరును గాంచెను. అతని ముఖచిహ్నములం జూచి లోలోన నగుచు వేణీప్రసాదరావు "అయ్యా! ప్రశ్నోత్తరముల మూలమున సర్వమును నీ నుండి గ్రహించుట కష్టము. సర్వమును మీ సోదర పుత్రునివలన వినియున్నాను. ఊరక మాటలవలన లాభము లేదు. నిన్నొకసంగతి నడిగెద. మీ యన్న హత్య కావింపంబడుట నీకుం దెలియునా, లేదా?" అని యడిగెను. సమాధాన మియ్యక తప్పదని యెఱింగి యిస్మాయలు మెల్లగ "తెలియు" నని చెప్పెను.

వేణీ: అట్లు తెలిసియు నీ వందఱితోడ నతండు జ్వరపీడితుండై గతించెనని యబద్ధము లాడుటకుం గారణ మేమి?

ఇస్ : అందుకుఁ గారణము లేకపోలేదు. హత్య జరిగినదని వెల్లడించిన నీక మీ వంటి పోలీసువారి తొందర హెచ్చునని యు, మాకు లేని యిక్కట్టులు ప్రారంభ మగుననియు వెఱచి నేను సత్య వార్తను వెల్లడింపనైతిని. ఎట్లును పోయినయన్న మరల రాఁడుకదా.

వేణీ : అది సరే. తుదకీ యుజీజునకైన నా వార్త నెఱిఁగింప లేదేమి ?

ఇస్మా : వానికి మాత్రము తెలిసి యేమి ప్రయోజనము ? ఎట్లును వృథాగందరగోళ మేలయని నే నెవ్వరితోడను ఆ సంగతిని దెలుప లేదు.

వేణీ : నీకు భ్రాతృమరణ దుఃఖము లేదా ?

ఇస్మా : లేదని యెట్లు చెప్పఁగలరు ? లేకుండనుండునా ?

వేణీ : కలవాఁడ వగుచో కలరూపు మా కెఱింగించి హంతకునిఁ బట్టుటకు యత్నించి, నీకు వానిపైఁ గల కసినంతటినిఁ దీర్చుకొన యత్నింపవైతివేల ? అట్లు చేసియుండిన మీ యన్నయాత్మ సంతృప్తి నొందియుండునే !

ఇస్మా : ఆ మాట నిజమే. కాని హంతకుని బట్టుకొనుట యెట్లు? వాఁడెవఁడో మీరు గ్రహించితిరా ?

వేణీ : లేదు. నీకుఁ దెలియదా వానిసంగతి? హత్యజరిగిన దెన్నఁడు?

ఇస్మా : మొన్నరాత్రి.

వేణీ : అప్పు డింట నెవరెవ రుండిరి ?

ఇస్మా : నేను నాటకమునకుఁ బోయియుంటిని. రెండవ మేడలో రజియాబీబీ సాఖియా యను దాసితోఁ బరుండి యుండెను.

వేణీ : రజియాబీబీ యెవరు ?

ఇస్మా : మా యన్న భార్య.

వేణీ : తర్వాత ?

ఇస్మా : క్రిందియంతస్సునఁ గొందఱు సేవకులు పరుండిరి. తాజుద్దీను మూఁడవ మేడలో నొకగదియందు నిద్రించుచుండెను.

వేణీ : నీవు నాటకమునుండి యెప్పుడు మరలి వచ్చితివి?

ఇస్మా : వేకువజామున సుమారు మూఁడుగంటలై యుండును.

వేణీ : అప్పుడే గ్రహించితివా యింట హత్య జరిగింపఁబడిన దని?

ఇస్మా : లేదు. నాకేమి తెలియును? కలఁ గని యుంటినా? ఇంటికి వచ్చి తిన్నగ రెండవ మేడలో నాగదిని చేరి పరుంటిని. ఉదయమున సాఖియా యేదో పనిమీఁద మాయన్నగదికిఁ బోయి యందు రక్తచిహ్నములను గాంచి తలుపుదీసి చూడఁగా నామెకు శిరోవిహీనమగు మాయన్నగారి కళేబరము గాన్పించినది. తోడనే యది భయోత్కంపమున గట్టిగ నఱచుటచే మేమందఱ మచ్చటికి పరుగిడిపోయితిమి. అంతదనుక మా కెవ్వరికినిఁ దెలియదు హత్య నడచిపోయినదని. తాజుద్దీను సుఖముగ నిద్రించుచున్నాఁడని తలంచితిమే కాని యిట్లు దీర్ఘనిద్రను జెందెనని యెఱుంగమైతిమి.

వేణీ : ఇంక సాఖియాను కొంతవఱకు విచారింపవలసియున్నది. ఆమెను రప్పింపుఁడు.

ఇస్మాలు విధిలేక చీకాకుతో రోషిణ్‌వారాను గాంచి "సాఖియాను తోడ్తె" మ్మని చెప్పెను. వాఁడు వెంటనే వెడలిపోయెను.

వేణీ : అజీజుద్దీను కొన్ని సంగతు లడుగ మఱచితిని. అయ్యా! పేటిక నీదని యంటివి కదా దానిని రాజకోటకు నీవు వెళ్లుటకుఁ బూర్వ మెందుంచి పోయియుంటివి?

అజీజు : మాతండ్రి శయనమందిరమున.

వేణీ : అనఁగా మూఁడవయంతస్తులో కదా?

అజీజు : అవును.

వేణీ : దానికి బీగము వైచియుంటివా ? బీగముచెవు లెందుంచి యుంటివి ?

అజీజు : ఆ సందూకమున నావి కొన్ని మాజనకునివి కొన్ని యుడుపులుండెను. అందుచే నేను పోవునప్పుడు మాతండ్రి దానితాళము నొకదానిని దీసికొనెను. రెండవది నాకడ నుండెను.

వేణీ : అవి హంతకుని కెట్లు దొరికి యుండును ?

అజీ : ఆ సంగతి నెఱుంగుట కష్టము. పెట్టెలో కాన్పించిన రక్తసిక్తంబు లగుబట్ట లన్నియు మా యిరువురివే.

వేణీ : ఇస్మాయిల్ ఖానున కేమైనం దెలియునా తాళపుచెవులను గుఱించి ?

ఇస్మా : లేదు. ఆ తండ్రికొడుకుల వ్యవహారమునందు నే నెప్పుడును జేయివైచి యుండలేదు.

ఇంతలో సాఖియాను బిలుచుకొని రోషిన్ మరలవచ్చెను. ప్రసాదరావామెను విచారింపసాగెను.

వేణీ : అమ్మా ! నీ పేరేమి ?

సాఖి : నన్ను సాఖియా యందురు. నేనీయింటి దాసిని.

వేణీ : గతించిన తాజుద్దీనా యిస్మాయిల్ ఖానా నీ యజమానుఁడు ?

సాఖి : ఇరువురును.

వేణీ . తాజుద్దీన్ ఖాను చంపఁబడెననుట నీకుఁ దెలియునా ?

సాఖియా మాటాడక తలవాల్చెను. అది యొకమారు రిస్సాల్ ఖానువైపు చూచెను. ఇన్ స్పెక్టరు దాని యభిప్రాయము నెఱింగి " ఈ రెండవయజమాని యుత్తరు వగునందాక నీవు నా ప్రశ్నకు బదులు చెప్పవా యేమి ? " అనియెను.

ఇన్ : అయ్యా! అట్లు తలంపకుఁడు. సాఖయా! నీకుఁ దెలిసినది చెప్పుము. అభ్యంతరము లేదు.

వేణీ : సరి అతనియాజ్ఞ యైనది. ఇప్పుడైనఁ జెప్పుము. తాజుద్దీన్ హత్యకావింపఁబడుట నీ వెఱుంగుదువా?

సాఖి : చిత్తము.

వేణీ : ఎన్నఁడు హత్య కావింపఁబడెను?

సాఖి : మొన్నరాత్రి.

వేణీ : నీవప్పు డెందుంటివి?

సాఖి : మా యజమానురాలితో రెండవయంతస్తులోని యామె గదిలోఁ బరుండియుంటిని.

వేణీ : పరులెవ్వరైన నారాత్రి మీ యింటికి వచ్చిరా?

సాఖి : లేదు. క్రిందియంతస్తున నింటిసేవకులు తప్ప నితరులెవ్వరును లేరు. నేను పరుండునప్పుడు పోయి చూచివచ్చితిని. అప్పుడు తాజుద్దీన్ ఖానుగారి గదిదగ్గఱకుకూడ పోయియుంటిని.

వేణీ : అప్పుడతఁ డేమి చేయుచుండెను?

సాఖి : గాఢముగ నిద్రించుచుండెను. నేను మఱలి వచ్చి పండుకొంటిని. కాని సుమారు రెండుఘంటలప్పుడు పై యంతస్తులో నేదో చప్పుడు వినవచ్చెను. నిద్రాసక్తనై యరమోడ్పు కన్నులతో నుండుటచే నప్పు డది యేమైనది నాకు విస్పష్టముగఁ దెలియ లేదు.

వేణీ : ఆ రాత్రి యా యిస్మాల్ ఖా నెందుండెను?

సాఖి : రాత్రి భోజనానంతరము నాటకమును జూడఁబోదు నని చెప్పి వెడలియుండెను.

వేణీ : అతఁడు తిరిగివచ్చుట నీవు చూచితివా?

సాఖి : నేను చూడలేదు.

వేణీ : నీవు పరుండఁబోవునప్పుడు పై మేడలోని తలుపులు తెఱవఁబడి యుండెనా లేక లోపల గొళ్లెముంచఁబడి యుండెనా ?

సాక్షి : తెఱవఁబడియే యుండెను. తాజుద్దీన్ ఖానుగారు సాధారణముగ లోపలగడియ వేయుచుండలేదు.

వేణీ : క్రిందియంతస్తు తలుపులు రాత్రి తీసియుంచినట్లు తోఁచినదా ?

సాక్షి : లేదు. పరిచారకు లెవ్వరు నంత ప్రమత్తులై యుండలేదు.

వేణీ : ఈ యభియోగ మత్యంతచిత్రముగా నున్నది. వెలుపలివారిచే హత్య జరుపఁబడ లేదని మీ మాటలవలన తెలియుచున్నది. ఇంకెవరు చేయుదురు ? ఇంటివారేవ్వైయుందురా ?

# ఆఱవ ప్రకరణము

## శంకితుఁడు

ఇస్మాలుఖాను లోలోన నదరిపోవుచున్నను వేణీప్రసాదు కడపటిమాట చెవిసోఁకినంతనే యుతనివైపు తీక్ష్ణముగఁ జూచెను. అతని యభిప్రాయ మతనికి సుబోధకము కాదయ్యెను. దొంగవలె మిగుల క్రుంగిపోఁదొడఁగెను. ప్రసాదరావతని ముఖలక్షణాదులు లక్షించి " అయ్యా ! పోలీసువిచారణ యింకను ముగియలేదు. సాక్షులవలనఁ దెలిసికొనవలసిన యంశములు తేటపడినవి. ఇఁక నిన్ను కొన్ని ప్రశ్నలడుగఁదలంచి యున్నాను. సమ్ముత్తరము లిత్తువా ? " అనియెను.

ఇస్ : (అసహ్యవీక్షణములతో)—మీరడుగ నెంచిన దేది ?

వేణీ: నీకు వివాహ మైనదా?

ఇన్: అది యిప్పు డెందుకు?

వేణీ: పని యున్నది. ఊటుసుపోమి నీతో సరసము లాడుటకు రాలేదు. నీవు నీకుఁ దెలిసిన సంగతులను చెప్పక తప్పించుకొననేరవు. చెప్పుము. నీ వవివాహితుఁడవా? లేక వివాహితుఁడవా?

ఇన్: అవివాహితుఁడనే.

వేణీ: ఇంతకాలమువఱకుఁ బెండ్లి కూడ లేదా? ఇక ముందైన నట్టికోరిక కలదా?

ఇన్: లేదు.

వేణీ: తాజుద్దీను నీ కగ్రజుఁ డగునా?

ఇన్: అవును. మేము పినతండ్రి పెద్దతండ్రి కుమారులము.

వేణీ: మీ యిరువురకును బరస్పర ప్రేమభావ ముండెడిదా?

ఇస్మాల్‌ఖాను క్రుద్ధుఁడైనట్లు కాన్పించెను. అతని కనులెఱ్ఱబడెను. వేణీప్రసాదును చుఱచుఱ చూచి "అయ్యా! ఇన్‌స్పెక్టర్‌జీ! మర్యాదలు తెలిసినట్లు లేదు. పెద్దయింటివారిని మన్నించువిధాన మిదియేనా? అసంబద్ధములగు ప్రశ్నలడుగుటచే మీకు రాఁగలలాభ మేమి? ఇట్టి యవివేకపు ప్రశ్నల కుత్తరముల నేనియ్యనేర. క్షమింపవలయును." అని చరాలున నచటినుండి లేచి మేడమీఁదికి వెళ్ళిపోయెను. ఇస్మాలట్లు వెడలిపోవుటను గాంచి వేణీప్రసాదు సహింపక మహాగ్రహప్రపూర్ణుఁడై "ఏమి యీ యవిధేయత! ఈ తురుష్కునకు మర్యాదలు తెలియవు. అయ్యా! రోషీ! నీవు పోయి యిస్మాలు వచ్చునో లేదో విచారించుకొని రమ్ము." అనెను. రోషీ జంకుచు "ఆర్యా! నేనొకఁడను పోరాదు. అతఁడు జనానాలో నుండును. సాఖయాతోఁ గూడ పోవలసియుండును." అనెను. "కానిమ్ము. సాఖయా! నీవుకూడ

రోషిన్ వెంట జనానాలోనికి వెళ్ళి మీా యజమానుని బిలుచుకొని రమ్ము." అని ప్రసాదరావు నిర్బంధించుట సాఖియా విధిలేక రోషిన్‌వారాను బిలుచుకొని వెళ్ళెను. వేణీప్రసాదజీజుతో రహస్యముగ "అజీజ్! నేను నీ మాటలను నమ్ముచున్నాను. మీా పినతండ్రి సందేహాస్పదుఁడని సంశయించుచున్నాను." అనెను.

అజీ: ఈ సంభాషణవలన మఱేమైన విశేషములు గ్రహింపఁ గల్గితిరా?

వేణీ: ఏమియు లేదు కాని యిస్మాలు తన యపరాధమును మఱుగుపరుపఁబోయి యనుమానాస్పదుఁ డయ్యెను. ఇంతకు నీనోటి నుండి వినినన్ని రహస్యము లతనివలనఁ దెలిసికొనుట కష్టము. అతఁ డెన్నఁటికిని తనగుట్టును బట్టబయలు చేసికొనఁడు.

అజీ: ఈ యిస్మాలు తప్పక యపరాధియే యని నా యంతరాత్మ ఘుద్ఘోషించుచున్నది. మీారే యోచించుకొనుఁడు. సమయసందర్భము లీయనుమానమును స్థిరపఱచుట కెంతసహకారము లైయున్నవో.

వేణీ: అవును. రజియాబీబీని తాను మోహించి తనవలలోఁ దగుల్కొనఁజేసి, యిస్మాలు తాజుద్దీనును సంహరించి యుండుననుటెంతయు సంభవమే. ఇప్పుడు నీవేషిర్యాదివి.

అజీ: అవును. నేనుకాక మఱెవ్వరుందురు?

క్రింద వీరిట్లు సంభాషించుకొనుచుండిరి. అట్లు మహమ్మద్ యిస్మాల్ కోపముతో వెడలిపోయి రభసగతిని రజియా మందిరమును జేరి యందొకసుందరదంతవినిర్మితాసనముపై నవలావణ్యవిలాసవతి యగు నొక సుందరిచెక్కిటఁ జేయిచేర్చి దేనినో విచారించుచుఁ గూర్చుండి యుండెను-ఆమెయే తాజుద్దీన్ ద్వితీయజాయయగు రజియాబీబీ-

ఇస్మాయిల్ ఖాను గదిని ప్రవేశించినంతనే రజియా యతని నెదుర్కొని "పోలీసువారు వచ్చియుండిరఁట. ఏల ?" యనెను. ఇస్మాయిలు చిరాకుతో "నీ మగని హత్యావిషయమున నేవో కొన్ని ప్రశ్న లడుగుటకు" అని చెప్పుచు నచటిపర్యంకముపైఁ జతికిలఁబడి నిట్టూర్చెను. రజియా యతని స్థితినిఁ గాంచి యించుక భయసంభ్రమముతో "ఏల యట్లుంటిరి ! వారేమైన మనపై ననుమానము గలవారివలె మాటాడిరా ?" యనెను.

ఇస్ : ఇదమిత్థమని తేటపడకుండ మాటాడెను. ఇన్స్పెక్ట రసాధారణుఁడు. కాని, ప్రియా ! నాకీ యజీజును గాంచినప్పుడెల్ల మిగుల భయ మగుచున్నది.

రజి : ఏల ! వాఁడేమి చేయుచున్నాఁడు ?

ఇస్ : వాఁడు పోలీసువారితోఁ జేరి మన రహస్యముల నన్నిటిని వెల్లడించుచున్నట్లు తోఁచుచున్నది.

రజి : అట్టిమాటలేవైన నిన్స్పెక్టరు మోల చెప్పెనా ?

ఇస్ : లేదు. సమక్షములో నేమియుఁ జెప్పలేదు ; పరోక్షమున నేమేమి చెప్పినాఁడో. వాని నడవడి విశ్వసింపఁదగదు. ఒకకన్ను వానిపై నుంచక తప్పదు. ఇంతదనుక వీనిని మనియుండనిచ్చినది మన దే తప్పు. వయసు మీరుకొలఁది వీనికి మనపైఁ గలయసూయకూడ ప్రబలి పోవుచున్నది. ఇఁకమీఁదనైన జాగరూకతతో నుండకతీఱదు.

రజి : ముసలివాఁడేమో సుళువుగా కడతేరిపోయెను. కాని మనకిపు డెట్టిచిక్కులు తటస్థమగునోకదా.

ఇస్ : అదియే నా భయము. అజీజు పోలీసువారితో మనగృహచ్ఛిద్రములఁ గూర్చి వినిపించిన వారు నిక్కముగ మనలను సంశయింపక విడువరు. అప్పుడు నన్ను బంధించి కొంపోవచ్చును. వారింకను నిందే యున్నారేమో.

రజియాబీబీ యాతుదివాక్యము నాలకించి యతని హస్తయుగళ ముసు దృఢముగఁ బట్టుకొని కాతరచిత్తయై "హా—హా—అట్లెన్నఁటికిని జరుగదు. మీ కేమియు భయము లేదు. మీకీ హత్యాపరాధమున నెట్టి సంబంధమును లేదుకదా. మిమ్మింకెవ్వరు సంశయింతురు?" అనెను

ఇస్ : సంబంధము లేనిమాట నిజమే కాని ప్రస్తుతస్థితినిఁబట్టి చూడ నజీజు మనపైఁ గుట్రలు పన్నిన పోలీసువారివలన మనకు భయము కలుగుట నిక్కము—

అతఁ డింకను నేమియో యనఁబోవుచుండ సాఖియా నేతెంచి వినయముగ "మహారాజా! పోలీసుయినస్పెక్టరు తమకై కాచియున్నాఁడు" అనెను. ఇస్మాలుమోము వెలవెలఁబోయెను. అతని హృదయము తత్తరిల్లెను. తన్ను వాస్తవముగఁ బోలీసువారు బంధింప వచ్చియుండిరను భీతి యతనిని సంపూర్ణముగ నావరించుకొనెను. సాహసించి క్రిందికిఁ బోఁజాలఁడయ్యెను. మాటాడక శిలవాల్చియుండుటను గాంచి రజియా "మనోహరా! ఇందు భీతికి హేతువు కాన్పింపదు. మనయును మానమే మనకుపకారి కావచ్చును. జంకక పోయి దానియెదుట మీ నిరపరాధిత్వమును నిరూపించి సాగనంపిరండు" అనెను. ఇస్మాలు ఆలోచనానిమగ్నుఁడై యూరకుండెను. రజియా చెప్పినట్లు తానప్పుడు మరల క్రిందికి పోవుటయే లెస్సయని గ్రహించెను. కాని సాహసించి కదలఁడయ్యెను.

అప్పటి కాలస్యమగుటచే పోలీసువారినుండి మఱియొకమాఱు వర్తమాన మంపఁబడెను. ఇస్మా లేమిచేయుటకును దోఁపక "రజియా! నేనేమిచేయుదును? కాళ్లాడకున్నవి" అనెను. ఆమెకూడ కొంతవడి విచారించి సాఖియాను జూచి "ఓసీ! నీవుపోయి యజీజుద్దీను నిటకు రమ్మనుము" అనెను. ఆ దాసి యట్లే పోయి మఱలివచ్చి "అమ్మా!

అతఁడు మిగుల క్రుద్ధుఁడై యున్నాఁడు. ఆకాలవ్యాళము లుండుచోటికి నేను రానొల్ల. వారిముఖావలోకనమును జేయ' నని మిమ్ము నిందించెనని చెప్పెను. అది విని రజియాముఖము వెల్లఁబడెను. ఇస్మాల్ పండ్లు గీఱెను. క్రిందినుండి యిన్స్పెక్టరుగారు పిలుచుచుండిరని మరల నిద్దఱు సేవకులు వచ్చి చెప్పిరి. ఎంతసేపటికిని యిస్మాల్ పోకుండుటను గాంచి 'యీసారి రక్షకోద్యోగి జనానాలోనికి వచ్చునని సమాచారము వచ్చెను. అదివిని రజియా భీతిలి వారెట్టియుద్దేశముతో వచ్చినారో! మనమేల వృథాగా శంకింపవలెను? ఆలసించినకొలఁది మన ముప్పును మనమే తెచ్చుకొనువార మగుదుము. కావున నిర్భయముగా క్రిందికిఁ బోయిరండు' అని దీనానయై బతిమాలెను. వేఱుమార్గము లేక తుదకిస్మాలు రజియా చెప్పినట్లు తిన్నగ క్రిందికి దిగిపోయెను.

అప్పటి కప్పుడే యరగంట యాలస్యమై యుండెను. వేణీ ప్రసాదు సహింపనోపక మిగుల చిరాకుతో నుండెను. ఇస్మాలు మరల వచ్చి యెదుట నిలుచున్న వెంటనే యతఁడు "ఏమయ్యా! నీవెట్టిగొప్పవాఁడవు? ఇంటికివచ్చిన యధికారి నిట్లేనా మన్నించుట? తిరిగి నీకు మర్యాదఁ జూపలేదని కొట్టుకొనుచుంటివే. ఇదిగో ఈకాగితము నీపేరిట నున్నది. చూచుకొనుము" అని చెప్పుచు జేబులోనుండి యొక పత్రికను దీసి యాతని కందిచ్చెను. ఇస్మాలందుకొని చదివి భయముచే నదరిపడి 'ఏమి యీయన్యాయము. నాపేరిట నేల యీ వారెంటు పత్రమును పుట్టించితిరి?' అనియడిగెను.

వేణీ : మీయన్న తాజుద్దీన్ హత్యాపరాధమున నీకించుక సంబంధ ముండునని తోఁచుటచేత.

ఇస్ : నేను మాయన్నను జంపితి నని నమ్మితిరా?

వేణీ : చంపితివో లేదో; నీపై ననుమానమున్నది. పరిస్థితు లాశంకను దృఢపఱచుచున్నవి.

ఇన్ : పరిస్థితు లేమి ! శంక యేమి ! అపరాధి యెవఁడో, కాని వాఁడెవఁడో తెలిసికొనలేనివారికి ఉద్యోగము నిచ్చినవాఁడెవఁడు !

వేణీ : ఇన్మాల్ ఖాఁ ! ఇది మాటలకదును కాదు రేపు కోర్టులో సర్వవిషయములు బోధపడఁగలవు. ఇంక నోరు మూయుము.

అని దాపునవున్న రక్షకభటులను గాంచి కనుసైగఁ జేసెను. తోడనే వారు గలగలమని సంకెళ్లను జేబులనుండి తీసి చేతఁ బట్టుకొని యిస్మాలుఖానును సమీపించిరి, పాపమాసమయమున ఖానునకు మీఁది ప్రాణములు మీఁదనే పోయినట్లయ్యెను. ఇట్లగునేమో యని సంశయించియే యతఁడు జనానానువదలి సాహసించి క్రిందికి రాఁజాలక పోయెను. తుద కూహించినంతపని జరిగినది. మహమ్మద్ యిన్మాల్ ఖాను చేతు లొక్కక్షణములో శృంఖలాబద్ధము లయ్యెను!!

అది గాంచి యాయింటిసేవకు లందఱు భయవిహ్వలులైరి. మేడమీఁది కీవార్త తెలిసిన తోడనే రజియా మహాభయశోకసంభ్రమములతో పరిచారికాసమేతయై వచ్చి తెర చాటున నిలుచుండి వారి సంభాషణ నాఁకింపఁదొడంగెను. దారిఁబోవు వారును, బొరుగింటివారును ఇస్మాలుఖాను రక్షకోద్యోగిచే నరెస్టు చేయఁబడెనని యాలకించి యాయింట మూఁగిరి. అందఱాశ్చర్యచకితులై చూచుచుండ ఖాను సాహేబు దిగ్భ్రమనొంది చూచుచుండెను. అంత వేణీప్రసాదు రక్షకభటులఁ గాంచి 'ఓరీ! యీతనిని భద్రముగ రక్షకభటస్థానమునకుఁ దోడ్కొని పొండు' అనెను. అజీజుద్దీను మాటాడలేదు. అప్పుడు తెరలోనుండి యొకస్త్రీకంఠ మిట్లని వినవచ్చెను. 'ఇన్స్పెక్టరుగారు ఖాన్ సాహేబుగారి నరెస్టు చేయుటకుఁ గారణమేమి ?'– వేణీప్రసాదావ్యక్తి రజియాబీబీయో యామె దాసియో యని యూహించి 'సంగతి సందర్భముల నిప్పుడు చెప్పుటచే లాభము లేదు. విచారణసమయమున

నంతయు విశదమగును. నిక్కముగ నిస్మాల్ ఖాను నిరపరాధియగుచో దండింపఁబడఁడు. ” అనెను.

ఇస్మాలుఖానున కేమిచేయుటకును, ఏమనుటకును తోఁపలేదు. మనమునఁ బెనఁగొన్న భయలజ్జాదుఃఖములతనిని మాటాడనియ్యలేదు. తనదుస్థితి కంతకు నజీజుద్దీనే కారకుఁడనిమాత్రము మాతఁడు దృఢముగ నమ్మెను. అతఁడొకమాటు నిప్పులురాలు కన్నులతో నజీజువంక చూచెను. అజీజు వానిని వికటావలోకనంబులతో నెదుర్కొని యట నుండనోల్లక యాస్థలమును విడిచి పోయెను. వేణీప్రసాదుకూడ నిఁక నాలసింపలేదు. ఇస్మాలుతో నెక్కువగ మాటాడక యతనిని దోడ్కొని పోలీసుతాణాకు వెడలిపోయెను. ఇంటివారందఱు హాహాకారములు చేయసాగిరి. వచ్చినవారంద ఱెవరికి తోఁచినట్లు వారు మాటాడు కొనుచు నిండ్లకేఁగిరి.

## ఏడవ ప్రకరణము

### ఉపాలంభము

ఇస్మాల్ ఖానును పోలీసువారు కొనిపోయినరాత్రి యజీజుద్దీను తన శయనాగారమునఁ గూర్చుండి యేదియో యాలోచించుకొనుచుండెను. అతని హృత్పిండమును బాధించుచుండిన పలువిషయములలో నొక్కటి తనపినతండ్రి పట్టువడిన తర్వాత నించుక శమించెను. ఇస్మాల్ నిక్కముగ హంతకుఁడు కావచ్చునని నమ్ముటయే కాక యజీజు తన మాఱుతల్లిపైఁ గూడ శంకాసమన్విత మనస్కుఁడై యుండెను. ఆమెతో నజీజు మాటాడి బహుదినములైనది. ఆమెతో భోజనాదులయం దతఁడు

పల్గొనుచుండుట లేదు. తనకత్యంత ప్రేమాస్పదురాలును, విశ్వాసార్హురాలును నగు ఖతీజాయను దాసిచే వంట చేయించుకొని భుజించుచుండెను. తఱచుగ నతఁ డింట నుండుట లేదు. ఇస్మా యెప్పుడును రజియాతో నుండుననుట నాకర్షించి కంటగించుకొనుచు నొక్కొక్కమాఱా దురాత్ము నెదిరింప సాహసించుచుండెను. వాని నిలువెడలఁగొట్టవలయు నని పలుమార్లు తన జనకుని జీవితకాలములో యత్నించెను. కాని యతిభద్రముగ నాటుకొన్న వృక్షమును పెకలించుటవలె నాపని దుర్ఘట మయ్యెను. అందుచే నజీజునకుఁ దన పితృవ్యునిపైఁ గల రోషము దినదినాభివృద్ధి నొందసాగెను. ఇస్మాలుకూడ తన్నత్యంతసందేహాస్పదచిత్తముతోఁ జూచుచుండె ననుట నతఁడు గ్రహింపక పోలేదు. తనొక్కనినే కాక యీ దుష్టవర్తను లిరువురుఁ జేరి తనతండ్రిని కష్టములపాలు గావించుచుండుటను గాంచి మఱింత మండిపడుచుండెను. వారి నేరీతిగ దండింతునా యని రేయుంబవళ్లొకమొగి నాలోచించుచుండ నంతలో నీ కారణమున మహమ్మదు పోలీసువారిచేఁ బడిపోవుటచే నజీజుహృద్భార మొకింత సమసెనని చెప్పవచ్చును.

కాని యంతటితో నజీజుచిత్తమున శాంతి నెలకొనలేదు. కాళ్లు విఱిగి కన్నులు వచ్చినట్లు కంటకుఁడగు పినతండ్రి పట్టుపడెనను సంతసమొకప్రక్క కలిగినను, మఱియొకవైపు తాను హృదయపూర్వకముగఁ ప్రేమించి మన్నించుతండ్రి గతించుటచేతను — హత్యకావింపఁబడుటచేతను, నతని కిప్పుడీజగమంతయుఁ బ్రబలాంధకారపూరితమైనట్లు కన్పట్టుచుండెను. అందుచే నతని హృత్పద్మమున కానందరవిప్రభ లెంతకాలమైనను గోచరించుటలేదు. మెఱపుమెఱసిన ట్లొకమాఱా మోదకళలుద్భవించి యంతలో నంతర్హితములయ్యెను. దినమంతయుఁ జింతావ్యథముఖముతో నూరక పట్టణమంతయుఁ దిరిగితిరిగి మునిమాపువేళ

కిలు జొచ్చి ఖతీజా వండినవంటకము నింత యెంగిలి కావించి లేచి తన గదిని చేరి తలుపులు బంధించుకొనుచుండెను. ప్రియజనకుని యాకస్మిక మరణ సంతాపాగ్ని యొక ప్రక్కను—దుశ్చేతస్కురాలగు విమాతయూలమునఁ గులగౌరవమునకు వాటిల్లిన దుష్పరిస్థితి యొకయెడను—కృతఘ్నుఁడును, నృశంసుఁడును, కుటిలవర్తనుఁడు నగు పితృవ్యునియెడఁగల యసహ్యమొకవైపునను జేరి తన్ననంతదుఃఖసాగర మునముంచివేయుచుండుటచే నజీజుద్దీనున కిప్పుడు చిత్తవిభ్రమణ ముద యించిన ట్లుండెను. మునుపటివలె నతఁ డిప్పుడు స్నేహితుల సాంగత్యము నాసించుట లేదు. ఎప్పుడు నేదో యొక యాలోచనాచిత్తుఁడై యుండును. తుదకతఁ డున్మాదుఁ డగునేమో యని చూచినవారందఱు భావింపఁదొడఁగిరి. కాని యజీజు నటిస్థితికిఁ దెచ్చినది ప్రబలమగు ప్రతీకార చింతనయే.

అతఁడట్లొకరోయి తనగదిలోఁ గూర్చుండి యోచనాధీనుఁడై యుండు కాలమున సాఖియా యటకేతెంచి “అయ్యా! మిమ్ము రజియా బీబీగారు రమ్మనుచున్నారు” అనెను. ఇదివఱకెన్నియో దినముల నుండి బీబీ యతనితో నేదోమాటాడుటకు పలుమారు కబురుపంపుచుం డెను, అయిన నతఁడు పోవుటలేదు. ఆమెను మోమోటము లేక నిం దించుచుండెను. అట్లయినను రజియా వానికై వర్తమానములంపుట మానలేదు. నేఁడుసహితము సాఖియా వచ్చి పిలిచినప్పుడు రానని చెప్ప వలయునని యజీ జనుకొనెను. కాని తర్వాత నేమి తలంచుకొనెనో యా దాసినిఁ గాంచి “వత్తును. ఆమె యొంటరిగానున్నదా?” అని యడిగెను. సాఖియా యతని మనోవినిమయంబున కాశ్చర్యమొంది “అవును” నెను. “అట్లయిన వత్తునుపద” యని యజీజామె వెంట కదలెను.

ఇస్మాయిల్ ఖానును పోలీసువారు బంధించికొనిపోయినదాదిగ రజియాకు చిత్తశాంతి శూన్యమయ్యెను. ఆమె భుజింపక గ్రుడ్లనీరు గ్రుక్కికొనుచు పఱుపుపైఁ బడి యిటునటు పొరలుచుండెను. శరీరాభరణముల వర్జించి కేవలము శోకదేవతాకారమును దాల్చినది. రాత్రి దీపములుంచునటి కట్టెసిలిథియందే యుండి పిమ్మట సాఖియాను గాంచి "ఓసీ! అజీజింట నున్నాఁడా?" యని యడిగెను. అది "ఉన్నాఁడని" చెప్ప "అతనినిఁ దోడ్కొనిరమ్మ"ని చెప్పి పంపెను. దాసి నిష్క్రమణానంతర ముత్కంఠతో లేచి కూర్చుండి కుమారునియాగమనమునకై నిరీక్షింపసాగెను.

ఇంతలో సాఖియా యజీజును వెంటఁబెట్టుకొని ప్రవేశించుటను గాంచి రజియా యద్భుతప్రమోదములతో లేచి యెదురు వచ్చి "కుమారా! నేఁడెంతసుదినము! ఇప్పటికి నాపై దయకలిగెనా? ఎన్నఁటికిని రానివాఁడవు నేఁడొక్కపిలుపు మాత్రమునకే వచ్చుటచే నా పున్నెము ఫలించె నని తలంతును. రమ్ము, కూర్చుండుము" అని స్వాగత మొసంగెను. అజీజు మాఱుపలుకక తలవాల్చుకొని పోయి యామె చూపిన కుర్చీపై నుపవిష్టుఁ డయ్యెను. అంత రజియా సాఖియాను వెడలిపొమ్మని "కుమారా! నీకు తలిదండ్రులతోఁ బగసాధించుట తగునా!" అనెను,

అజీ: నా చిన్నటినుండి నే నెన్నఁడును బగసాధించి యెఱుంగను. అతని యాజ్ఞానురతుఁడనై యుంటినే కాని పొల్లెత్తుమాటచే నతని నవమానింప లేదు. ఇఁక నాగల్లిపిష ఋమా నాకామెయెడనున్న గౌరవప్రేమలను జగ మెఱుంగును. ఆమెకై ప్రాణములైన నర్పింప సిద్ధుఁడనై యుంటిని. కాని నాకట్టి తలిదండ్రులిరువురును గతించిరి. వారు నన్నొక సికాలకాలోదరములపంచఁ బడవైచి దివంగతులైరి. అని యనుచుండ నతనికన్నుదమ్ములు అశ్రుప్రపూరితము లయ్యెను. రజియా యది

గాంచి కొంతవడి యూరకుండి "కుమారా! నీ గుణంబులు నాకుఁ దెలియును. ఆ తలిదండ్రుల నెంతగఁ బ్రేమించితివో నాకుఁ దెలియక పోలేదు. కాని గతించినవారిని గూర్చి వగచుట వేల! ఇప్పుడు నీతల్లియుఁ దండ్రియు నేనే. ఇట్టి నన్నుఁ గడకంటఁ జూతువేల?

అజీ: (అసహ్యముతో) నీవట్లు తలంచుచుంటివేమో నాకు మాత్ర మట్టియాశయు మెన్నఁటికిని లేదు. నాకుఁ బ్రేమాస్పదు లిఁక లేరు. నన్నుఁ బ్రేమించువారును లేరు. ఆ సంగతి నటుండనిమ్ము. ఇప్పుడు నన్ను రప్పించినకారణ మేమి? త్వరగఁ జెప్పుము. నేఁబోవలయును.

రజి: వత్సా! నీ వింకను బాలుఁడవు. లోకజ్ఞాన మింకను నీకు సరిగ నలవడినట్లు లేదు. నీకు బంధుప్రీతి కలదా? కలవాఁడ వగుచో చూచిచూచి మీ పినతండ్రి నిట్టిరట్టడిగతికి తెత్తువా?

"పినతండ్రి" యనుమాట చెవి సోకినంతనే మండిపడి "అమ్మా! నీ వింక మీఁదట నా దుర్జాతికూళకును నాకును నెట్టి సంబంధమునుగలుప రాకుము. వాఁడు నాకెట్టి పినతండ్రి? ఘోరదానవస్వరూపుఁడు — మహాపాపపంకిలచిత్తుఁడు — కర్కశపాషాణచిత్తుఁడు. వాఁడు నాకే నాఁటి బంధువు. ఇంతటితో వానిపని తీరినదనుకొంటివా? ఛీ—వాని విషయమై మాటాడుటకు నీ కింకను సిగ్గులేదా? నిజభర్తను చేతులారఁ ఖండించి రక్తసిక్తహస్తములతో వచ్చి యెదుటనిలుచు హంతకుఁగా నీ వభిమానించుట? నోరు మూయుము. ఇట్టిమాట లిఁక నా యెదుట చెప్పకుము." అని యగ్నిస్ఫులింగములు చెదరు నయనములతో రజియాను చుఱచుఱఁ జూచెను. రజియా వాని ఘోరాకారమును గాంచి తల్లడిల్లెను. "వత్సా! ఏటిమాటలివి. నీవు పసిబాలుఁడవు. నీతండ్రిగా రపారధనము నార్జించినారు. ఇంటిని గాపాడుకొనుశక్తి నీకుఁ జాలదు. అనుభవజ్ఞు లొకరు నీ కించుక సాయము చేయుట మంచిది కదా.

మీ పినతండ్రి కీర్తిప్రభావము లన్నియుఁ గరతలామలకములు. ఆయన ప్రాపు నీకవసర మని చెప్పుచున్నానంతే" అనెను.

అజీ : ఏమి, నేను వాని ప్రాపు నొందవలయునా ? నాకేమంత వచ్చినది, నాకు లోకానుభవము చాలినంత యున్నది. ఇట్టిమూర్ఖుల సంకఁ బదింటి నేలఁగలను. వాఁడు నాకిందు నేర్పవలసిన దొక్కటియు లేదు. వాని యార్జన యిందు కాసైన లేదు. భాగమును గోరుటకుఁ గూడ వాని కెట్టి యధికారమును లేదు. దయతలఁచి నేనింత పాడవైచిన వానికిగతి లేకున్న వృణి. అట్టినీచుని ప్రాపునందా నేనుండవలయును—అట్టి దుష్టాత్ముని గుఱించియేనా నీవు నా ముందు పొగడ సాహసించునది ! పాతకీ నీతో నిఁక హెచ్చుమాట లేల. నీవు నాకు తల్లి యెట్లగుదువు ! నీవు పతివంచకురాలవు — భర్తృహంతవు — కుటిలమతివి. ఇట్టిదానవని తెలియక మొదట మాతండ్రి నినుఁ జేపట్టి మోసపోయెను. అతని ప్రమాదఫలమును నేనుకూడ కొంచెముగనో గొప్పగనో యనుభవింపవలసి వచ్చినది.

రజియా : అయ్యో ! చిన్నవాఁడవు మాటాడవలసిన మాటలివి. నీబోటి దయాళువునోటినుండి యిట్టిమాటలు రాఁజనునా ! నేఁజెప్పునది నీ హితమునకు నమ్మవైతివి. నీ పితృవ్యునిపై లేనియనుమాన ముంచుకొని యిట్లు మాటాడుచున్నావు కాని యతఁడు నిరపరాధి. ఈ హత్యాపరాధమున నతని కేమాత్రమైన సంబంధము లేదు.

అజీ : హా— హాహా— పతిఘాతకీ ! నిన్నేమందును. ధర్మైకనిరతుండును, సత్యసంకల్పుండును, దయామతియు నయగుణనిధానుండును, శ్రీమంతుండు నగుభర్త మరణదుఃఖ మణుమాత్రమైన లేక యొక దురాత్ముని పక్షము వహించి మాటాడు నీ సాహసమును— లజ్జావిహీనతను— ధార్ష్ట్యము నేమందును ! చాలించు మిఁక నీ దురాలాపములు.

రజియా : అతనిని జామీనుపై వదలించుకొని గమ్ము. అంత దేపాప మెఱుంగడు.

అజీజుద్దీనునకు రోషాగ్ని తలకెక్కి-పోయెను. "ఏమీ ! జామీను కావలయునా వానికి ? ఇంతదూరము నీతో మాటాడుచుం గూర్చున్నది నాదితప్పు. నేఁడవకాశము దొరకుటచే నా యభిప్రాయమును నీ ముందర వెల్లడించెదను. ఇఁక నిన్నింట నుంచుకొని పోషించుట నా కిష్టము లేదు. నీ జీవనార్థమై నీకింత పారవైతును. వలయు సమపాయములతో సాగనంపెద. నీవు సాధ్యమగునంత త్వరలో నీ పుట్టినింటికి వెడలిపొమ్ము. నేను కోపముచే నూరక మాటాడుచుంటి నని తలంపకుము. నీవు స్వబుద్ధితోఁ గదలవైతివేని నిన్నితరమార్గములతో నా యింటినుండి పంపివైతును. ఈమాట ముమ్మాటికి నిక్కము. పాతకీ ! నీవు పాలమున్నిటిలోఁ బాషాణ ముద్భవించినట్లుద్భవించితివి ! ఛీ— ఛీ—నీ ముఖావలోకనముచేఁ బాపకూపమునఁ బడుదును, పాపము శమించుఁగాక" అని యుద్రేకపూరితుఁడై నోటికి వచ్చినట్లెల్ల మాటాడి యజీజుద్దీనిఁక నట నుండనొల్లక తటాలున నా ప్రదేశమును వదలి మెట్లు దిగిపోయెను.

అప్పటి కింకను నిద్రాసమయము కాలేదు. వీథులలో జనసంచారము యథారీతిగనే యుండెను. అజీజు మిగుల వ్యస్తచిత్తముతోఁ దననగదినిఁ బ్రవేశించి చూడ నప్పు డతని కందొక పురుషుని సందర్శన మయ్యెను. అతని పేరబ్దుల్ రజాకు సాహేబు. అతఁ డించుక వామనుఁడు. అయినను మిగుల బలియుఁడు. ముఖ మంతవికారమైనది కాదు కాని చిన్నికన్నులవలన నది యించుక భయంకరమై చూపట్టుచుండెను. వస్త్రాభరణములఁ గాంచిన నతఁడు శ్రీమంతుఁడని చెప్పవచ్చును— అజీజుద్దీనున కబ్దుల్లా నూతనుఁడు కాఁడు. అప్పుడప్పు డతఁ డిస్మాయిలుతో

మాటామాట కాయింటికి వచ్చి పోవుచుండెను. ప్రప్రథమమున వానిని గాంచి యజీజు ఏవగించుకొనుచుండెను. కాని యుక్తిపరుఁడగు రజాకు తన చతురసంభాషణలచేఁ దనయెడ ప్రసన్నునిఁ గావించుకొనెను. కాబట్టి యజీజిప్పుడు పూర్వమువలెఁగాక యబ్దుల్లాను కాంచినప్పుడు ప్రేమపురస్సరంబుగ మన్నించుచుండెను. అప్పుడాతని నాకస్మికముగఁ గాంచి యజీజు విస్మితుఁడై "మహాశయా! వందనములు. ఎప్పుడు వచ్చితిరి?" అని ప్రశ్నించెను.

అబ్దు: (హసించుచు) —భాయీ! రెండుమూడు నెలలుగ నేనూరలేను. నేనూరలేని కాలమున మీ యింట మీతండ్రిగారి ఘోర మరణము జరిగినదని విని చింతించుచున్నాను.

అజీ: మీకా సంగతి నెవరు చెప్పిరి?

అబ్దు: మా దిలారాము చెప్పినది. ఇస్మాలును పోలీసువారు బంధించి కొంపోయినారఁట కాదా?

అజీ: అవును. నేఁడు మధ్యాహ్నమున నే యాపని జరిగినది.

అబ్దు: అతఁడు హంతకుఁడుగా నెట్లు సంశయింపఁబడెను?

అజీ: అది పెద్దగందరగోళము లెండు. రేపు విచారణకాలమున మీరును న్యాయస్థానమునకు వచ్చిన సర్వముదెలియును.

అబ్దు: అజీజు! నీవు చెప్పకపోయినను నాకంతయుఁ దెలియును లెమ్ము. తాజుద్దీన్ గారి ... నాకంతపరిచయము లేకున్నను, నేనతనితో విశేషముగ మాటాడకున్నను, అతని గుణశీలములు వినినవాఁడ నగుటచే నా మహాశయుని మరణమునకై చింతిల్లుచున్నాను. నిజము చెప్పుచున్నాను వినుము. మీ పినతండ్రికి దిలావిమాత యగు రజియా బీబీ సంబంధముండెనని నాకుఁ దెలియదు. అట్లు తెలిసినచో వానిని కన్నెత్తి చూచియుండను. ఇప్పట్టున నీవు వానిని సంశయించు

యెంతయు సమంజసము. నాకుఁగూడ వానిమీఁదనే యనుమానము కలుగుచున్నది. వానిని రక్షకభటుల యధీనము గావించుట లెస్సయైనది. లేకున్న నీ యనువులకుఁగూడ నపాయమే ” అనియెను.

అజీ: అయ్యో! ఇఁక లోకమునఁ గృతజ్ఞత యెందున్నది? ఇస్మాయిల్ బట్టిదుశ్చింతతో నుండెనని నేనొక్కనాఁటికిని దలంపనైతిని. రాత్రి మాతండ్రిగారు పరున్న తర్వాత వాఁడు రహస్యముగ నతనిగొంతుకోసి యా శిరమును నా పెట్టెయందే భద్రపఱచి యొక సేవకుని చే నామయునాఁ డెందో పంపినాఁడు. వాఁడు యజమానుని మించిన మేధావి. ఆ పేటికను సంతలో నిరువురు పల్లెవాండ్ర యధీనము గావించి తప్పించుకొని పోయినాఁడు. నేరము బయటికి రాకుండ పన్నాగము జరుపఁబడినది.

అబ్దు: అబ్బా! ఎంతమోసము. వినుట కొక చిత్రకథవలె నున్నది.

అజీ: పోనిండు. ఆ ప్రసంగము వచ్చినపు డెల్ల నా హృదయము చేయిపెట్టి కలఁచిన ట్లుండును. నేనీనడుమ మీ యింటికి వచ్చుట లేదు. స్థలాంతమున కేగియుంటిని.

అబ్దు. ఎచ్చటికి?

అజీ: రాజకోటకు. మా మేనత్తను చూచి వచ్చుటకు.

అబ్దు: అజీజ్! నీతో నొక్కమాటను జెప్పవలయు నని చిరకాలమునుండి కుతూహలపడుచుంటిని. ఈలోగా వ్యాపారార్థినై రెండు నెలలూర నుండకపోవుటచే మీతండ్రిగారితోఁగూడ ప్రసంగించుటకు వలనుపడినదికాదు.

అజీ—అది యేమి?

అబ్దు : నీ వింకను అవివాహితుఁడవు. కులశీలవయోగుణరూపము లందు నాతనయుకుఁ దగినవాఁడవు. ఆ కన్యారత్నమును నీకర్పింప నెంచుచున్నాను. ఇందు నీ యభిప్రాయ మేమో దయచేసి చెప్పుము.

అజీజుద్దీ నా మాటలకు మాఱుపలుకక యేదియో విచారింప సాగెను. ఇప్పుడు తన సమస్తకార్యములకును దానే పెద్దనని యతఁ డెఱుఁగును. సంప్రతించి మాటాడుటకు తగినపెద్దలు లేరు. ఉన్నతండ్రి గతించె. విమాతయుఁ బితృవ్యుఁడు ఘోరారులైరి. ఇప్పు డబ్దుల్ రజా కడిగిన ప్రశ్నకు సమ్మతినో యసమ్మతినో తానే తెలుపవలెను. పెద్దల పేరు చెప్పి తప్పించుకొనలేఁడుకదా. అతఁడు యోచించుకొనుచుం డెను. అంతలో రజాకు "భాయీ! ఇప్పుడు నీకు నీవేపెద్దవు. బాగుగ నాలోచించుకొనుము. మాదిలారామకుఁగూడ నీపైనే మనసున్నది. నాకుఁగూడ నీకే యామె నిచ్చి పాణిగ్రహణ మొనర్పవలయు నని కోరికయుండెను. ఫజల్‌పురమునకు వ్యాపారార్థినై పోవలసివచ్చుటచే వచ్చినతర్వాత మీ జనకునితో ముచ్చటింతమని యనుకొంటిని. కాని దైవమిట్లు చేయునని నాకేమి తెలియును? ఇఁక గతమునుగుఱించి వగ చుట బాగు కాదు. ఇప్పు డీక వారముదినములలో నేను మరల ఫజల్ పురమునకేఁగవలసియున్నది. వచ్చుట కెంతకాలము పట్టునో తెలియదు. కావున నాప్రయాణమునకుఁ బూర్వమే వివాహము కావలయునని నా కుతూహలము."

అజీజు వింతపడి "అంతశీఘ్రములోఁ బెండ్లియా?" యనెను.

అబ్దు : అవును. పిమ్మట చాలకాలమువఱకు నవకాశము దొరకదు. అంతలో మాదిలారామకు వయసుమీఱును. ఇప్పు డీశుభ కార్యమున కేమియాటంకము? నీతండ్రి గతించెనను దుఃఖము తప్ప మఱేమున్నది? శ్రీమంతులైనవారు తలఁచినప్పుడు పదిపెండ్లిండ్లు చేయఁ గలరు? పోయినతండ్రిని గూర్చి యూరక వగచుచుండుట వివేకము

కాదు. ఆ దుఃఖమును మఱచి ముందు కార్యాలోచనఁ గావింపుఁడు. ఈ వివాహవిషయమై తీవ్రముగ నాలోచింపక తప్పదు. రేపు వేకువ జాముననే మరల వత్తును. రేపు నీ నిశ్చితాభిప్రాయమును దెలుపక తప్పదు. నేఁబోయి వచ్చెదను. అనెను. అజీ జతనిని వీడ్కొలిపి వచ్చి పరుండెను.

# ఎనిమిదవ ప్రకరణము

## మహోద్యాన మందిరము

ఇస్మాల్ ఖానును బంధించుటతోడనే తన కార్యభారమంతయుఁ దుది ముట్టినట్లు వేణీప్రసాదు తలంపసాగెను. అతఁడు ప్రప్రథమమున స్వల్ప ప్రపంచానుభవంబున నట్టి ఘోరహత్యారహస్యంబు నెట్లు భేదింపఁ గలుగుదునా యని యించుక జంకియుండెను. అందుకై తానెన్ని కడగండ్లు పడవలసివచ్చునో యని యా దుష్కర కార్యము నెదిరించి నిలుచుటకు వలయు ధైర్యసాహసముల సమకూర్చుకొనుచుండెను. కాని యంతలో నజీబుద్దీన్ మూలమున సర్వవిషయములు కరతలామలకము లగుటచే నిక్కముగ నిస్మాలు హంతయని శంకించి యతనిని బందీ గావించెను. మహమ్మద్ యిస్మాల్ ఖాను నిందితుఁడని నిరూపించుటకుఁ బ్రస్తుతపరిస్థితు లనుకూలములై యున్నవి. ఇంత యనాయాసముగ భగవానుఁడు తనకా మహాంధకార కూపమధ్యమున దివ్యజ్యోతినిఁ జూపునని యతఁడు తలంచి యుండలేదు. ఇఁక తాను చేయవలసిన దొక్కటే— తన వివరణము నంతటిని కోర్టువారి యెదుట వినిపించి యుండుటపై నిస్మాలుఖాను విచారణను సల్పి వానినిఁ దగినరీతి దండించుటే. అపని

నాతఁడు బహుకాలము నిలిచిపెట్టుట కిష్టపడలేదు. ఆ మఱునాఁడే యీ పనిని జరుపవలయునని సంకల్పించుకొని యుండెను—

క్రమక్రమముగ దినమణి చరమక్ష్మాభృత మెక్కెను. విలాస పురుషు లందఱికి నది విహారయోగ్యకాలము. కావున వేణీప్రసాదు నాఁటి గోధూళికాసమయమున నాకాశ మించుక జలధరాచ్ఛాదితమై యున్నను—ప్రొద్దుపోయి యున్నను—లక్ష్యపెట్టక తన నిత్యకృత్యము నను వీడనొల్లనివాఁడగుటచే చేత నొకగొడుగును ధరియించి వెడలెను. తఱచుగ నతఁడహమదునగరునస్టేషన్ బజారువంకనే షికారి వెడలుచుండును. అది తక్కినభాగములకన్న నత్యంతరమణీయోద్యానములచేతను, మహోన్నతరమ్యహర్మ్యరాజంబులతోడను వేత్రిపర్వమై యుండును. వేణీప్రసాదు నిశ్చింతచిత్తముతో ప్రకృతిసౌందర్యము నవలోకించుచుఁ దిన్నగఁ బోవుచుండెను — అది వర్షాకాలము. అంతకుఁ బూర్వమే పెద్దవాన కురిసినందున మార్గమున కిరుప్రక్కలఁ బిల్లకాల్వలు గలగల శబ్దించుచుఁ బ్రవహించుచుండెను. ఆకస మింకను వెల్లఁబాఱి యుండలేదు. వర్షాగమనసూచనలు పొడకట్టుచుండెను. వేణీప్రసాదు ప్రకృతిమార్పును గమనింపఁడయ్యెను. కాఱు మబ్బు లన్నియు నొక్కటిగఁ జేరి గర్జించినప్పు డొకమాఱుమాత్రము తలనెత్తి చూచెను. అయినను "ఇది వట్టిధ్వనిమాత్రమే. ఇంతలోవృష్టి రాదు" ని తలంచి ముందునకు సాగిపోవుచుండెను. వర్షాగమనకాలమును, ప్రాణప్రయాణసమయమును నిర్ధరించి చెప్పఁగలవా రెవ్వరు?— కొంతసేపటికే విచిత్రముగ వారిధారాప్రపూర్ణమై వసుధాతలము జలమయమైపోయెను. అంత చటుక్కున వేణీప్రసాదు తెలివొంది దారికవ్వలప్రక్క నున్న మహోద్యానమును బ్రవేశించెను. అచట జనుల యలికిడి యెంతమాత్ర మతనికి వినిపింపలేదు. రాను

రాను మేఘములు మఱింత సాంద్రము లగుట చేతను, కలయఁబర్విన చీకట్ల మూలమునను చూచుచుండఁగనే ధరావలయము ప్రబలధ్వాంతాకీర్ణ మయ్యెను — వర్ష మాఁగలేదు. అది మఱింత హెచ్చెను. దానికి తోడుగ నప్పుడప్పుడు ప్రబలజంఝూనిలము వీచుచుండెను. అప్పుడతఁడు తాను శీఘ్రముగ నింటికి మఱలిపోనందుల కనుతాపతప్తుఁడగుచుఁ దలదాచుటకుఁ దగినశరణ్యస్థాన మెందైనఁగలదా యని పరికించి చూచుపరి శాఖూరుహాకదంబమధ్యమున నల్లంతిదవ్వున నొకమహా మందిరము దృగ్గోచరమయ్యెను. తోడనే యతఁ డచ్చటికి పరుగిడెను.

అది యొక సమున్నతవిశాలశిథిల హార్మ్యరాజము. జనశూన్యమై కాన్పించుచుండెను. అందందు జీర్ణమైయుండుటనుఁగాంచిచూడ పూర్వ మొకప్పు డందెవరో సంపన్నగృహస్థులు కాపురముండి యిప్పుడు కాల పురుషుని నాశనహస్తమునకు లోనైనదని తోఁచకమానదు. ఆమహో ద్యానముకూడ నాయింటివారిదే కావచ్చును. అదియును మిగుల వినాశదశయందే యుండెను.

వేణీప్రసా దప్పుడు తా నెందుండునదియు గమనించి "ఆహా! ఏమి యీ చిత్రము! అహమదునగరున నా సుందరమందిర మెచ్చట— ఇపుడు నేనుండున దెచ్చట! దాపున జనసంచారచిహ్నము తే గోచరిం చుటలేదు. ఇట్టి భయంకరప్రదేశంబున కీడ్చుకొనివచ్చుటలో భగవ దాశయ మేమైయుండును. ఆమహామహుని ప్రతిచర్యయును మహాద్భుత రహస్యభూయిష్ఠముకాదా." అని యాలోచించుకొనుచు నొకవేదికపై నుపవిష్టుఁడయ్యెను. వెలుపల వర్ష మింకను నాఁగలేదు — అతఁడు చలిచే గజగజ వడఁకుచుండెను.

వేణీప్రసాదున కేమియు నగపడుటలేదు. ఎందుచూచినను గాఢాం ధకారమే. అతఁ డంత నొకమారు "ఇదియూడ మిగుల నపాయకర

స్థలమని తోఁచుచున్నది. నే నిప్పుడు శీఘ్రముగ నిలు సేరుకొనుట మంచిది. ఏ కాలమున కెట్టిసంఘటనములు సంఘటిల్లునో యెవ్వఁ డెఱుఁగు" నని యనుకొనెను. అతఁ డట్లు తలపోయుచు నిఁక నాతావును వదలిపోవుట కుంకించుచుండ నంతలో నెవరో మనుష్యులు మాటాడు కొనుచు నతఁడున్నచావడి కవ్వలిభాగమున నున్న యొక పెద్దహాలునఁ బ్రవేశించుట తటస్థించెను. వాగాస్థలపరిచయమున్న వారివలె బిరబిర లోని కేగుటను గాంచి యెవ్వరై యుందురా యని ప్రసాదరావు చూడ సాగెను. ఎవరో తనవలెనే తలఁదాచుకొనుటకై విచ్చేసియుందురేమో యని యొకమాఱు తలంచెను కాని యది స్థిరతరముకాలేదు. "వీరింత నిరాఘాటముగ లోపలఁ బ్రవేశించుటనుజూడ నీతావంతయు వీరికి పరిచితమై యుండునని తోఁచెడిది. ఇది మనుష్యమాత్రులు సంచరింపఁ దగినతావై చూపట్టదు. ఇట్టి నిర్జనాద్భుతభయావహస్థలపరిచయస్థులగు వీ రెవ్వరో యెఱుంగవలెను. జారచోరహంతకాళిలో నొకరు కాకూడదా. వీరియుదంత మింత తెలిసికొనిపోవుట నావంటి రక్షకోద్యోగికి విధాయకము." అని యూహించి యతఁడు గృహాగమనాలోచనను మఱచి యుండే నిలుచుండెను.

ఆ కటికచీకటియం దెట్టినూతస్మ్రచలోకనంబును బనికిరాకుండెను. వేణీప్రసాదు చొక్కాజేబునం దొకచిన్న విద్యుద్దీప ముండెను కాని దాని నాసమయమున వెలిఁగింపఁగూడదని తనవాఁడిచూపులమీఁదనే యాధారపడనెంచెను. ఎంతప్రయత్నించినను లోపలఁ బ్రవేశించినవా రెవ్వరో, యెందఱో యెటువంటివారో యెఱుంగుట కష్టముగ నుండెను. అతఁ డట్లే కనుపెట్టుకొనియుండ లోపలకేగినవా రేదియో మాటాడు కొనుచున్నట్లు వినవచ్చెను. వేణీప్రసాదు తనమనసు నేకాగ్రపఱచి వ్రేళ్ళపై నడుగిడుచు వారున్నహాలును సమీపించి యుందున్న

జాలకముక్రింద నణఁగి కూర్చుండి పైనున్న నీలోత్తరీయముచే ముసుఁగు వైచుకొనెను. అప్పుడు లోపలి కేగినవారిలో నొకఁడు వెలుపలికి వచ్చి యొకమారా ప్రదేశము నంతటిని గలయఁజూచి "మహారాజ్! పరులెవ్వరును లేర"ని తిన్నని యెలుంగుతో ననెను. లోపలినుండి "తలుపులు మూయుము మట్లయిన" అని వినఁబడుటచే వాఁడు ద్వారమును మూసికొని లోపలికిఁ బోయెను. ఆగాఢాంధకారసాగరమధ్యమున నొకరినొకరు గుర్తింపఁజాలరన్న చిత్రమేమియు లేదు. వాని నయనేంద్రియములు వానిని వంచించెను. వాఁడు మనయిన్స్పెక్టరు నవలోకింపఁడయ్యెను. ఆ సమయమున సర్వదయాంతఃకరణుఁడగుపరమేశ్వరుఁడు ప్రసాదరావునకుఁ బెద్దయుపకార మొనరించెను.

అతఁడంతఁ దిన్నగఁ దలయెత్తి లోపలికి తొంగిచూచెను. అందు వెలుపలికన్న దట్టముగ మబ్బు క్రమ్మియుండెను. ఆ చీకటియందు వారేదో మాటాడుకొనుచుండుటను గాంచి యతఁడాశ్చర్యచేతస్కుఁడై "ఎవరు వీరు, ఇంత నిగూఢముగ జగంబున కెఱుకలేకుండ వీరీస్థలమున మాటాడుకొనువిషయ మేమైయుండును? ఎట్లయినను నన్నీస్థానమునకుఁ దెచ్చుటలో భగవదుద్దేశ మెట్టిదో మహత్తరమై యుండునని తలంతును." అని యనుకొనుచు నతఁడు తల నాకిటికీకమ్ములసందుననుంచి సావధానుఁడై యాలకింపసాగెను.

వారి సంభాషణ యంతవిస్పష్టముగఁ గర్ణగోచరము కాకుండెను. చెవినిచ్చి బాగుగవినుసరికి ప్రసాదరావున కంము తనయొక్కయు, ఇస్మ్రాల్ ఖానుయొక్కయు, అజీజుద్దీనొక్కయు పేర్లు వినవచ్చుటచే నతఁడు మఱింత యుత్సాహముతో "ఓహో, వీరెవ్వరో తాజుద్దీన్ ఖానును సంహరించినహంతకవర్గములోనివారని తోఁచెడిని." అని యనుకొనెను. అంజతనికి వినవచ్చినభాగ మిది—

ఒకఁడు : మీకు రావలసినది వచ్చినది. ఇఁక సతృప్తి యెచ్చటిది ?

మఱియొకఁడు : లేదు. మీ మాటను చెల్లించుకొన్నారు.

ప్రథముఁడు : కాఁబట్టి యింక నీరహస్యముల మఱచిపొండు. చచ్చి యమునిదగ్గఱకుఁ బోయినను సత్యమును బయలుపెట్టరాదుసుమా !

మఱియొ : మీకింక నా విషయమై భయమెందుకు. మానుండి రెండవప్రాణి యీ రహస్యము నెఱుఁగ నేరఁడు. కాజుద్దీన్ హంతకు లెవ్వరో ప్రపంచమున కిఁక తెలియ దని నమ్ముఁడు.

ప్రథము : అరే, పేర్లు చెప్పకు. గోడకు చెవులున్నవి.

ఒకఁడు : భయము లేదు, స్వామీ ! వెలుపల చూచి వచ్చినాను. ఎవ్వరును లేరు. ఇది మిక్కిలి రహస్యస్థలము. ఇచ్చటికి పోలీసువారు కాని, యితరులు కాని యిట్టివేళలో రాఁజాలరు.

మఱి : స్వామీ, తలఁచుకొన్న నవ్వు వచ్చుచున్నది. నేరము చేసినదొకరు. శిక్ష ననుభవించువాఁడు మఱియొకఁడు. పోలీసువారికన్న దేవుఁడే పెద్దగ్రుడ్డి. మీకింక భయములేదు. మీరు తప్పించుకొన్నట్లే. మీకు మారుగ నిస్మాలురికంబమెక్కును.

ప్రథ : నన్ను నుమానించుటకు లోకుల కాస్పద మెచ్చటిది ? నే నెప్పటివలె నిఁక ముందుకూడ పెద్దమనుష్యుఁడనే.

ఒకఁడు : అవును. ఆమాట నిజము.

ప్రథము : గులామ్‌షాహీవలననే నా రెండవయుద్దేశము నెఱ వేఱవలసియున్నది.

ఒకఁడు : రజియాబీబీ విషయమా !

ప్రథ : అవును. నీనుండియే యామె నాకు దక్కవలయును. ఏమన నీవాయింటివాఁడవు.

ఒకఁడు : అది నెఱవేఱుటెంతలెంపు. నా సాహసయుక్తులు మీకుఁ దెలియనివికావుకదా.

ప్రథ : నీవు మిగుల గట్టివాఁడవనియే నీపై నీ కార్యభారముంచు చున్నాను.

ఒకఁడు : ఫరవాలేదు.

ప్రథ : పట్టుము. గులామ్! ఇది రెండవపని నెరవేర్చుటకై నీ కిచ్చుసంచకరము. అని యా చీకటియందే కొన్ని రూపాయలను దీసి శబ్దించెను——

ఆ సంభాషణనంతటి నాలకించి వేణీప్రసాదు విస్మయవిస్ఫారితుఁ డయ్యెను. అతఁ డింతవఱకు నిస్మాలునే హంతకునిగా భావించెను. ఇప్పు డీనూతనరహస్యముల నాలకించి పరమాశ్చర్యముతో "ఆహా! వీరెవరో యిందొకఁడు యజమానుఁడనవలెను, తక్కినవారు వానియా జ్ఞానువర్తకులుగ నున్నారు. వీరి సంభాషణను జూడ నీ యజమానుఁడే తాజుద్దీన్ ఖానును సంహరించిన హంతకుఁడని తేటతెల్లమగుచున్నది. ఇందేదో పరమాద్భుత మిమిడి యున్నది. ఇస్మాలుఖానును మేము పొరపాటున బంధించినట్లు తోఁచుచున్నది. వీరెవ్వరో తెలియకున్నదే. ఇది మహారహస్య మనుటకు సందియము లేదు. వీరు క్రూరరాక్షసుల వలె నున్నారు. వీరు సామాన్యులు కారు, ఇదియే కావచ్చును. వీరి రహస్యస్థానము. వీరిప్పుడు మాటాడుకొన్నస్త్రీ మరణించిన తాజుద్దీన్ భార్య రజియాబీబీయే కావచ్చును. ఆ దుర్జాతివిధవ తాజుద్దీనును వంచించి యిస్మాలును వరించియు, నిపుడు వానినికూడ మోసగించి మఱియొకని మోహింపనున్నదా?" అని లోలోన యోచించుకొను చుండ నంత వారిలో నొకఁడు—ధూమపానాకాంక్షచే చుట్టనంటించుట కగ్గిపుల్ల నొకదానిని వెలిగించెను. తోడనే యాగదిలోనిసమస్త మొక

త్రుటికాల మస్పష్టముగఁ గాన్పించి యామరుక్షణముననే యధాగతి నిబిడాంధకారవిలీనమై పోయెను. కాంతి ప్రసరించినకాలమున వేణీప్రసాదరా యాస్థలము నతిజాగరూకతతో పరికించిచూచెను. అచట నాసమయమున మువ్వురుపురుషులుండిరి. అందిరువురు కిటికీవైపు పృష్ఠభాగములనుంచి నిలుచుండుటచే వారిముఖాకారముల గమనించుట కీక్షకునకు వలనుపడదయ్యెను. మూడవవానిమోముమాత్ర మొక త్రుటికాలము విస్పష్టముగఁ గాన్పించెను. అతఁడొక మహామ్మదీయుఁడు ఇంచుక నిడుపగు నల్లనిగడ్డము మీసములు వానివికారముఖమును మఱింత వికృతి గావించుచుండెను. శిరముపై రక్తవర్ణవేష్ట మొకటు కలదు_అంతలో నగ్గిపుల్ల యారిపోవుటచే మఱేమియు గోచరింపలేదు.

వేణీప్రసాదు హృదయఫలకమున మూడవవానిముఖము స్థిరముగఁ జిత్రింపఁబడెను. కాని యామొగమతనికి కేవలనూతనము. అపరిచితుఁ డగునాపురుషునిఁగూర్చి యాసమయమున నేమియు నాలోచింపఁజాలడయ్యెను. కొంతవఱకు యోచించుకొని "నేనిప్పుడసహాయుఁడనై వీరిని బట్టఁబోయిన నామృత్యువును తెచ్చుకొన్నవాఁడ నగుదును. ఈ సమయమున విడిచిన మరల వీరిని బట్టఁగలుగుదునా! చేతఁ జిక్కినపిట్ట లెగిరిపోనున్నవే" యని చీకాకుపడుచుండ లోపలివారిలో నొకఁడు "వెలుపలవర్ష మాఁగియున్నదా! చూచి రండు" అనెను. అప్పు డొక సేవకుఁడైన నొకఁడు తలుపును దీసుకొని వెలుపలికి వచ్చునని వేణీప్రసాదు వెంటనే యాస్థలమును వీడి సద్దులేకుండ నడచిపోయి యందున్న యొక శిథిలకుడ్యమువెనుక దాగుకొనెను — ఆక్షణముననే యతఁ డూహించిన ట్లొకఁడు ద్వారమును తెఱచుకొని వెలికేతెంచి చూచి "అయ్యా! వాన నిలిచినది. ఇంక పోదము రండ" నెను. ఆమాటను విని లోపలివారు వెలుపలికి వచ్చిరి.

ముగ్గురును జేరి కొంతకాలము నిశ్శబ్దముగ చుట్టును కలయఁజూచి యా స్థలమునువీడి తోటలోని కేగిరి.

వేణీప్రసా దిపుడింకేమి చేయఁగలఁడు !

# తొమ్మిదవ ప్రకరణము

## వి చా ర ణ

హాంతకు లంతసులువుగఁ దనయెదుటనే తప్పించుకొని పాఱిపోవుటను గాంచి యిన్స్పెక్టరు సహింపఁడయ్యెను. కాని యొంటరిగ నతఁ డేమిచేయఁగలఁడు ? ముగ్గురి నెదిరించి పట్టుకొనఁగలఁడా ? అది యసంభవము. దాపున మఱెట్టిసహాయముకూడ కాన్పింపలేదు. అందులో నెవనిని బట్టుకొన్నను లాభమే కాని యది సాధ్యమగు టెట్లు ! ఎట్లయినను చూచిచూచి వారిని వదలుట పౌరుషహీనమని తలంచి దైవముపై భారము వైచి తనసంకల్పము నెఱవేర్చుకొనఁదలంచెను.

అట్లాముగ్గురును తోఁటలోని కేగినపిదప వారి కెఱుక లేకుండ వేణీప్రసాదు తనగు ప్తస్థలమును వీడి యీవలకు వచ్చెను. వారప్పుడు నగరాభిముఖులై పోవుచుండిరి. "ఈ దుష్టత్రయ మిప్పుడు పురములోని కేగుచున్నది. వీరి దీయూరే కావచ్చు. ఇంచుక యోచించిచూడ లచ్చన్నయు భద్రుఁడును చెప్పినయాకారసామ్య మిందొకనియందు పొడకట్టుచున్నది. తెలిసినవారెవరైన నిపుడు దాపున నుండిన నెంతో బాగుండెడిది. ఇందులో నొకఁడు సంతదినమునఁ బెట్టెను. ఆగ్రామస్థుల యధీనము గావించి పోయినవాఁడగును. వీరికిఁ దెలియరాకుండ వీరున్నయింటిస్థానములఁ దెలిసికొనుటబాగు." అని యనుకొని యతఁడు

వారు వెనుదిరిగిచూచినప్పు డాయంధకారమునఁ దరుప్రకాండముల మాటున దాగుచు, లేనపుడు మెలమెల్లన నడుగువైచుచు వారివెంట నరిగెను.

వర్ష మప్పటి కాగియున్నను గగనవీధిని నైర్మల్యము చేరరాకుండెను. రిక్కలకాంతి మేఘమాలికల దూసికొని వచ్చి భూమిపైఁ బడఁజాలకుండెను. 'అంధకారముమాత్రము మునుపటియట్లవిచ్ఛిన్నముగఁ బ్రసరించియే యుండెను. వారప్పుడు నడచుమార్గమున నెట్టి దీపకాంతియు లేదు. వర్షసమయమగుటచే వీథిలో జనసంచారము చాలవఱకు మందగిలియుండెను. మార్గమున కిరుప్రక్కలను సౌధముల యందు విద్యుద్దీపికలు వెలుఁగుచుండెను. కాని యాకాంతి బజారు దనుక ప్రసరించుటకు నడుమ నుద్యానతరుసంతతి యడ్డుపడుచుండెను. ఇంతలోఁ బురము సమీపించెను. అప్పుడు ప్రసాదరావున కొకపెద్ద చిక్కు తటస్థించినది. ఏమన, నవి యుత్సవదినము లగుటవలన గొందఱు యువను లుత్సవమును జరుపుచు నొకగుంపు కట్టుకొని యామార్గము వెంట వచ్చిరి. అప్పుడాదుర్మార్గత్రితయమునుపైఁ గన్నుంచి యుండు టతనికి దుర్ఘటమయ్యెను. అందఱును మహామ్మదీయులే. "ఒకవేళ వారు వీరితోఁ జేరిపోయిన గుర్తిమ పట్టు"నని వేణీప్రసా దాలోచించుకొని బిరబిర నడచి ముందున కేతెంచి యామూకతోఁ జేరి వారు తప్పించుకొని పారిపోకుండ లక్షించి చూడసాగెను. ఐదునిమిషముల కాజనులసందడి తగ్గెను. అంత ప్రసాదరావు బమ్మెరపోయి చూడ సాగెను. ఆ సమూహము దాటిపోయిన వెనుక నెవఁడో యొకఁడుమాత్ర మొంటరిగ నూరిలోని కేగుచుండుట కానిపించెను. వాలకము నిదివఱ కాయుత్సవదీపకాంతులలోఁ గాంచిన ముగ్గురిలో నొకనిదానివలె నుండెను. కాని తక్కినయిద్దఱాసందడిలో నాసమూహములోఁ జేరిపోయిరి"

ఇపు డేమి చేయఁగలఁడు ? వాఁడికొంతకుఁ బోయిన ముందు పోవుచున్న వాఁడు కనఁబడకపోవును— వీనినే యనుసరించి పోయిన వారు తప్పించుకొనిపోదురుకదా. ఎట్లయినను చేఁజిక్కినపైసాయే పదివేలని భావించి ప్రసాదరావు “ దొరకినవానిని విడువరాదు. వీని వృత్తాంతము . . సిన తక్కినవారియుదంతము తనంతనే వెల్లడియగు ” నని యనుకొని ముందుపోవుచున్న పురుషుని వెనుక పోసాగెను.

వాఁడు యజమానియో పరిచారక ద్వయములో నొకఁడో గ్రహింపఁజాలకపోయెను. తాను మహోద్యానమందిరమున హృదయ ఫలకమునఁ జిత్రించుకొన ముఖముమాత్రము కాదది. వాఁడు సురిగి పోయినాఁడు రాజవీధిలో మార్గమున కిరువైపులనుండు దీపప్రకాశమున వానిముఖము నస్పష్టముగ నవలోకించుచు వేణీప్రసాదు ముందునకు వెడలిపోవుచుండెను. ముందు నడచిపోవుచున్న తురుష్కుఁడు చాల కాలమువఱకుఁ బలువీధుల దాటి తుట్టతుదకు నగరికి దక్షిణదిశయందున్న జుమ్మామసీదు వీధినిఁ బ్రవేశించెను.

జుమ్మామసీదువీధి చాలవఱకు తురుష్కనివాసస్థానము. వాని మందిర మెచ్చటనో గమనింపవలయుననియే వేణీప్రసా దింతప్రయాసపడి వానిని బంధింపక యింతదూరము వచ్చినది. ఆమహామ్మదీయుఁడంతఁ గొంతసేపటి కాశ్రేణిలో నొక మహోన్నత సౌధరాజమునఁ బ్రవేశించెను. అదియే వానియిల్లు కావచ్చునని వేణీప్రసాదు తలంచెను.

వాఁడట్లు లోపలికేగిన కొంతసేపటికి వేణీప్రసాదు మందిరమును జూసి ద్వారముగుండ లోనికి తొంగిచూచెను. అది మిగుల విశాలమగు కట్టడ మగుటయేకాక యత్యంత రమణీయమై శ్రీకళలచే నొప్పారు

చుండెను. వేణీప్రసాదు లోపలి కేగుదమా యని తలంచి యంతలో "అది బాగుకాదు. నిక్కముగ నిదియే వీనివాసస్థానము. లేకున్న నింతటివేళలో వీఁడితరుల యిండ్లలోని కేగుట కేమికారణ ముండును. ఇప్పటి కీయింటినంబరును గుర్తించుకొని పోయి యుదయముననే వచ్చి యనుసంధానమును గావింతము" అని యనుకొనుచుండ లోపలి నుండి యెవఁడో యీవలికి వచ్చెను. వానినిఁ గాంచి వేణీప్రసాదు "భాయీ! ఇదియెవరియిల్లు?" అని యడిగెను. వాఁడందు కుత్తర మియ్యక పరాకుతో నతనిఁజూచి "పోపొమ్మయ్యా. ఎవరిదైననీ కేమి" అని లోపలికిఁ బోయి తలుపులు మూసికొనెను.

వేణీప్రసాదంత "ఇది నిక్కముగ నొరులవాసస్థానమే యగుచో నాయువనుఁడు కొంతకాలమునకైన వెలికి రాకమానఁడు కదా" యని యెంచి సుమారొకగంటకాల మాయింటికెదురుగ నున్న మఱియొక సౌధరాజముముందున్న యరుగుపైఁ గూర్చుండెను. కానియాతఁడెంచి నట్లు జరుగలేదు. ఎంతసేపు కాచినను వాఁడు వెలుపలికి రాఁడయ్యెను. "ఇఁక నిచట వేచియుండుటచే లాభములేదు. నేను తలంచినట్లిదియే వీనిసదనము." అని యతఁ డాయింటి నంబరును గుర్తించుకొని నిజ మందిరమునకు వెడలిపోయెను—అది **1213** నెం. గృహము!!

వేణీప్రసా దిలుసేరినపిదప భార్యయగు కమలామణి వడ్డించగా భుజించి శయ్యపై మేను వాల్చెను కాని యతనికి నిద్రాసుఖ మబ్బ లేదు. దాని నతఁ డాసింపనైన లేదు. బలవంతముగ నాతఁడు నిద్ర నాఁపుకొని తాను కాంచినదుష్టుల గుఱించి యాలోచించుచుండెను. "ఇఁక రేపేకదా యిస్మాల్ ఖాను విచారణదినము. అహో! దైవమెంత దయామయుఁడు! ఒక్కదిన మించుక తారుమారైన నిష్కారణముగ నిరపరాధి యగు నాభువను సురిశిక్షపాల్పఱచియుండునే. అయార్తునిఁ

గాచి నా ప్రమాదమును దెలుపుటకే కాఁబోలు సర్వేశ్వరుఁడు నిన్న సాయంకాలము నన్ను వాహ్యాళి నెపంబున నీడ్చుకొనిపోయి యీమహోద్యానమందిరమునఁ గనివిని యెఱుఁగని రహస్యమును దెలియఁ బఱచెను. రేపు న్యాయాధిపతి యిస్మాలు నపరాధిగా నిర్దేశించుట నిక్కము. నేనప్పుడు జరిగినసంగతులనెల్ల వెల్లడిచేసి విచారణకు మఱియొకగడు వుంచుమనియో, యిస్మాలును విడుదలచేయుమనియో కోరవలెను. నాకుఁ దోఁచినంతవఱకు మహమ్మదిస్మాలు హంతకుఁడు కాకపోయినను సంశయవిదూరుఁడుమాత్రము కాదని నమ్ముచున్నాను. ఇందు వానియపరాధ మెంతవఱ కున్నదో కనుఁగొనవలయును. విచారణానంతర మనుమానాస్పదురాలగుచో రజియానుకూడ బంధింపవలసినదే. అంతదనుక నామెయింటికడ పోలీసుకావుదల నుంచుట మంచిది” ఇట్టి యూహాపరంపరలలోఁ బడి చింతలుద్రొక్కుచునే యతఁడా శేషరాత్రి నంతటిని వేగించివైచెను.

ఉదయమున నిద్రలేచి వేణీప్రసాదు రాత్రి తలంచినరీతిగ **1213** సంఖ్యగల మందిరచారిత్రము నెఱుంగుటకుఁ బోనెంచెను. కాని యది యిస్మాల్ ఖాన్ విచారణదిన మగుటవలన కార్యభారము మిక్కుటముగ నుండుటచే నతఁడు తన యుద్దేశమును మార్చుకొని యప్పుడే పోలీసుఠాణాకుఁ బోయి కొందఱు రక్షకభటుల కేమేమియో చెప్పి వారిని తాజుద్దీన్ ఖాను గృహమున కనిపెను. తర్వాత నజీజును జూడఁబోయి కొంతవఱకు మాటాడి యవసరకార్యములఁ దీర్చుకొని సరిగఁ బన్నెండుగంటలకు న్యాయస్థానమున కేగెను.

అప్పటికప్పుడే యాతావంతయు జనసమ్మర్దముచేఁ గిటగిటలాడుచుండెను. తాజుద్దీన్ ఖాను సర్వజనానురంజకుఁడైన మహాశయుఁడు. అతని ద్వేషించువారు కొందఱుమాత్రమే యుండిరి. బహుజనశ్లాఘా

పాత్రుఁడగు నా యుదారచరిత్రుని యకాలమరణవార్త నాలకించి పలువురు పలుగతులఁ జింతించిరి. నేఁడతని హత్యావిషయమై న్యాయస్థానమున విచారణ సలుపఁబడు నని యాలకించి — యతనిసోదరుఁడగు నిస్మాలుఖానే నిందితుఁడుగా శంకింపఁబడెనని విని — జనులు తండోపతండంబులుగ వచ్చి కోర్టువద్ద మూగిరి. రక్షకభటు లాదినము వారి నడ్డగింపక నిమ్మళముగఁ బోయి లోపలఁ గూర్చుండుట కవకాశ మొసంగిరి. అతిస్వల్పకాలముననే యా ప్రదేశమంతయు నసంఖ్యాకులచే నాకీర్ణమయ్యెను. పోలీసువారుకూడవచ్చి యాతావు నలంకరించి యుండిరి. తాజుద్దీన్ బంధుమిత్రవర్గములోనివారు కొందఱే తెంచి యుండిరి. న్యాయాధిపతి యప్పుడే తనయగ్రస్థానము నాక్రమించుకొని యుండెను. వేణీప్రసాదు శీఘ్రముగ వచ్చి యతనికి నమస్కరించి కూర్చుండెను. అంతఁ గొంతసేపటికి జనులందఱు సోత్కంఠులై నిశ్శబ్దభావముతో నవలోకించుచుండ న్యాయాధిపతిముదల ననుసరించి రక్షకభటులు కొంద ఱపరాధియగు నిస్మాల్ ఖానును దెచ్చి కటకటాకమ్ములలో నిలుచుండఁబెట్టిరి. తర్వాత విచారణ యారంభింపఁబడెను.

న్యాయా : ఇందు వాదియగు నజీజుద్దీనెవరు ?

అజీజు లేచి కోర్టువారికి నమస్కరించి నిలిచెను.

న్యాయా : కూనీచేయఁబడిన పురుషుఁడు నీకేమికావలయును ?

అజీ : అతఁడు మాతండ్రి. పేరు తాజుద్దీన్ ఖాన్.

న్యాయా : అపరాధి నీకేమగును ?

అజీ : ఇతఁడు మాపినతండ్రి. మాజనకునికి పితృవ్యపుత్రుఁడు.

న్యాయా : ఇతఁడు మీయింటనే యెప్పుడును గాపురముండునా ?

అజీ : చిత్తము. ఇప్పటికిని మాయింటనే యున్నాఁడు.

న్యాయా—ఇతనికి వివాహము లేదా ?

అజీ—లేదు.

న్యాయా—ఏల ?

అజీ—మాతండ్రి యెన్నియో విధముల బోధించెను. కాని దుర్మార్గలంపటుఁ డగునితఁడు పెండ్లి చేసికొనలేదు.

న్యాయా—మీతండ్రికి నీతనికిని బరస్పర ప్రేమయున్నదా ?

అజీ—నాకుఁ దెలిసినంతవఱకు మాజనకుఁడు మాత్రమితని నెంతో యాదరప్రేమలతో మన్నించుచుండెను. కాని యీనడుమఁ గొంతకాలమునుండి యీయిరువురికి విరోధ మారంభమైనది.

న్యాయా—కారణ మేమి ?

అజీ—ఆర్యా ! కారణము నేనెఱుఁగుదును. కాని దానినీ నిండు సభలో నుగ్గడింప సంకోచ మొందుచున్నాను. ఇదిగొప్పయింటి వారి గృహచ్ఛిద్రము,

న్యాయా—కావచ్చును. సంపూర్ణముగ శీతజలనిమగ్నుఁడై చలికి వెఱవఁదగునా ? ఇది న్యాయస్థానము. నీకుఁ దెలిసినసర్వమును వినిపింపక తప్పదు.

అజీ—( తలవాల్చి యూరకుండును. )

వేణీప్రసా—కోర్టువారి కీవిషయమై యజీజుద్దీను నంత నిర్బంధ పఱుపఁ బనిలేదు. నేనేచెప్పెదను. తాజుద్దీన్ ఖాకా ద్వితీయజాయ యగు రజియాబీబీ యనునామె నిస్మాలు తనమోహపాశమునకుఁ జిక్కించు కొనుటచే నీయిరువురన్న దమ్ములకును బరస్పర వైషమ్య భావోదయ మైనది. ఈసంగతిని మావివరణపత్రమునందు ( Charge Sheet ) వివ రించి యుంటిమి.

న్యాయా—అజీజుద్దీ నిందు కేమిచెప్పును ?

అజీ : చెప్పుటేమి. మహాప్రభూ! జరిగినదంతే.

న్యాయా : అయిన నిందిస్మాలుఖానొక్కఁడే సంశయింపఁబడుటకు హేతువేమి? రజియాబీబీనికూడ పోలీసువారేలసంశయింపరైరి?

వేణీ : రజియాబీబీని మేము శంకింపకపోలేదు. కాని జనానాస్త్రీ కావున బంధింప సాహసింపమైతిమి. ఒకవేళ దోషురాలని తేలిన వెంటనే యామెనుగూడ నరెస్టుఁజేయుఁగలము. ఆమె యుండు స్థలమునఁ దగినపోలీసుకాపుదల కలదు. రజియాబీబీకూడ నిర్బంధమున నున్నట్టే.

న్యాయా : మంచిది. హత్యజరిగిననాఁటి రాత్రి యజీజుద్దీ నింట నుండెనా?

అజీ : లేను.

న్యాయ : ఎందేఁగియుంటివి?

అజీ : రాజకోటయందు మామేనత్త జబ్బుగా నుండుటచే మాసముక్రిందట మాతండ్రిగారి యనుమతి నొంది నేనచ్చటికిఁ బోయియుంటిని.

న్యాయ : నీవెప్పుడహమదునగరునకుఁ దిరిగి వచ్చితివి?

అజీ : హత్యజరిగిన మఱునాఁటి యుదయమున.

న్యాయ : అప్పుడే నీకీహత్యావిషయము తెలిసినదా?

అజీ : లేదు. నాకెవ్వరును జెప్పలేదు.

న్యాయ : మీ పినతండ్రి యగు నీ యిస్మాల్ఖాను చెప్పలేదా?

అజీ : లేదు.

న్యాయ : అయిన మీతండ్రి మరణకారణ మేమని చెప్పెను?

అజీ : జ్వరపీడితుఁడై పరలోకగతుఁ డయ్యెనని మాత్రము తెలిపెను.

న్యాయ : నీవామాటను విశ్వసించితివా ?

అజీ : చిత్తము. ఏసంగతియుఁ దెలియుని నేను నమ్మకేమి ?

న్యాయ : నీవు రాజకోటలో నున్నప్పుడు మీతండ్రి తనకు జబ్బుచేసినట్లు నీకు వ్రాసి యుండెనా ?

అజీ : ఏమియు వ్రాయలేదు. ఇందిస్మాలుఖాను, మామమాత చేరి తన్నానేకభంగుల బాధించుచున్నారనియు, నేను దాపున నున్నంత కాలము వారిపీడయంతగ నుండదు కావున నన్ను శీఘ్రముగ మరలి రమ్మనియు మాత్రము వ్రాసి యుండెను. నేనద్దానినిఁ గాంచి మహాగ్రహాగ్రస్తుఁడనై వారి నిలువెడలఁగొట్టవలయు నని సంకల్పించుకొని యిచటికి వత్తునుకదా యిట నింతఘోరము జరిగిపోయినది.

న్యాయ : ఈ సందర్భమున నిస్మాల్ ఖా నేమి చెప్పనోచూతము. తాజుద్దీను హత్యకావింపఁబడియుండుటను గన్నారఁ గాంచియు నీవు రామగిరిపంతుగారితోడను, అజీజుతోడను తాజుద్దీన్ వేకిచే మరణించె నని యసత్యమును బ్రకటించుటకుఁ గతమేమి ?

ఇస్మా : హత్య జరిగినదన్న నిఁకబోలీసువారు వచ్చి లేనిపోని యల్లరులు నడుపుదురేమో యనుభయముచేతను, నేను హంతకుఁడు కాకపోయినను ప్రస్తుతస్థితినిబట్టి వారు నన్ననుమానింపక విడువరనియు, వృథాగందరగోళము గావించినను హంతకుఁడు పట్టువడఁడను హాతాశ చేతను నేనట్లు చెప్పితిని.

న్యాయ : ఇప్పుడుమాత్రము దాగినదా ?

ఇస్మా : ఇట్లగునని నేఁదలంపనైతిని.

న్యాయ : మీ సోదరుఁడు చంపఁబడియున్నను నీకు ప్రతీకారాలోచన లేకుండుట చిత్రముగా నున్నది. తర్వాత నజీజునకు సత్యవార్త యెట్లు తెలిసినది.

అజీ : అది నాకుఁ బోలీసువారిమూలమునఁ దెలిసినది. నేనూరి నుండి వచ్చినదినము మధ్యాహ్నము పోలీసుయిన్‌స్పెక్టరు వేణీప్రసాద రావుగారు నాకై వార్తనంపిరి. నేనతనిని పోలీసుఠాణాలోఁ గలిసికొని సమాచార మేమని యడుగ నతఁడు తమకా వెనుకటి దినమునఁ దొరికిన విచ్ఛేదితమస్తక సహితంబగు మందసమును జూపి "ఈపెట్టెలో నీవీ రుండుటకుఁ గారణమేమి? ఈపెట్టె యెవ్వరిది? ఈతల యెవ్వరిదో యానవాలిడఁగలవా?" యని యడిగిరి. నేనంతనిదానించి చూచి మందసము నాదిగను, శిరస్సు నాజనకునిదిగను గుర్తించితిని. అదియొకహత్యాపరాధమనియు, దానినిఁ గూర్చి యనుసంధానముఁ గావించుచుంటిమనియు, తెలిసినదంతయుఁ దెలుపవలసినదనియుఁ జెప్పిరి. నేనును దుఃఖభావములఁ బట్టఁజాలక మాగృహచ్ఛిద్రముల నన్నిటిని వినిపించితిని.

న్యాయ : నీ ట్రంకు నెందుంచి యుంటివి?

అజీ : మాతండ్రిగారి శయనమందిరమున నాబట్టలును, అతనిదుస్తులును, అందుండుటచే నాపెట్టె రెండవతాళమును మాతండ్రికిచ్చిపోయితిని

న్యాయా : తాజుద్దీను దాని నెందుంచి యుండెను?

అజీ : ఆసంగతి నాకుఁ దెలియదు.

న్యాయా : ఇస్మాల్‌ఖాను తెలుపఁగలఁడా?

ఇస్మా : నాకును దెలియదు. దానిని నేను చూడలేదు.

న్యాయా : నీవు చూడనివాఁడ వగుచో నాబీగము నీజేబులోనికెట్లు వచ్చియుండెను. పోలీసువారు హత్యామందిరమును శోధించినపు డందు నీచొక్కా యొకటి దొరికినది. అందు వారి కీతాళపుచెవి కాన్పించినది. నీయంగీ యచ్చట నుండుటకును, దానిలో బీగము చెవి గోచరించుటకును గారణము లేమి?

ఇస్మా : ఆసంగతి యల్లా కెఱుక. సర్వేశ్వరుని సాక్షిగ నాకావిషయము తెలియదు. క్రిందిగదిలోనున్న నాకోటు తాజుద్దీన్ శయ్యామంది

రము నెట్లుచేరెనో దానియందు బీగము చెవి యెట్లుండెనో మీకువలెనే నాకును వింతగనేయున్నది.

న్యాయ : అయిన హంతకుఁడు నీవు కాక మఱియొక్కఁడనియా నీ యభిప్రాయము ?

ఇస్మా : అవును. నేనాఘోరాఘమును జేయులేదు. హంతకుఁ డెవఁడో నాకును దోఁచకున్నది. అయినను మీకు దొరికినసాక్ష్యములు నేనెంతనిర్దోషి నని వాదించుకొన్నను విశ్వాసమును గలిగింపకపో వచ్చును. జగదీశ్వరుఁడే నానిర్దోషత్వమునకై నన్ను మన్నింపవలెను. ఆ సర్వాంతర్యామి కవేద్యాంశము లెందునుండవు.

. న్యాయా : నీవారాత్రి నాటకమునకుఁ బోయినమాట నిజమేనా?

ఇస్మా : అవును. నేను తిరిగివచ్చునప్పటికి సుమారు మూడు ఘంటలై యుండెను. మాయింటి పరిచారకుఁ డొకఁడు తలుపుఁ దీయగా తిన్నగఁ బోయి రెండవమేడలోని నాగదిలోఁ బరుంటిని. ఉదయమున సాఖియా తాజుద్దీనుపడకటెంటికడ రక్తచిహ్నములఁ గాంచి భయభ్రాం తయై తలుపు దెఱచి లోపలికిఁ దొంగి చూచినది. తోడనే యందు రక్తప్లుతమగు పర్యంకముపై శిరోవిహీనరక్తమయ శరీరమును గాంచి భీతిలి గట్టిగ నఱచెను. మేమందఱ మూర్ధ్వ... నాకించి పైకి పోయి చూడఁగా తాజుద్దీనుఖాను నెవరో హత్యగావించి తల నెత్తుకొనిపోయి యుండిరి. వాస్తవ మేదియో యూహించుకొనలేక వెనుక తెలిపిన కారణములఁబట్టి సద్దులేకుండ శవమును సాగించివైచి మాయున్న జ్వర నిహతుఁడయ్యెనని వెలిబుచ్చితిని.

అప్పటి కుపాహారసమయమగుటచే విచారణ చాలింపఁబడెను.

# పదియవ ప్రకరణము

## నిష్కాసితుఁడు

అల్పాహారసమయానంతరము సరిగ నాలుగుగంటలకు మరల విచారణ యారంభ మయ్యెను. విచారింపవలసిన సంగతులెల్ల ముగిసినవి. విన్న వారందఱు మహమ్మద్ యిస్మాయిల్‌ఖాను నిక్కముగ నపరాధియై యుండునని నమ్మిరి. ఇఁక న్యాయాధిపతి యేమితీర్పు నిచ్చునో యని యందఱు నాత్రముతోఁ జూచుచుండిరి.

న్యాయ : ఇస్మాయిల్‌ఖాన్! నీవు హంతకుఁడవని నిరూపించుట కెన్నియో ప్రబలకారణము లున్నవి. నిన్ను బంధించుటలోఁ బోలీసు వారు ప్రమాదపడలేదు, నీవు తలంచినట్లు నీవనుమానింపఁబడితివి. ఇది యిప్పుడు కేవల మనుమానమే కాక సత్యమనికూడ నాకుఁ దోఁచు చున్నది. ఇందు కిఁక దీర్ఘవిచారణ యనవసరము. నీపరముగ సాక్షు లెవరైనఁ గలరా?—

ఇస్మా : లేరు. ఉన్నను పనికిరారు. నాకిప్పు డాయల్లా యొక సాక్షి. నాయంతరాత్మ మఱియొకసాక్షి. త్రికరణశుద్ధిగ నేనేపాప మెఱుఁగను. అంతయుఁ గాకతాళీయముగ జరిగినది. హత్యాపరాధ మున నాకెట్టిసంబంధమును లేదు. ఇప్పు డిఁక నీ విషయమై హెచ్చుగ నానిరపరాధత్వమును గూర్చి వాదించుకొనఁజాలను. నిలుకడమీఁద నిజము తెలియకమానదు.

న్యాయ : ఆధర్మసిద్ధాంతము లటుండనిమ్ము. ఇపుడు కావలసి నన్ని నిదర్శనము లున్నవి. నీవు దోషివనుటకు నీకును తాజుద్దీనునకును రజియావిషయమై పగ యారంభమగుటచేతను, మీరిద్దఱును జేరి

యావృద్ధునిఁ గారించుచుండుటచేతను, ఇంట ఘోరహత్య జరిగియున్నను దానిని దాచుట కేవియో బొంకులు బొంకి లోకమును వంచింప సాహసించుటచేతను, ఇంటివారికేఁగాక పరుల కలభ్యస్థానమందున్న యజీజుపేటికలో మృతునిఖండితమస్తకము కాన్పించుటచేతను, ఆపెట్టె తాళపుఁజెవి నీకడ దొరకుటచేతను నీవిప్పు డపరాధిగ మాచే నిశ్చయింపఁబడితివి. ఇందు కొలఁదిగనో గొప్పగనో రజియాబీబీకికూడ సంబంధ ముండకమానదు. కాన పోలీసువారామెనుకూడ బంధింపవలసినదే. ఆమెనుగూడ విచారింపవలెను. అంతవఱకు నీవు నిర్బంధమందుండవలసినదే.

వేణీ: నడుమమాటాడ సాహసించినందుకు కోర్టువారు మన్నింతురుగాక.

న్యాయా: ఇప్పుడు పోలీసువారు మఱేమైన విశేషమును జెప్పవలసియున్నదా?

వేణీ: చిత్తము. ఇప్పుడు తక్కెడ తలక్రిందు కానున్నది.

న్యాయ: (వింతపడి)—ఏమది?

వేణీ: భగవంతుఁ డించుక క్రూరకటాక్షములఁ బఱపియుండినచో నిక్కముగ నిస్మాయిలుఖాను దారుణశిక్షార్హుఁడై యుండును. కాని యితనియెడ దైవ మించుకసానుకూలుఁడై యున్నాఁడు. ఇతఁడు నిరపరాధి యని నేనిప్పుడునమ్ముచున్నాను.

అనవు డటమూగినవారంద ఱొక్కమా టాశ్చర్యచకితులైరి. ఇంత నిదర్శనపూర్వకంబుగ నిస్మాయిలపరాధియని నిరూపించినవేణుప్రసాదరావే యిప్పు డతఁడు నిర్దోషియని చెప్పుటచే న్యాయాధిపతికూడ విస్మయవిస్ఫారితుఁడై చూచెను. అజీజుద్దీ౯ రిచ్చపాటున కంతమే లేదు. ఇస్మాయిల్ ఖా నంత యద్భుతానందవీక్షణములతో నిన్ స్పెక్టరును

జూడఁదొడంగెను. అప్పుడు వేణిప్రసాదం దండులవినునట్లు "మూడు దినములకుముందు మీరెల్ల రనుమానించినట్లుగ నేనుకూడ యిస్మాల్ ఖానును, రజియాబీబీని శంకించి హంతకవర్గములోఁ జేర్చితిని. అప్పటి కాపని సరియై యుండెను. కాని యిప్పు డది మహాప్రమాదమని తలంచుచున్నాను. ఇతఁ డన్న ట్రీహత్యాపరాధము కాకతాళీయముగ నీయిస్మాల్ ఖాన్ రజియాబీబీలపైఁ బడినదే కాని నిక్కముగు హంతకుఁడు వేఱు." అని కడచినరాత్రి మహోద్యానమందిరమునఁ గనినవిని యొఱిఁగిన సంగతులలో నొక్కరజియాబీబీ వృత్తాంతముదప్ప తక్కినయంశముల నన్నిటిని సవిస్తరముగఁ దెలిపి "కావున నీకారణములనుబట్టి యిస్మాలుకాని, రజియాకాని యీయపరాధమునఁ జేరలేదని దృఢముగ నమ్ముచున్నాను. ఇప్పు డీవిషయమునఁ దగినంత యనుసంధానమును గావించుచున్నాను. త్వరలోనే దైవసహాయసంపత్తి చేకూరిన సత్యవార్తను లోకమున వెల్లడింపఁగలనని నమ్ముచున్నాను." అని చెప్పెను.

ప్రసాదరావు చెప్పిన యాశ్చర్యవృత్తాంతము నాలకించుటచే నందఱివిస్మయభావ మతీతమైపోయెను. కొన్ని నిమేషములకుఁ బూర్వ మిస్మాలు నృశంసుఁ డని నమ్మి నిందించినవారెల్ల రిపుడు డతనివిషయమై సానుభూతినిఁ జూపసాగిరి. ఒక్కక్షణములో నిస్మాలు లోలోన మహోత్సాహపులకితుఁడై భగవానునకు ధన్యవాదము లర్పించెను. న్యాయాధిపతికూడఁ దనయభిప్రాయమును మార్చుకొనక తప్పదయ్యెను. అజీజుద్దీన్ స్థితియన్ననో చెప్పనలవికాదు. మహాశ్చర్యసాగరనిమగ్నుఁడై యారాత్రి యట్లు మాటాడుకొన్నవా రెవరై యుందురాయని బహుదీర్ఘముగ నాలోచింపఁదొడఁగెను. కాని యీసమస్య యంతటితో ముగియునది కాదని గ్రహింపఁడయ్యెను. ఈ విధముగ ప్రసాదరావు

మొదట చెప్పినట్లు ౖతాను తబ్బిబ్బునొందినది. అపుడు న్యాయాధిపతి "ఈ భయంకరరహస్య మత్యంతసులభగమ్యమని తలంచిన మాయం దఱితలంపులు మారిపోయినవి. అయిన నిప్పు డిన్ స్పెక్టరుగారి సలహా యేదియో తెలుపఁగోరెద." అనెను.

వేణీ: మహాశయా! నాకుఁ దోచునదిది. ఇప్పు డీఁక నీ యిస్మాలుఖానును బంధించుటవలన నేమిలాభము! ఇతనిని జామీనుపై విడుదలచేయవచ్చును. చేసినను ఈ యపరాధపరిశోధన తుదముట్టు దాఁక నితనిని, రజియాబీబీని జాగరూకతతోఁ గనుపెట్టుకొనియుండు టకై రక్షకభటుల కాపుదల నుంచుట మంచిది. ఆవశ్యకమైనచో వీరిని మరల బంధింపవచ్చును.

న్యాయాధిపతి యందుల కియ్యకొని యాయాలోచన సమయో చిత మనెను. అప్పుడే యిస్మాలు తగినపోలీసు కాపుదలక్రింద నింటికిఁ బంపివేయఁబడెను. కర్మచారుల కుచితములగునాజ్ఞ లియ్యఁబడెను. తక్కినవారందఱు తమకుఁ దోచినట్లు ప్రసంగించుకొనుచు నిజనివాసం బుల కేఁగిరి.

సాయంసమయ మైనది. పక్షులు కలకలారావములఁ గావించు చుండెను. లోకబాంధవుఁ డస్తాద్రిమాటున కేఁగుచుండెను. వేణీ ప్రసాదరా వాసమయమున నొకపడకకుర్చీపైఁ బరుండి తనయాలోచనా పరంపరలలోఁ బడి కొట్టుకొనుచుండెను. అతనిబుద్ధి కనిదంపూర్వ మగు తీవ్రత సంఘటిల్లినది. అది నానామార్గములఁ బరుగెత్తుచు, నానావ్యక్తుల సంశయించుచుండెను. పుట్టి పాతికవర్షములైన తర్వాత నతఁ డెన్నఁడు నిట్టిఘోరమగు నభియోగమున స్వయముగదిగి కష్టించి యెఱుఁగకున్నను, ఆకస్మికసంజనిత జ్ఞాతశక్తి ప్రబోధితుఁడై యిప్పు డెంనును మొక్కవోని చాతుర్యమున నీఁక ముందు నిష్కారణముగ

నెవ్వరిని బంధింపక హాత్యారహస్యమును విదీర్ణముగా గావింప దృఢసంకల్పమును గావించుకొనుచుండెను. అట్లుకావించిన నతనిదివ్యనామ మహామదునగరునఁ బ్రతియింటను నిత్యజపము కాకమానదు—అతని యశశ్చంద్రికలు బహుదూరవ్యాపితము లగును—ఇట్టి యాశలు చేరి యతనిని మఱింత ప్రోత్సహించుచుండెను. " ఈ రాత్రి **1213** సం. గృహచారిత్రము నెఱుంగవలయును. అచ్చటికిఁ బోయిన నా విషయమును జెప్పువారెవ్వరు ! సేవకులవలనఁగాని, యింటివారివలనఁగాని యాసంగతి తెలియదు. అదియెవ్వరిదో కనుఁగొన్నచాలును. తర్వాత విషయము లాలోచింపవచ్చును. అజీజుద్దీను నడిగిన నీ సంగతులేమైనఁ దెల్లమగునేమో చూతము. నిన్నరాత్రి నేను విన్నరహస్యసంభాషణనుబట్టి చూడ హంతకుఁడు పలుమార్లు తాజుద్దీన్ ఖాను గృహమునకు వచ్చి పోవుచుండె నని తోఁచుచున్నది. అందు వాని కనుకూలురెవరో యుండిరే తీరవలయును. ఇస్మాలునుగాని, యజీజునుగాని యీ సంగతి నడుగవలెను. రహస్యమెంతవఱకుఁ దెలియునో " అని యీ విధముగ నాలోచించుకొనుచునే యుండెను.

అదృష్టమించుక వక్రించినచో నజీజుద్దీన్ వలన నీసరికి తనగతి యేమైయుండెడిదో యని తలంచుకొన్నప్పుడు ఇస్మాల్ ఖాన్ గుండె గుభిల్లుమనెను. అతనికి నజీజుపై నసహ్యారోషము లినుమడించెను. వాని మూలముననే తనకప్రతిష్ఠ—యసౌఖ్యము—ప్రాణాపాయదశ సంఘటిల్లెనని గ్రహించి మండిపడెను. ఇంటికి వచ్చినతోడనే యిస్మాలు రజియాతో వానిదుర్మార్గము నంతను విప్పిచెప్పి " వానిపై నిఁక నెట్టియభిమానమును జూపఁగూడదు, వాఁడఱకాలముల్లు— పెదవికిమీరినపల్లు, త్వరలోనే యీయింటినుండి తఱిమివేయనగు " నని చెప్పెను. రజియా

యందు కెంతయో చింతించెను కాని తుద కన్యథా చెప్ప లేకపోయెను. అంతలో నజీజుద్దీ నచ్చటికి వచ్చి యిస్మాలును గాంచి " నీకును నాకు నెట్టిసంబంధమును లేదు. నీవు నాయింట నుండఁదగవు. ఇప్పుడే యెందైన వెడలిపొమ్ము. నీవు ఘోర దానవుఁడవు. ప్రబలమారీచుఁడవు." అని యనేకభంగుల దూలనాడెను. అది విని యిస్మా లొక ప్రక్కను, రజియామజీయొక వైపునను మహాగ్నికీలలవలె మండిపడిరి. ఇస్మాలుకూడ నోటికి వచ్చినట్లు దూషించి, బెదరించుచు " ఓరీ ! నీయిల్లెచ్చటకలదురా ? సర్వము నాది. నీతండ్రి నీవు దుష్ప్రవర్తనుఁడవనియు, నిష్ప్రయోజకుఁడవనియు నెంచి తన సర్వస్వమును నాకు వ్రాసియిచ్చినాఁడు. ఇందు నీకొక్కకాసుకూడ రాదు. ఈ యింటఁ బాదమూనుటకుఁగూడ నీకధికారము లేదు. పొమ్మావలికి " అనియెను.

అజీజుద్దీను నివ్వెఱవోయి చూడసాగెను. అతని కాసమయమున జనించిన దాశ్చర్యమో — రోషమో — భయమో నిర్వచించుటకు రాకుండెను. " ఏమి, ఏమంటివి ? మాతండ్రి తనసర్వస్వమును నన్ను వంచించి నీకు వ్రాసియిచ్చెనా ? ఏదీచూపుము, నీవు మహావంచకుఁడవు-టక్కరివి. నిన్ను నమ్మఁజనదు. నాతండ్రి నాకట్టి ద్రోహము నెంచియుండడు. నీవే యీనాటక మాడుచున్నావు. ఏదీ చూపు మా కాగితమును " అని గద్దించి మాటాడెను. ఇస్మాలు ఆగ్రహోద్రిక్తుఁడై " నీకుఁ జూపవలసిన యవసరము లేదు. నీవు నాయింట నుండకుము. నీయిష్టమువచ్చిన చోటికేఁ బొమ్ము. నీతో నాకేటిమాటలు. మంచిమాటలతో వెడలకుంటివా మెడపట్టి త్రోయింతును. నీదిక్కున్న వారికడఁ జెప్పుకొనుము. బ్రతుకఁగోరుదువేని నామాట విని యిఁకమీఁద నోరెత్తక నాయింటఁ గుక్కవలెఁబడి తినుచుండుము. " అనెను.

అజీ: పద్మాక్షీ! నీకింత కడకానరమా! కానిమ్ము. ఇంతటితో నీపని తీరినదని తలంపకుము. నీ ముందుగతి నాలోచించుకొనుము. ఇంతటితో నే విడువను. దురాత్మా! నాయింటినుండి నన్నే వెడలిపొమ్మనుటకు నీ కెంత సాహసము!

ఇస్మా: "ఓరీ, లుచ్ఛా! పొమ్మన్న నింకను నాయింట నిలుచుండి కాఱులాడెదవా?" అని యజీజుద్దీను కంఠముపైఁ జేయివైచి యింటినుండి వెడలఁగొట్టి వెంటనే దాపున నున్న భటవర్గమును గాంచి "ఓరీ, మీలో నెవ్వఁడు కాని నా యనుమతి లేనిదే యీ దురాత్ము నింటిలోనికి రానియ్యకుఁడు. కబడ్దార్" అని హెచ్చరించి లోపలి కేగెను.

ఇస్మాలు సాహసకార్యమును గాంచి యందఱు విస్మయ మొందిరి కాని యెవ్వరును "ఇది యేమ" ని యతని నడుగలేరైరి. బాలుఁడగు నజీజున కేమిచేయుటకును దోఁపలేదు. పినతండ్రి యేదో మోసము చేసెనని యాతఁడు భీతిలెను. ఇంట నెవరుచూచినను నాతనికి సాయపడరైరి. ఇతరులైన నయాచితముగ వచ్చి యిస్మాలుతో "నిదియేమ" ని వాదింపరైరి. ఏల యన, నిస్మాల్ ఖాను దుష్టుఁడు. ఎవరినికూడ లక్ష్యపఱుపఁడు. మధ్యస్థులకు వానివలన గౌరవముండ దని యందఱు నెఱుంగుదురు.

అట్లు పితృవ్యునిచే నిష్కాసితుండైన యజీజుద్దీను వెలుపలఁ గూర్చుండి కాతరచిత్తముతో నిఁక నెందుఁ దలదాచుకొనవలయుననియు, తనకు శరణ్యు లెవ్వరనియుఁ జాలవఱకు యోచించుకొనెను. ఎంతసేపు చూచినను ఇస్మాలునకు భీతిలి సేవకవర్గముకూడ నతనితో మాటాడకుండెను — వారేమిచేయఁగలరు! వారు పరాధీనజీవనులు. అప్పుడతఁ డిఁక నందు కూర్చుండుటచే రాఁగలలాభము లేదనియు నీ దౌర్జన్యమున కేదేని ప్రతీకారముఁ జేయక విడుచుట తగదనియు

నిశ్చయించి యటనుండి వెడలిపోయెను. ఆ నిశీధ కాలమున నజీజు తిన్నగ నక్బర్ వీధిలోని వేణీప్రసాదరావుగారి మందిరమున కేతెంచెను. అప్పు డిన్‌స్పెక్టరు యోచనాధీనుఁడై యిస్మాలుఖానునింటికిఁ బోవుట కాయ త్తపడుచుండెను. ఇంతలో నజీజు దీనవదనుఁడై విచ్చేయుటను గాంచి "భాయీ! సమాచార మేమి? ఏల నీ ముఖమిట్లున్నది?" అని ప్రశ్నించెను. అంత నజీజు తనకు సంభవించిన యనాథగతిని, వేణీ ప్రసాదుతో విన్నవించెను.

వేణీ: నిజముగ నిస్మాలునకు మీ తండ్రి వ్రాసియిచ్చెనా?

అజీ: నాకుఁ దెలియదు. అట్లైనన్నటికిని జరిగియుండదు. కాని వాఁడు ధైర్యముతోనే చెప్పినాఁడు.

వేణీ: దానిని చూపెనా?

అజీ: లేదు. నాకుఁ జూపనవసరము లేదని నన్ను గెంటివైచెను.

వేణీ: సాహసమే. ఇస్మాలును సాధారణునిగాను, అమాయకుని గాను నమ్మితిని. ఎంతదుర్మార్గుఁడు! మీ జనకుఁ డట్లు వ్రాసియిచ్చి యుండునని విశ్వసింతువా!

అజీ: చెప్పితినే. నాకావిషయమున నమ్మకము లేదు. మహా శయా! ఇది వట్టి తాటోటు. మా తండ్రికి నాకంటె నీదుర్మార్గుఁడెక్కు వా? మీఁదుగ వీనిని బరమశాత్రవునిగా భావించియుండెను. అట్టిచో దనసర్వస్వమును నన్ను వంచించి యీకపటచిత్తునకు వ్రాసియిచ్చి యుండునా? ఇదంతయు మోసముకాని మఱేమియుఁగాదు. ఆర్యా! తాము శక్తిపరులు. ఎట్లయినను నా మొఱ నాలకించి, ఈ యవినీతినిఁ బరిశీలించి యిస్మాలుఖానునకుఁ దగినరీతిబుద్ధిఁగఱపి నన్నుద్ధరింపవేడెదను.

వేణీ: అజీజ్! ఇది మోసమని నాకును తోఁచుచున్నది. కాని యుండలిరహస్యము శోధింపవలెను.

అజీ: తాము దయచేసి మాయింటికి రాక తప్పదు.

వేణీప్రసాదు కొంతతడ వాలోచించుకొని "నేనొక్కఁడనే పనిచేయుటకన్న నొకన్యాయవాది సహాయమునుకూడ పొందుట మంచిది" అనెను.

అజీ: అట్లేకానిండు. మీరాకష్టమువచ్చినవారిని తోడ్తెండు. ధర్మమునకు విజయముసిద్ధము. నాయాస్తి నాకుఁ గరగతమైనవెంటనే మిమ్ము సన్మానింతును.

వేణీ: నీ గౌరవసన్మానముల నటుండనిమ్ము. మేమిందు కేవల పరోపకారార్థమై పాటుపడుచున్నారము. అది మావిధి. ఇప్పుడు మనకుఁ దోడగున్యాయవాదికూడ నట్టివాఁడే కావలయును. నామిత్రుఁడగు నందలాలిందులకుఁ దగినవాఁడని తోఁచుచున్నది. ఉదయముననే యతనిఁ జూడఁబోదము. ఇప్పటికే చాలరాత్రి కావచ్చినది. నీవీరాత్రి యిందే యుండుము.

అజీ జందుల కియ్యకొని ప్రసాదరావుగారియెడ తనకుఁ గల కృతజ్ఞతను వేయివిధముల వెల్లడించెను.

## పదునొకండవ ప్రకరణము

### అజీజు ద్విముఖ సంకటము

సూర్యుఁ డుదయించి యాకాశమున బారెడెత్తున వెలుఁగుచుండెను. అప్పుడు రజియాతో మాటాడుచు రెండవమేడలో నున్న యిస్మాల్ ఖాన్ దాపునకు దాసి యొకర్తు వచ్చి "మహారాజా! మిమ్ముఁ

జూచుట కెవరో వచ్చియున్నారఁట" అనెను. ఇస్మాలు లేచి "ఎవరో నీవు చూడలేదా?" అనెను.

దాసి: లేదు. నే నిచ్చటికి వచ్చుచుండ మనరహిమాను తమతో నీ సంగతిని మనవిచేయుమని నాతోఁ జెప్పెను.

ఇస్మా: మంచిది. నీవు పొమ్ము. నేనిప్పుడే వత్తును.

దాసి: అందు మనయజీజుద్దీనుకూడ కలఁడఁట.

ఇస్మాలు చిఱునవ్వు నవ్వి "ఉండనిమ్ము. వాఁడీసారి యెవరినో తోడి తెచ్చి యుండును. కానిమ్ము. వీరంద జేమిచేయఁగలరో చూతు" మని బిరబిర క్రిందికి దిగివచ్చెను.

వచ్చువేళ కతనిగదిలో వేణీప్రసాదరావు, న్యాయవాదియగు నందలాలు అజీజుద్దీను నాసీనులై యుండిరి. వెంటనే యిస్మాలు ప్రసాద రావును గాంచి కృతజ్ఞతా వందనము లర్పించి "అయ్యా! తమదయచే బ్రతికితిని. లేకున్న నాగతి యీాసరి కేమైయుండునో తెలియదు. తమ కెంతయుఁ గృతజ్ఞుఁడను." అని మఱియొక యాసనమునఁగూర్చుండెను.

వేణీ: ఇస్మాల్! నీవు హత్యాపరాధివి కావని నమ్మితిని ఇందు నీకెట్టిసంబంధమును లేదనుకొందును. అయినను ఈ వ్యాజ్యము తీరువఱకు మా నిబంధనల ననుసరించి నీయింటికడ పోలీసుసంరక్షణ నుంచక తప్పదు,

నంద: ఇన్స్పెక్టరుగారూ మాటలఁ జాలించి ప్రస్తుతాంశము నాలోచించుట మంచిది.

వేణీ: అవును. ఇస్మాల్ ఖాన్! అజీజు విషయమేమి? ఇతనిని నీయింటినుండి తరిమివైచితివఁట! ఎందులకు?

ఇస్మా: అవును. ఇది నాయిల్లు. నాకహితుఁ డగువీఁడు నా యండ నుండఁజనదు.

వేణీ : ఇది నీయొక్కనియి లెట్లాయెను ?

ఇస్మా : అవును. ఇది నాయొక్కనిదే.

వేణీ : ఎట్లు ?

ఇస్మా : మాయన్న యీ యజీజుయొక్క దుష్కృతనంబునకు రోసి తనయావదాస్తిని నాకప్పగించెను.

వేణీ : తగినయాధారములు కలవా ?

ఇస్మా : కలవు. వీఁడు దుర్మార్గుఁ డగుటచే వీనిపైఁ గోపించి మాయన్న నన్ను రప్పించి నాకు తనసర్వస్వమును వ్రాసియిచ్చెను.

నంద : ఏది, యాతని వ్రాఁతను చూడనిమ్ము !

ఇస్మా : మీ రెవరు ?

నంద : నేనొకవకీలును. నన్ను నందలాలందురు. నీ వజీజు నెడలఁ జేసిన ద్రోహమును విచారించుటకు నన్ను సర్కారువారు నియోగించిరి.

ఇస్మా : కావచ్చును. ఇది ద్రోహ మెట్లగును ? తాజుద్దీను తన స్వహస్తములతో వ్రాసియిచ్చిన పత్రమును జూపించినప్పుడుకూడ నిది ద్రోహమనియే యెంతురా ? ఇప్పుడు నేను కనికరించి యజీజుద్దీనున కింత జీవనాధారమును గలిగించినఁ గలదు. లేకున్న నన్ను బలవంత పఱుచు నధికార మెవ్వరికిఁ గలదు ?

వేణీ : ఆమాట లుండనీ. కాగితమును జూపింపుము.

ఇస్మాలుఖాను వెంటనే మేడమీఁదికిఁ బోయి యొకకట్ట కాగితములను చేతఁ బట్టుకొని దిగివచ్చి "ఇదిగో చూడుఁడ" ని యొక కాగితమును దీసి యందఱికినిఁ జూపించెను. అందిట్లుండెను.

"నా ప్రియసోదరుఁ డగుమహామ్మద్ యిస్మాలునకు-మీ యన్న యగు తాజుద్దీనను నేను నాసమ్మతితో వ్రాసియిచ్చిన దేమనఁగా -నాయేక

పుత్రుఁడగు నజీజుద్దీ నింతకాలము విధేయుఁడై యుండియు నిప్పుడ దేలకో ప్రబలదుష్టుఁడై పోయినాఁడు. వాఁడు వేశ్యాలంపటుఁడును. మద్యపానాసక్తుఁడును, జూదరియునైనట్లు తెలియవచ్చుచున్నది. నన్ను వాఁడిపుడు ప్రేమించుటలేదు. పదిదినములక్రిందట నాతోఁ దీవ్రముగ గలహించి రాజకోటకుఁ బాఱిపోయెను. ఇఁక వాఁడు మఱలివచ్చునను నాస నాకు లేదు. ఈనాలుగైదేండ్లనుఁడి వాఁడు నన్ను మిగుల నల యించెను. కావున వానిపైనిపుడు నాకుఁ బుత్రప్రేమ లేదు. వాఁడు నాతనయుఁడు కాఁడు—నేను వానికిఁ దండ్రిని కాను. నేఁటినుండి నా సర్వస్వమునకు నీవే యధికారివి. నాయావదాస్తిని నీయధీనముఁగావించు చున్నాను. నీవే దీని కుత్తరాధికారివి. అజీజు సన్మార్గమునకు వచ్చి నప్పుడు నీకిష్టమగుచో నింతభాగ మిచ్చి పంపుదువుగాక.

| | |
|---|---|
| సాక్షులు | ఇట్లు, |
| 1 రహిమాన్ ఖాన్ | తాజుద్దీన్ ఖాఁ. |
| 2 రోషిణావారా | అహమదునగరు. |

తక్కినవా రద్దానిని విశ్వసించిరో లేదో కాని వెంటనే యజీ జుద్దీఁ మాత్రి మాత్రోశించుచు లేచి యది కేవలకృత్రిమపత్రమనియు తనతండ్రి యెన్నఁటికిని దానికి సమ్మతించి యుండఁడనియు, నందలి వ్రాఁత యతనిమున్నట్టున్నదే కాని యతనిదిమాత్రము కాదనియు, సాక్షియగురోషిణావారా సృష్టిపత్రరచనానైపుణ్యముఁ గలవాఁడనియు క్రిందిసంతకి మనుమానాస్పద మైనదనియు, తనతండ్రికిని దనకు నెన్నఁ టికిని మనస్తాపములు లేవనియు, తనమేనత్త రోగబాధితయగుటచే నేను రాజకోటకువెళ్లితినే కాని యందుసూచించినట్లు నిజదనకునితో కలహము కారణముకాదనియు, నేను రాజకోటలోనున్నప్పుడు నాతం డ్రికడనుండి యెన్నియో యనురాగ లేఖలు వచ్చినవనియు వాదించెను.

నంద : ఇందున్న సాక్షు లెవరు?

ఇస్మా : ఒకఁడు మాయింటిగుమాస్తా, రెండవవాఁడు మాపొరు గింటి పెద్దమనుష్యుఁడు.

నంద : వారిని రప్పింపుము.

ఇస్మా : వారేల? ఈ పత్రము చాలదా?

నంద : చాలదు.

ఇస్మా లొక సేవకునిఁబంపి రహిమాన్‌ఖానును బిలుచుకొని రమ్మనెను. రోషిన్‌వారా యాయింటనే యుండుటచే వాని నప్పుడే రప్పించిరి. అతనిఁ గాంచి న్యాయవాది యిట్లనెను.

నంద : అయ్యా! నీపేరు రోషిన్‌వారా యేనా?

రోషిన్ : చిత్తము.

నంద : నీవీయింట నెంతకాలమునుండి పనిచేయుచున్నావు?

రోషిన్ : సుమా రజీజుజననకాలమాదిగ.

నంద : అజీజుద్దీ నెట్టివాఁడో, యితనివిషయమై తాజుద్దీ నెట్లు ప్రవర్తించుచుండెనో నీకుఁ దెలియునా?

రోషిన్ : తెలియును. అజీజుద్దీన్‌గారు పుట్టినది మొదలు పంచ దశవర్షప్రాయము దాఁక జననీజనకుల కేమివిధేయుఁడై యుండెనో కాని తర్వాత దుష్ప్రవర్తనాదులచే వారిని మిగుల బాధించెను. తుదకు నెలక్రిందట తండ్రి వినరానిమాటలాడి, యతనితోఁ దగవులాడి రాజ కోటకు పాఱిపోయెను. ఆకారణమునుబట్టి తాజుద్దీన్‌ఖాన్‌గారు పుత్రు నిపైఁగల యనురాగపాశముల విచ్ఛేదితముఁ గావించుకొని కడ కితఁడు రాజకోటకు వెళ్లినకాలమున తనయాావదాస్తిని యిస్మాల్‌ఖాన్‌గారి పేరిట వ్రాసియిచ్చెను.

నంద : ఇది యాపత్రమేనా?

రోషిన్ : (చూచి) చిత్తము. ఇందు నాసాక్ష్యముకూడ కలదు కదా.

నంద : అందుకే నిన్ను విచారించినది.

ఇంతలో రహిమాన్ ఖానను మహమ్మదీయుఁడటకు వచ్చి యందఱికి సలాముచేసెను. నందలాలు రోషిన్‌వారాను ప్రశ్నించినట్లే ప్రశ్నించెను. కాని యీయిరువురి సాక్షిత్వమున నెట్టిభేదమును గానిపింప లేదు. అజీజు మరలలేచి "మహాశయులారా! ఇది కేవలమాయా నాటకమని నమ్ముఁడు. రహిమాను మాకు పూర్వకాలమునుండి విరోధి. ఈ విషయము నీ యిరుగుపొరుగువాండ్రను విచారించిన దెల్లము కాఁగలదు. రోషిన్‌వారా యింటిపరిచారకుఁడుకాన యజమానుఁడు చెప్పినట్లు విని యుండును. మొత్తముమీఁదనిది నాతండ్రి వ్రాఁతకాదు. ఇందలి సంగతులు కృత్రిమములు." అని తన సంశయపరంపరను వారి యెదుట నుపన్యసించెను.

వేణీ : నీవు రాజకోటలో నున్నపుడు తాజుద్దీన్ నీకనురాగ లేఖలు వ్రాసియుండెనా?

అజీ : చిత్తము, ఒకటికాదు—రెండుకాదు—పదికలవు.

వేణీ : అవి యెందున్నవి?

అజీ : నాపెట్టెలో నున్నవి. వలయునేని తీసి చూపెదను.

నంద : అవి యిప్పుడవసరము.

ఇస్మా ! ఏపెట్టెయందున్నవి?

అజీ : ఎంకుంచియుంటినో నాకుఁ దెలియదు. స్వయముగ నేనే వెదకవలసియున్నది.

అతనిని మరల నింటిలోనికిఁ బోనిచ్చుట కిస్మాలు సంశయించెను. కాని ప్రసాదరావొకవైపు, నందలాలొకప్రక్కను జేరి యీపని

యాచరణీయ మని పట్టుపట్టుటంజేసి యజీజుమాట చెల్లవలసివచ్చెను- ఇస్మాయిల్ ఖాను లోబడక తప్పదయ్యెను. అంత నతఁడు "గులామ్! ఇటు రమ్ము" అని పిలిచెను. గులా మెవ్వఁడో వెలికి రాలేదు కాని లోపలినుండి "స్వామీ! గులామింటలేఁడ" ప్రత్యుత్తరము వినఁబడెను. అపు డతఁడు "సరి" యని తానే స్వయముగ లోపలికి లేచి పోయెను. అచ్చట నతని కొకసేవకుఁ డెదురయ్యెను. వానిఁ గాంచినంతనే యిస్మాలు "ఏమిరా, పద్మాష్! ఇంట నుండియు "గులా మింట లేఁడ"ని చెప్పితివా? ఇందేమిచేయుచున్నావు?" అని గద్దించెను. వాఁడే గులామను సేవకుఁడు కాఁబోలు. ఇస్మాలు తన్నేదో యనవసర కార్యముపైఁ బిలిచియుండుననియు, పైరీతిగ బొంకిన నతఁడు మరల తన్నుఁ బిలువఁడనియు వాఁడెంచి యట్లు టక్కులాడెను కాని యంత యమాంతముగ నిస్మాలు లోని కేతెంచునని తలంపఁడయ్యెను. పాపము! అందుచే వాఁడు గజగజవడఁకుచు నేవో తబ్బిబ్బుమాట లాడసాగెను. కాని కోపాగ్ని తలకెక్కుటచే మహామ్మదు మూలనక్కకొనియున్న యాభటునిపై నశనిపాతసదృశ ముగుపదాఘాతమును వైచెను. అప్పు డాదెబ్బల కాగలేక వాఁడు హాహాకారములఁ జేయుచు వేణీప్రసాదాదులు కూర్చున్న విశాలమందిరముగుండ వెలుపలికిఁ బారిపోయెను. అందెవ్వరికిని వానిముఖము గోచరింపలేదు. అది యుత్తరావకుంఠితమై యుండుటయే యందులకుఁ గారణము. అంద ఱావింతనుగాంచి వింత పడిరి. అజీజుద్దీనుకాని తదితరసేవకాళికాని వానిని పట్టి నిలుపలేదు.

అంతలో నిస్మాలు వెలుపలికి వచ్చి యజీజును గాంచి "రమ్ము నీపెట్టె యెందున్నదో చూచుకొందువుగాక" యని పిలిచెను. అజీజు లేచెను. అప్పుడు నందలాలుకూడ లేచి "మేముకూడ మిమ్మనుసరించి రావలసి యున్నది" యనెను. ఇస్మాలు సంశయముతో నతని దిలకించి

"ఏల ? వీనిని లోపలికిఁ గొంపోయి పమయింతువనియా మీయూహ ?" యని యసహ్యముగ మాటాడెను.

నంద : అట్లు కాదు, మామనసున లేనిదేల సంశయింతువు ? మేము లోపలికి రాఁగూడదా ?

ఇస్మాలనుమానించుచు నూరకుండెను.

వేణి : అజీజుద్దీ వస్తుసామగ్రి యంతయు నెందున్నది ? అచ్చటికి పోవలసినప్పుడు జనానాలోనుండి పోవలసియుండు నేమో. అందుకే యిస్మాలు సంశయించుచున్నాఁడు.

అజీ : అట్టిదియు లేదు. అభ్యంతరములేదు. రండు.

ఇఁక వారు మహమ్మదు సమ్మతికై నిరీక్షింపలేదు. వెంటనే యజీజుతో లోపలికేగిరి. ఇస్మాలుకూడ వారి ననుసరించెను. అజీజుద్దీ నందతితోను సమీపమునందేయున్న తనగదిని జూసి దానితలుపులు మూయఁబడియుండుటను గాంచి యిస్మాలుతో "నాగదికి రాత్రి బీగము వైచితిని. ఇప్పు డది లేదు. దాని నెవరు తీసిరి ?" అనియెను.

ఇస్మా : ఎవరో నాకేమి తెలియును ? నీగదికి తాళమువైచితివో లేదో యెవ్వాఁడెఱుఁగు ?

నంద : అజీజ్ ! ఇందునీయనుమానమేమి ?

అజీ : బీగమునెవరో తీసి లోపల ప్రవేశించిరని తోఁచుచున్నది.

నంద : సరి. లోపలికిఁ బొమ్ము. సామానేమైన దొంగిలింపఁబడెనేమో చూతుము.

అందఱును లోనఁ బ్రవేశించిరి. అందజీజు తనపెట్టె లేనందున "ఇందు నాగపూర్ యనుపసందూకము కాన్పింపకున్నది. ఏమైయుండును" అనెను.

నంద : అం దేమేమి యుంచియుంటివి ?

అజీ : నా కాగితముల నన్నింటిని భద్రపఱచియుంటిని. ఈతక్కిన రెంటిలో నొకటి నాదుస్తులపెట్టె. రెండవది గ్రంధముల పేటిక. నా కాగితములపెట్టె నెవరో యపహరించినారు.

నంద : నీవు రాత్రి యీగదికి బీగము వైచునపు డది యిం దే యుండెనా ?

అజీ : ఉండెను. అందున్న కాగితములను చదువుకొని తర్వాత నీగదికి తాళమువైచి యిస్మాలుతో వాదింపఁ బూనుకొంటిని.

నంద : ఇంట నింత భద్రముగ నుంచినపెట్టె నెవ్వరు తస్కరింతురు ? ఇస్మాలున కీసంగతి తెలియుదా ?

ఇస్మా : లేదు. నా కేమియుఁ దెలియదు. ఆపెట్టెను నేఁజూడ లేదు.

నంద : ఇందు పరిచారకులకు స్వేచ్ఛావిహారము కలదా ?

అజీ : నేనీయింట నున్నంతకాల మట్టిది జరుగుట లేదు. కడచిన రాత్రి యేమిజరిగినదో నాకుఁ దెలియదు.

ఇస్మా : అయ్యా ! ఇది పట్టిమోసము. వీనికి నాగపూరుసందుక మే లేదు. ఏదోపెట్టె పోయినదని నాపై నిందారోపణఁ జేయఁజూచుచున్నాఁడు, వీనిని కేవల బాలుఁడని తలంచినారా? మహాయుక్తిపరుఁడు.

అజీ : తన్నిఁక మీరు శంకింతురనుభీతిచే ముం దే యిట్టికల్లలాడుచున్నాఁడు. ఇవి సత్యవచనములుకావు.

వేణీప్రసాదు యోచన మఱియొకటి. అతఁడిట్లనెను. " యిస్మాల్ ! నీ విం త్రకుముందు " గులామ్ " అని యొకనినిఁ బిలిచితివే. వాఁడు నీ సేవకుఁ డేనా ? "

ఇస్మా : అవును.

వేణీ : నీపరిచారకుఁడయ్యు వాఁడేల నీవుపిలిచిన రాఁడయ్యెను. అట్లేల పాఱిపోయెను !

ఇస్మా : ఆసంగతి నాకుఁగూడ నద్భుతావహమై చూపట్టు చున్నది. వాఁడు నాయాజ్ఞను మీరువాఁడు కాఁడు. అట్టివాఁడు నేఁడేల యవిధేయుఁడై వర్తించెనో తెలియదు.

వేణీ : వాఁడు మరల నింటికివచ్చునా ?

ఇస్మా : ఏమో, ఎట్లు చెప్పనగును ? కోపగించుకొని యెందైన బాఱిపోవునో యేమో !

వేణీ : మీయింటి సేవకులలో నొకరిద్దఱిని బంపి వాఁడెందు న్నను బట్టి తెమ్మనుము ?

ఇస్మా : వానితో నిప్పుడు మీకేమి పని ?

వేణీ : కలదు. వానింజూచిన తర్వాత మీకంతయుఁ దెలిపెదను.

ఇస్మా : కానిండు. అట్లే చేతును.

వేణీ : ఇప్పుడే యన్వేషకులఁ బంపుము.

ఇస్మాలు వెంటనే యిరువురు సేవకుల రప్పించి గులామెందు న్నను బట్టితెండని చెప్పి పంపెను.

నంద : ఇన్‌స్పెక్టర్‌గారు రిప్వ డాపరిచారకునితో నేమిచేయ దలంచియున్నారు ! వచ్చినపని ముగియలేదుకదా.

వేణీ : ముగియగలదు. అజీజుద్దీను స్వత్వమునుగూర్చి పాటుపడు పని మీది. తాజుద్దీన్ హత్యాపరాధ రహస్యమును భేదించుభారము నాది. తత్కార్యోచితముగ సమయానుకూలమునుబట్టి వర్తించవలసి యుండును కదా.

నంద : ఆమాట నిజము. మీయగాధహృదయ మెవ్వరికిఁ దెలియఁగలదు. (ఇస్మాలుతో) అయ్యా ! ఇప్ప డీయపహృతపేటికను గూర్చి నీవింకేమైనఁ జెప్పనెంచితివా ?

ఇస్మా : దానిని నేను చూచియుండలేదు. అట్టిదొకటి యజీజు వద్ద నుండెనను సంగతికూడ నాకుఁ దెలియదు.

నంద : ఇవి విశ్వాసార్హవచనములు కావు. ఇంటికాపుండవై యున్ననీ కీయింటజరుగుపనులు తెలియకుండునా ? ఇతనిగది బీగమును దీసినవారెవరో నీవెఱుఁగకుందువా ?

ఇస్మా : వీఁడు గదికి బీగమును వైచియుండలేదు. ఏదో చదువు కొనుచుండి యంతలో నాతోఁ దగవులాటకు రాఁగా నప్పుడే నేను వానిని పడపట్టి గెంటివైచితిని. అట్టిచో వీనికి బీగమువైచుట కెట్టి యవకాశము కలదు ? ముందు వెనుక లరయక బాలునివచనముల నాధారపఱచుకొని నన్ననుమానించుచున్నారు. ఇట్లు చేసియేగదా ప్రసాదరావుగారు నాకుత్తుక కురిపెట్ట యత్నించిరి.

అజీ : మహాశయా ! నేను తాళమువైచుట పరుగెత్తిపోయిన గులామునకుఁ గూడ తెలియును. వాఁడే నాగదికి బీగమువైచి చెవిని నాచేతికిచ్చినది.

నంద : అప్పుడు నీవెదుట నుంటివా ?

అజీ : ఉంటిని. వాఁడు లోపలికిఁ బోలేదు.

ఇప్పుడెందు నమ్మఁదగినదేది ? ఇస్మాలుమాటలా ? నజీజుద్దీను మాటలా ? నందలాల్ వేణీప్రసాదులు చాలతడవాలోచించిరి. ఇస్మాలు మాటలు వారికి రుచింపకుండెను. అతని వాఙ్మూలమంతయుఁ సత్యాచ్ఛాదనంబని యెంచిరి. అయినను అప్పటి కాసంగతి నంతటితోఁ జాలించి పరోక్షమునఁ దగినయనుసంధానమును నడపనిశ్చయించుకొనిరి. ఇంతలో గులామునరయుచుఁ బోయినవారు తిరిగివచ్చి వాఁడెందును గాన్పింపలేదని చెప్పిరి. నందలాల్ వేణీప్రసాదులు చేయునదిలేక యజీజుద్దీనుతోఁ నాస్థలమును బాసిపోయిరి.

మార్గమధ్యమున వేణీప్రసాదు నందలాలునుగాంచి " అయ్యా ! ఇప్పు డీఁక నజీజుద్దీనువిషయ మేమాలోచించెదరు " అనియెను.

నంద : నిక్కముగ తాజుద్దీను బుద్ధిపూర్వకముగ నిస్తాలునకట్టి పత్రమును వ్రాసియిచ్చియుండునని నమ్మను. ఎంతతనకుఁ దనయుడు కానివాఁడైనను తండ్రి వాని కింతద్రోహమెంచునా!

అజీ : ఆర్యా! నాకును మాతండ్రికిని వైరముండెనని మీరు విశ్వసించుచున్నారా ?

నంద : లేదు. నేను నమ్మను. ఇంతయు మీపినతండ్రి మాయోపాయముతక్క నన్యముకాదు. నీకు మీతండ్రివ్రాఁత చక్కఁగఁ దెలియునుకదా ?

అజీ : తెలియును. అది పరహస్తలిఖితము. ఇంచుక యత్నించి కావలయునన్న యస్మత్పితృహస్తలిఖిత పత్రములను మీకుఁ జూపింపఁ గలను. అప్పుడా రెంటినిఁ బోల్చుకొనిచూడుఁడు.

వేణీ : అది నిజము కావచ్చును. కాని యామోసమును వెలిబెట్టుటెట్లు ?

నంద : దానికి మున్ముందు తగినవెఱవును బరికింపవలెను. ఆ కార్యభారము నాపై నుండనిండు. అది యంతకష్టప్రదము కాదని తలంతును.

వేణీ : మీయద్వితీయమేధాశక్తికి కష్టమెందున్నది! ఈసంగతి తేలువఱకు నీ యజీజుద్దీనునకు మాయింట నాశ్రయ మొసఁగ నెంచుచున్నాను.

నంద : సంతోషము. త్వరలోనే రహస్యప్రకటన గావింప యత్నింతును.

ఇంతలో వారొకశృంగాటకమును డాసిరి. వేణీప్రసాదు నందలాలుకడ సెలవు గైకొని యజీజుతోఁ దనయింటికి దారితీసెను. దారి-

పోవుగునను అజీజు వారియుదారాశయముల నెంతయో నుతించి తన దురవస్థను దలంచి చింతిల్లసాగెను. వేణీప్రసాదతనిని గాంచి "భాయీ! చింత చేయఁగలఫలమేమి? పురుషహృదయమును వహింపుము. విచారింపకుము. అనతికాలముననే నీకు పరమేశ్వరుఁడు సహాయభూతుఁడు కాఁగలఁడు" అని పలుభంగుల నూఱడించి తనయింటికిఁ గొనిపోయి తండ్రియగు గిరిధరునకు యావద్వృత్తాంతమును వినిపించి యజీజును పరమమిత్రవాత్సల్యమున మన్నించెను. ఆహా! ఇట్టిదేకదా యుదారచిత్తులయతులితాద్భుత మహాత్మ్యము!!

# పంద్రెండవ ప్రకరణము

## విశేషవార్త

రహస్యభేదనోపాయము సులువుగ కాన్పించుచున్నదే కాని దానిని భేదించుటమాత్రము కష్టప్రదముగ నున్నది. "గులామ్" అను పేరును మహోద్యానమందిరమున నారాత్రి వేణీప్రసాదు వినెను. ఆ పేరుకలవాఁ డెవఁడో యిస్మాయిలు గృహమునఁ గాన్పించెను. అదృష్టత్రయములో నొక్కనికి రాజద్రోహమందిరమున నభ్యంతరసంచార ముండవలయు నని యతఁ డింతకుఁబూర్వ మనుమానించి యుండెను కదా! ఇప్పు డాగులాము వాఁడే కావచ్చునని యొకొకమారు విచారించుకొనెను. కాని వాఁడిఁక పట్టువడుటెట్లు? వానిని వెదకుట సులభమా. ప్రసాదరావు నానాభంగుల నాలోచించుకొనెను. ఈసందర్భమున 1213 నెంబరు మందిరచారిత నెఱుంగుట కొంతవఱకుఁ

డనకు సహకారిగ నుండునని తలంచెను. కాని యదిమాత్ర మంత సులభసాధ్యమా. చాలసే పాలోచించి తుదకతఁ డజీజువలన నేమైనఁ దెలియునేమో యని యెంచి యూసాయంకాల మజీజును జుమ్మామ సీదునకుఁ దోడ్కొని పోయి **1213** నం. మందిరమునుజూపి అజీజ్ ! ఇది యెవరిసౌధము ? " అని ప్రశ్నించెను.

అజీ : ఏల ? దీనితోఁ దమ కేమిపని ?

వేణీ : పనిపడి కాదు. రమణీయమై యుండుటచే నడిగితిని.

అజీ : ఇది యొకవారాంగనామందిరము.

వేణీ : (ఆశ్చర్యపడి)—హిందువా ? మహమ్మదీయురాలా ?

అజీ : మహమ్మదీయసుందరి. నేనెఱుఁగుదును.

వేణీ : ఎట్లు ? నీవు వేశ్యలయిండ్ల కేగువాఁడవేనా ?

అజీ : (నవ్వి)—అట్లుకాదు. ఈమెతో స్నేహముచే పరిచయ మబ్బలేదు. మాతండ్రిగారివలన పరిచయమైనది.

వేణీ : తాజుద్దీన్ ఖానునకు నీమెకు నేదైనసంబంధముండెనా ?

అజీ : ఉండెను. అతని కీమె యుంపుడుకత్తె.

వేణీ : ఈ విటురాలిపే రేమి ?

అజీ : ముంటాజ్ జులియాబీబీ.

వేణీప్రసాదున కిప్పు డిట నొకయాలోచన కలిగెను. **1213** నం. మందిరమొకబోగముకొంప ? మొన్నరాత్రి యందుప్రవేశించిన తురుష్కుఁడు విటుఁడు కావచ్చును. వాఁడెవఁడో, పేరెద్దియో, యెం దుండునో యెట్లు తెలియఁగలదు ? అప్పుడతఁడు మఱలనిట్లనెను. " నే నిప్పుడీవేశ్యసంగతి తెలిసికొనవలయును. అడిగినదానికిసదుత్తరమునిమ్ము"

అజీ : కానిండు. మీ విషయమై నాకెట్టి సంశయమును లేదు. నా హృదయమును జీల్చి మీముందు పెట్టఁగలను.

వేణీ : మీతండ్రి దీనిని చేపట్టి యెంతకాలమైనది ?

అజీ : బహుకాలమునుండి నేనీసంగతి వినుచుంటిని.

వేణీ : ఇది మఱియెవ్వరిని గన్పెట్టిచూచుట లేదా ?

అజీ : (నవ్వి)—ఆసంగతి నాకెట్లు తెలియును ? ఈమె మా తండ్రి కుంపుడుకత్తెయని మాత్రము వింటిని. తదితరములు నాకుఁ దెలియవు. తెలిసికొనుటకు యత్నింపలేదు.

వేణీ : పోనిమ్ము. మీతండ్రికి మిత్రులు కాని, ప్రబలశత్రువులు కాని కలరా ?

అజీ : అతఁ డుదారహృదయుఁ డగుటచే నతనికి శత్రువులే లేరనుకొందును. మిత్రు లుండిన నుండవచ్చును.

వేణీ : మీయింటికి తఱచుగావచ్చి పోవుచుండువా రెవరైనఁ గలరా ?

అజీ : ఎందఱో కలరు. వారి నందఱిని సంశయింపఁదగునా ?

వేణీ : అబ్బా ! నాకేమియుఁ దోఁచకున్నది. తెలివి తటిల్లతవలె నంతలో నదృశ్యమగుచున్నది. ఎంత యాలోచించినను నాకీరహస్యారణ్యము దుర్భేద్యమై తోఁచుచున్నది.

అజీ : కానిండు. మీశక్తి కద్దెందును లేదు. మీప్రయత్నములు ఫలింపక పోవు. మీరిప్పు డెంతవఱకుఁ గృతకృత్యులైతిరి ?

వేణీ : ఎంతవఱ కననేల, నేను మొన్నరాత్రి గాంచినవ్యక్తులను బట్టఁగల్గినఁ గృతార్థుఁడనే.

అజీ : వా రెవరో మీకుఁ దెలియునా ?

వేణీ : తెలియకేకదా యింత కొట్టుకొనుచున్నాను. ఆరాత్రి యాదుష్టులట్లు సంభాషించుకొని వెలుపలికి వచ్చిరి. నేను జాగరూకతతో వెన్నంటివచ్చి వారిలో నొకరిద్దఱి నానవాలిడితిని. అందులో

నిద్ర అప్పు డుత్సవసమూహముతోఁ జేరిపోయిరి. మూఁడవవాఁడా నిశీథముననే యీ జులియాబీబీయింటికి వచ్చెను. నేను నూతనుఁడను కాన సాహసించి లోపలి కేఁగజాలకపోయితిని. రాత్రి యొంటిగంట వఱకు వెలుపల కాచుకొని యుంటిని. కాని వాఁడు రాలేదు.

అజీ: (ఆలోచించి)—మీరు చెప్పినది చూఁడగా వాఁడెవ్వఁడో జులియాబీబీకి తెలిసినవాఁ డని తోఁచుచున్నది.

వేణీ: నాకును నదియే సంశయము. ఆమె నీ సంగతినిగూర్చి విచారింపవచ్చునా!

అజీ: అది బాగుకాదు. ఇంతకు వానిపేరైనఁ దమకుఁ దెలియదే. ఆమె నడుగుటకన్న మఱియెవ్వరినైన విచారించుటబాగు.

వేణీ: ఎవరిని విచారింతము? నీవేయాలోచింపుము.

అజీజుద్దీను కొంతవఱ కాలోచించి “నాకిం దహస్మాక్ ఫీరూ యను సేవకుఁడు పరిచయుఁడు. వానివలన నేమైన రహస్యము వెల్లడియగు నేమో యత్నింపవలెను.” అనెను.

వేణీ: వాఁడిప్పు డెందుండును?

అజీ: రాత్రియే కానిపగలు వాఁడిటనుండఁడు.

వేణీ: అట్లయిన రాత్రివచ్చి వానిని గలిసికొనుట మంచిది.

అజీ: మిమ్ముఁ జూచిన వాఁడు భయపడునేమో!

వేణీ: అయిన నేను రాకూడదందువా!

అజీ: మీరెప్పు డింటికి మఱలుఁడు. వానిని మీకడకుఁ బిలుచుకొని వత్తును. అప్పుడు మనకుఁ గావలసిన సంగతుల నడుగవచ్చును.

వేణీ: మంచిది. నేను పఠనాలయమున వేచియుందును.

అజీ: కానిండు. మీరు పోవచ్చును.

వేణీప్రసాదు వెళ్ళిపోయెను. అజీజుద్దీను చాలసేపటివఱకు కాసౌధమునకుఁ గొంతదూరమున నున్నకట్టపైఁ గూర్చుండి చూచుచుండెను. ఇంతలో నాయింటినుండి యెవఁడో సేవకుఁడు వెలుపలికి వచ్చెను అజీజు వానిని నిదానించి చూచి సమీపించి "ఉస్మాన్! జ్ఞాపకమున్నదా!" అనెను. ఉస్మా నానవాలుపట్టి "స్వామీ! తామా. ఎందుకింతదూరము విచ్చేసితిరి! మీరాక చిత్రముగ నున్నదే." అనెను.

అజీ: గట్టిగ మాటాడకుము. రమ్ము. మాయింటికిఁ బోదము.

ఉస్మాన్: నానుండి యేమైన తీవ్రకార్యము కలదా!

అజీ: అవును. నీకొఱకే యీ సమయమున వచ్చితిని.

ఉస్మా: నేనిపు డిల్లువదలి వచ్చిన యజమానురాలు కోపించును. ఇంట మఱియొక సేవకుఁడు లేఁడు. అందఱు కార్యాంతరనిమగ్నులై యున్నారు.

అజీ: (యోచించి) ఇప్పుడు మాయింటికి వచ్చుట కవకాశము లేదా!

ఉస్మా: దయచేసి క్షమింపుఁడు. రేపు తప్పక వత్తును.

అజీ: ఉస్మాన్! నాపై విశ్వాసమున్న నావెంట నిప్పుడు రాక తప్పదుసుమా.

వాఁడు కొంతతడ వాలోచించుకొనెను. అజీజుమాట నతిక్రమింపనేరఁడయ్యెను. ఆతనియాతురతను గాంచి చిట్టచివరకు వాఁడు "కానిండు. నడువుఁడు." అనెను. వెంటనే యజీజుద్దీను వానిని మంచిమాటలతో నుబ్బించి ప్రక్కవీథిలోని పతనాలయమువద్దకుఁ గొనితెచ్చెను.

అజీజుద్దీనుకొఱకు నిరీక్షించుచున్న వేణీప్రసా దతనిరాకను, వెంటనున్న యుస్మాన్‌ఫకీరూను జూచి "వీఁడేనా నీకిష్టుఁడైనయుస్మాను." అని యడిగెను.

అజీ : అవును. రెండు. మనయింటి కేగుదము.

ఉస్మాను విస్మితుఁడై యజీజుతో “ బాబుగారూ ! వీరెవరు ? ” అనెను.

అజీ : ఇతఁడు పోలీసుయిన్స్పెక్టరు. వేణీప్రసాదరావుగారు.

ఉస్మానున కేమియు నర్థము కాకుండెను. ఇంటికడ జులియాబీబీ యెంతకోపపడునో యని భయపడుచుండియు నతఁ డజీజుపై విశ్వాసముచే వారితోఁ గలసి వేణీప్రసాదు మందిరమున కేగెను.

ఇల్లు జేరినంతనే వానిని రహస్యముగ నొక మేడమీఁదికిఁ గొంపోయి యట నందఱుఁ గూర్చుండిరి. తర్వాత వారిక్రింది విధముగ సంభాషణ యారంభ మయ్యెను.

అ : మహాశయా ! ఇతనిపే రుస్మాన్ ఫీరూ. ఇతనిమూలముననే నాకు మాతండ్రి జులియాబీబీల సంబంధము తెలియవచ్చినది. అయినను నాతండ్రిని నేను నిషేధింపలేను. వీఁడప్పుడు మాయింటికి వచ్చిపోవుచుండెను. మిగుల మంచివాఁడు. కావలసిన సంగతులు మీారమగ వచ్చును. ఫీరూ ! నీకు నిజముగ నేను తలంచినట్లు నాపై పూర్ణప్రీతి కలదా ?

ఉ : లేకేమి, మహాప్రభూ ! మీా తండ్రిగారి దయవలన నా యాలుబిడ్డలఁ బోషించుశక్తి కలిగినది. వారి నెన్నఁటికిని మఱవను. ఇఁక వారిని వేరె మిమ్ము వేరె తలంతునా ?

వే : ఉస్మాన్ ! నిన్నిపుడు కొన్నిప్రశ్న లడుగవలయునని రప్పించితిని. అవి తాజుద్దీన్ ఖానుగారి హత్యాపరాధమునకు సంబంధించినవి.

ఉ : ఆ మహానీయుఁ డట్టి మరణమునకుఁ బాల్పడుటకు మిగుల చింతిల్లుచున్నాను. కాని హత్యనుగూర్చి నాకేమి తెలియును, మహాప్రభూ ?

వే : తాజుద్దీన్ ఖానునకును మీయింటూజ్ బీబీకిని స్నేహమునం గూడి యెంతకాలమైయుండునో ?

ఉ : నాలుగైదు సంవత్సరములైయుండవచ్చును.

వే : మీబీబీ యొకనికి లోంబడినదా ? పలువురకు లోంబడినదా!

ఉస్మా : స్వామీ ! ఆసంగతి నాకంతబాగుగాం దెలియదు. జులియూబీబీమాత్ర మందఱివలె నికృష్టజాతికిం జేరినది కాదు. సద్గుణవతి. పలువురిని గన్నెత్తి చూచునది కాదనియే చెప్పంగలను.

వే : తాజుద్దీన్ఖానువచ్చి పోవుదినములలో నామెయింటికొరు లేరైన వచ్చిపోవుచుండిరా ?

ఉస్మా : అబ్దుల్‌రజాకుసాహేబుగారు వచ్చిపోవుచుండిరి. ఇప్ప టికిని వచ్చుచునే యున్నాఁడు. బీబీ యతనికెట్టి యభ్యంతరమును జెప్పకపోవుటయే కాక మీఁదుగ నెంతో యహ్లాద మొందుచుండును.

వే : అతఁడెవఁడు ? అజీజ్ ! నీకుఁ దెలియునా ?

అజీ : తెలియుటకేమి ? అతఁడు నాకుఁ జిరపరిచితుఁడగుటయేగాక నన్నల్లునిగా స్వీకరింపఁ దలంచుచున్నాఁడు. రెండుమూడు దినముల క్రిందటనే యతఁడు తనకూఁతురును బరిణయమాడవలయు నని నన్ను బలవంత పఱచెను.

వే : ఉస్మాన్ ! నీవు నాకొక్కసంగతినింగూడ దాచకుము, అట్లు చేసిన నీస్వామికి ద్రోహ మొనర్చినవాఁడ వౌదువు. తాజుద్దీన్ రజాకుసాహేబు లన్యోన్యస్నేహభావములతో వర్తించుచుండుట నెన్నఁడైనఁ జూచియుంటివా ?

ఉస్మాన్ : వారికి జులియూవిషయమై పరస్పర వైషమ్యముండెనని యాయింటివారివలన వినియుంటిని.

వే : తాజుద్దీన్ రజాకు లెన్నఁడైన తగవులాడిరా ?

ఉస్మా : పదిదినములక్రిందట మాయజమానురాలి యింటనే వారిరువురి కొకపెద్దజగడము జరిగినది.

వేణీ : నీ వప్పుడు సమక్షమున నుంటివా ?

ఉస్మా : ఉంటిని.

వేణీ : ఆ కారణ మెఱింగినచోఁ జెప్పెదవా ?

ఉస్మా : తాజుద్దీన్ఖానే మొదట బీబీతో నేస్తమునగూర్చు కొనెను. అతఁ డామెకై యెంతో ధనమును వెచ్చించి యామెయను రాగమునుఁ బొందఁగలిగెను. తర్వాత నొకసంవత్సరముక్రిందట నాకస్మికముగ నామె రజాకుసాహేబునుగూడ ప్రేమింపసాగెను. నాఁటినుండి యబ్దుల్ రజాకు, తాజుద్దీను బీబీకడ లేనప్పు డామెకడకువచ్చి పోవుచుండెను. ఒకనాఁ డాకస్మికముగ నతఁడు బీబీతో నుండఁగా తాజుద్దీన్ ఖానుకూడ వచ్చి బీబీమోసమును గ్రహించి రజాకును పలువిధముల నిందించి బెదరించి జులియానుకూడ దండించెను. అప్పటికే రజాకు వెడలిపోయెను. బీబీ యనేకరీతుల క్షమింపఁ బ్రార్థించుటచే ఖాన్ సాహేబామెయెడ ప్రసన్నుఁడయ్యెను. రజాకుమాత్ర మాతనికిఁ దెలియకుండ దినమునకు మూఁడుసార్లైన వచ్చిపోవుటను మానలేదు. పదిదినములకుముం దొకరాత్రియాయిరువు రాకస్మికముగ కడసారి జులియాశయనాగారమునఁ గలసికొనిరి. అప్పుడిరువురు మహాక్రోధమూర్తులై పరస్పరనిందనలఁ గావించుకొని, ముష్టియుద్ధమునకు దిగిరి, ఆ సందర్భమున రజాకు వృద్ధుఁడును, బలహీనుఁడునగు తాజుద్దీను నొక దెబ్బతో గోడను నూకివైచెను. ఇంతలో మేమందఱ మచటికిఁ బోయి వారి పోరాటమును మాన్పితిమి. అప్పుడే తాజుద్దీన్ స్వగృహమునకుఁ బోయెను. తర్వాత రెండుదినములకే యతనిమరణవార్త కర్ణశూలమువలె మాచెవి సోకెను.

ఉస్మాన్ ఫీరు చెప్పినవార్త వేణీప్రసాదుని నిరుత్తరుని గావించెను. ఇన్స్పెక్టరు బహువిధాలోచనాసమితిలోఁ బడినట్లు తోఁచుచుండెను. అతఁడు చాలవఱకు మాటాడలేదు. ఒకమారు రజీజుద్దీన్ మొగమును గాంచెను. అతఁడు కొంతసేపట్లు మౌనముద్రితుఁడై యుండి "అజీజ్! నేనొకమారు అయ్యుబ్దుల్ రజాకును జూడవలసియున్నది. అట్లు చేయుదనుక నాయాలోచనలు స్థిరపడవు." అనెను.

అజీ: ఉదయమునఁ బోఁగూడదా!

వేణీ: అట్లు వలనుపడదు. నాబోటిపత్తేదారుల కిది తగినయదను. ఇంకను ప్రొద్దుపోలేదు. ఇప్పుడిప్పుడే సూర్యాస్తమయమైనది. ఉస్మాన్! రజాకా యింటనున్నాఁడా!

ఉస్మా: ఇదివఱకును రాలేదు. వచ్చువేళకూడ కాలేదు. ఇంచుమించుగఁ బదిగంటలదాఁక రాఁడు.

వేణీ: అతఁడేదైన వ్యాపారముఁ జేయువాఁడా!

అజీ: అవును. చర్మవ్యాపారి.

వేణీ: నేనతనియింటికే పోదును. ఉస్మాన్! నీవిఁకఁ బోవచ్చును. అజీజు పిలిచినప్పుడు వచ్చి మేమడిగినదానికి సమాధాన మిచ్చిపోవు చుండుము. ఇట్లుచేసిన నీకు శ్రేయమబ్బును. అజీజుద్దీను నిన్ను యావజ్జీవముఁ బోషింపఁగలఁడు.

అజీ: అందుకు సందేహము లేదు.

ఉస్మా: మహాప్రభులారా! నన్ను మీరు నమ్ముఁడు. నేను మీ సేవకుఁడను. దయచేసి యాబోగమింటిదాస్యమును తప్పించినఁ జాలును.

అజీ: భయము లేదు. త్వరలోనే నిన్ను నాయొద్దకు రప్పించుకొందును.

వేణీ : ఉస్మాన్ ! నీవిఁక వెళ్లవచ్చును. పనియున్న మరలవార్త నంపుదుము. వత్తువుకదా ?

ఉస్మా : స్వామీ ! ఆమాట నడుగవలెనా ? తమదాసుఁడనని చెప్పకొంటిని కదా.

వేణీ : మంచిది. నీవు పొమ్ము.

ఉస్మాన్‌ఫకీరు వారికడ సెలవొంది వెడలిపోయెను.

# పదమూఁడవ ప్రకరణము

## వ్యాఘ్రవికుంఠము.

ఆరాత్రి యిఁక వేణీప్రసాదునకు నిద్దుర లేదు. అతఁ డజీజునుగాంచి "అజీజ్ ! నీవు నాకుఁ గొంతవఱకబ్దుల్ రజాకువృత్తాంతము నెఱిఁగింపవలెను. అతని దాదినుండి యీయాయాలేనా ?" అని యడిగెను.

అజీ : అవును.

వేణీ : అతనికిభార్యాబిడ్డ లున్నారా ?

అజీ : భార్యబహుకాలముక్రిందట మరణించినది. చక్కనిచుక్కయగుబిడ్డయొక్కతె మాత్రము కలదు.

వేణీ : ఆకన్యనేనా నీకుఁ బెండ్లి చేయుట !

అజీ : అవును.

వేణీ : ఆమెపేరేమి ?

అజీ : దిలారామ్.

వేణీ : మీకప్పుడే పెండ్లిమాట స్థిరపడినదా ?

అజీ : లేదు. రజాకునకింకను నాయభిప్రాయము చెప్పలేదు.

వేణీ : నీకుఁ బెండ్లియాడ నభిలాష కలదా ?

అజీ : అంతయుఁ గుదిరిన నిష్టమే. మీరేదో రహస్యపై నను మానపడుచుంటిరే ! ఇప్పుడు నేనేమిచెప్పగలను ?

వేణీ : అతనిని నేను చూడవలయును.

అజీ : ఆ రాత్రి 1213 నం. మందిరమునఁ బ్రవేశించినవాఁ డతఁడేయని సంశయించుచుంటిరా ?

వేణీ : అవును. అబ్దుల్లా యొంటరిగా నింటనుండునా ?

అజీ.: తనకూతురుతోఁగూడ నున్నాఁడు. ఇంట సేవకులు పలువురు కలరు.

వేణీ : నేనేకాకిగఁ బోయిన నతఁడు నాతో మాటాడునా ?

అజీ : నిజరూపముతోఁ బోయిన మీకు రహస్య మెట్లు తెలియును ?

వేణీ : అందు కిప్పుడొక యవతార మెత్తెదను చూడుము.

అతఁ డంత తనదుస్తులను మార్చుకొని యచ్చపు ఫకీరు వేషమును ధరించెను. అదిగాంచి యజీజు పరమాశ్చర్యముతో "వహావ్వా! పోలీసువారే వేషమైనను వేయఁగలరు. భగవంతుఁడు మీకొసంగిన సహజలక్షణములలో నిదియొకటి కాఁబోలు. అయ్యో! మిమ్మిప్పుడు పరులు గుర్తిడఁగలరా ! నేనైన నాకస్మికముగఁ నానవాలిడ నేరను. కాని యిపుడీయవతార మెందులకు ?" అనెను. అందుకు ప్రసాదరావు "చూడఁగలవు. దీర్ఘముగ ముచ్చడించుటచే లాభములేదు. అజీజ్ ! అబ్దుల్ రజాకునకు ఫకీరులయెడల భయభక్తులు కలవా ?" అనియడిగెను.

అజీ : కలవనియే తలంతును.

వేణీ : సరి. నాకాతనిమందిరమును జూపింపుము.

అజీ : అయ్యో ! మీయాశయముల నెఱుంగ నేనెంతటివాఁడను. ఎట్లయినను మీకార్యక్రమం బంతయు నాహితార్థమే కదా. రండు. పోవుదము. బాగుగ చీకటిపడినది.

వే: నేను మరల నీరాత్రి వత్తునో రానో, ఒకవేళ రాకున్నను మీరు బెంగపడి యుండకుండు. ఈ సంగతి మా తండ్రిగారితో నిప్పు డనకుము. విన్న నెన్నియో యభ్యంతరములఁ జెప్పును. అతనిమనసతి మృదులము. సాహసమన్న జంకును అని యజీజుద్దీనునుకూడ పిలుచు కొని యారాత్రి యిన్‌స్పెక్టరు గృహము వెలువడి వచ్చెను.

వేణీప్రసా దజీజుతోఁ గొంతదూరమునడచి యబ్దుల్ రజాకు సదనమునఁ జేరి యజీజును వెనుకకుఁ బంపి తానొక్కఁడే యామందిర మును డాయనేగెను. ఆస్థలం బంతయు నతని కపరిచితము కాక పోయి నను పలుమా రందు సంచరించి యెఱుంగఁడు. అది యొకపెద్దమేడ. దానిముంభాగమున నొకమసీదు కలదు. మందిరముకడ నొకరిద్దఱు సేవకులుండిరి. వారు తమ్ముసమీపించిన మనమాయఫకీరును గాంచి సలాము చేసిరి. అతఁ డంత వారితో "భాయీ! ఈపెద్దమేడ యెవ రిది?" అనియనెను.

1 సేవకుఁడు: మా యజమానునిది.

వే: "అతనిపేరేమి?"

1 సేవ: అబ్దుల్ రజాకు.

వే: ఇంట నున్నాఁడా!

1 సేవ: ఆ మసీదునందు నమాజ్ చేయుచున్నాఁడు.

వే: నీ పేరేమి?

1 సేవ: నన్ను కరీమ్‌మాలావి యందురు.

వే: వీనిపేరు!

1 సేవ: జాఫర్‌ఖాన్.

వే: అచ్ఛా, మీరు చాల మంచివారు. మీకెప్పుడు నల్లాకృపకలదు.

అని చెప్పి మసీదును సమీపించి యచటికట్టపైఁ గూర్చుండెను. కరీమ్‌మాలానిమాత్ర మతనికడ కేగి “ స్వామీ ! లోపలికి దయచేయుఁడు. పైగంబరువంటి తమబోంట్లకు రారాని తావులున్నవా ? ” యనెను. వేణీప్రసాదు తనదీర్ఘ శ్మశ్రువులను సవరించుకొనుచు నల్లాను సంస్మరించుచు “ భాయీ ! మీ యజమానుఁ డింతలో నేతెంచును కాదా ? ” యనెను. ఆభటుఁడు “ వచ్చును. ప్రార్థనకేగిచాలసేపైనది.” యని చెప్పెను. వీరిట్లు సంభాషించుకొనుచుండఁగనే మసీదునుండి నీల దీర్ఘదేహుఁడొకఁ డివ్వలకు వచ్చి ఫకీరును గాంచి సలాముచేసెను— అతఁడే యబ్దుల్‌రజాకు.

రజా కిన్‌స్పెక్టరు ప్రసాదరావును మున్నెన్నియోమారులు గాంచియుండెను. అయినను నేర్పుమీర లోకులవంచింప వేణీప్రసాదు వైచుకొన్న యతనివాలకమును బట్టి ఫకీరుగనే భావించి రజాకు వినయముతో “ స్వామీ ! యెటనుండిరాక ! ” అనియెను.

ఉరుదుభాష బాగుగ మాటాడనేర్చిన వేణీప్రసాదేవిధముగను తననిజరూపము బయలుపడకుండ మిగులజాగరూకతతో “ నేనీదినము ఖరగ్‌పూర్‌నుండి వచ్చితిని. ఇంతకుము నీమహాపట్టణమును గాంచి యెఱుఁగను. ” అనియెను.

రజా : మహాత్మా ! తమకుఁ గ్రొత్తతావు లెందున్నవి ? లోక మంతయుఁ దమకుఁ బరిచయస్థానమేకదా.

వే : ఆమాట నిజమే కాని ప్రస్తుతనవనాగరికకాలమున మమ్ముఁ బలువురు చులకనగాఁ జూచుచుందురు.

రజా : వారు పరమమూర్ఖులులెండు. తామిప్పు డెచ్చట కేఁగుచున్నారు ?

వేణీ : మక్కాయాత్ర వెళ్ళ సంకల్పించుకొన్నాను. అచ్చటికిఁ బోవుటకు నాకిది యేడవమారు.

రజా : అబ్బా, తామీావయసునే యేడుమారు లాపుణ్యస్థలమును దర్శించితిరా! అవును. మహాత్ములకు దుర్ఘటమెందున్నదిలెండు.

వేణీ : భాయి! నీవు మిగుల మంచివాఁడవు. పరమభక్తుఁడవు నీకల్లా యనవరత మాయురారోగ్యైశ్వర్యాదుల నిచ్చి పోషించుగాత. సేఁబోయివచ్చెద.

రజా : స్వామీ! తామీారాత్రి మఱెందును బోవలదు. మాయింటికి విచ్చేసి నన్ను, నాగేహమును బవిత్రముఁ జేయవేఁడెదను.

వేణీప్రసాదు కావలయునని యొకటిరెండడ్డుమాటలు చెప్పెను. కాని యాతురుష్కుఁడతనిని వదలలేదు. తుదకతఁడు రజాకుతో సౌధములోని కేఁగెను.

అబ్దుల్ రజాకు సుస్వభావుఁడేయని వేణీప్రసాదు మొదట తలంచెను. కానియాయూహ నిశ్చలమై యుండక సంశయతరంగతాడితమై సంచలితము కాఁదొడఁగెను. అతనిచర్యల నప్రమత్తుఁడై గమనించుచుండెను. రజాకును నమ్మినవానివలె మాటాడుచున్నను హృదయమున మాత్రము సంశయించుచుండెను. ప్రసాదరావు అంతరాత్మ "వీఁడే—మహోద్యానమందిరమున మాటాడిన యజమాని." అని ఘోషించుచుండెను. లోలోన నతని కీయనుమానము దృఢపడిపోవుచుండెను. ఇన్‌స్పెక్టర్ బహు కుశాగ్రబుద్ధికలవాఁడు. రజాకుతన్ను మాటిమాటికి తేఱిపారఁ జూచుచుండుటను గమనించెను. అతని సూక్ష్మవలోకనములు నలుదిక్కులు పరుగిడుచు నేమూలయం దెట్టి వస్తువులుండునదియు, ఆగృహనిర్మాణ మెట్టిదనియు బాగుగ గమనించుచుండెను. అది బహువిశాలమందిరము. అందు పెక్కుచిన్నగదులు

కలవు. అందు పరిజనులేకాని యామహామ్మదీయున కాత్మీయవర్గమునఁ జేరిన స్త్రీలెవ్వరును గనుపింపలేదు.

అబ్దుల్‌రజాకు తిన్నగ నాతని రెండవమేడలోని విశాలమందిరములోనికిఁ గొంపోయి "మహాత్మా! రండు. ఈ యాసనము నలంకరింపుడు." అని సోపానుజూపెను. అతఁడందుపవిష్టుఁడై నంతనే తానును మఱియొకకుర్చీపైఁ గూర్చుండెను. అంత వేణీప్రసాదతనితో "రజాకు సాహేబ్! మీ పూర్వులవాసస్థాన మేది?" అనెను. రజా కమూయిక వీక్షణములతో "మొదటినుండియు మాదీయూరే." అని బదులాడెను.

వే: మీతండ్రిగారి పేరేమి?

అ: అతనిపేరు సభ క్తజిన్.

వే: నీకుఁ దోఁబుట్టువులు కలరా?

అ: లేరు.

వే: నీకు సంతతికలదా?

అ: కేవల మొక్కకూతురుమాత్రము కలదు.

వే: ఆమె మగనియింట కాపురము చేయుచున్నదా?

అ: లేదు. ఆకన్య నొకకులీనునికిచ్చి ధన్యుఁడగునంతటిపుణ్యము నింకను నోఁచియుండలేదు.

వే: ఫరవాన్నై. త్వరలోనే యల్లా నిన్ను పరమానందమున ముంచును. నీకు కులీనుఁడే కాక వినయగుణ వివేకుఁడును, ధనవంతుఁడు నగుజామాత యచిరకాలంబుననే లభింపఁగలఁడు.

అ: పెద్దలయాశీర్వచనము లూరకపోవు.

వే: సందేహమెందుకు.

అ: మీరింకను నిట నెంతకాల ముందురు?

వే: ఎంతకాలమైన నుండుట కవకాశము లేదు. రేపటిదినము మాత్రమే. ఆలోపల నీపట్టణమున నుండుతాజుద్దీన్‌ఖానును జూచి

మాటాడవలెను. అతఁడు నాచిరకాలశిష్యుఁడు. అతఁడు క్షేమముగా నున్నాఁడా—అయ్యో, ఏమట్లులికిపడెదవు ! అతఁ డూర నున్నాఁడా ?

అ : అతఁ డీలోకములోనే లేఁడు.

అనవుడు వేణీప్రసా దాకస్మికవిస్మయ విచారాధీనునివలె చూపట్టుచు "హా—హా—హా—ఏమంటివి, అతఁడు మరణించెనా ? అయ్యో ! పాపము. ఎంతకాలమైనది ! " యనెను.

అ : దాదాపుగ నొకపక్షము కావచ్చినది.

వే : ఆహా ! అసువు లెంతయస్థిరములు ! రజాక్ ! నాకును తాజుద్దీన్ ఖానునకును రాజకోటయందు ప్రథమపరిచయమబ్బినది. అప్పు డతఁడు నన్నెంతో సన్మానించి "ఏలైనప్పుడు మీరు మాపట్టణమునకు రండు. ఈసారి మనమిరువురముఁ జేరి మక్కా–యాత్రకు వెళ్లుదము." అని చెప్పెను. ఎంతలో నెంతయైనది.

అబ్దుల్ రజాకు మఱల మాటాడక తలవాల్చి యుండెను. వేణీప్రసాదుకూడ కొంతవడి విచారగ్రస్తుఁడైనట్లుండెను. కాని నిశ్చేష్టితుఁడై యుండ లేదు. అతనివిచారమా హృదయావిర్భూతము కాదు. అది కేవలనటనమాత్రమే. అబ్దుల్ రజాకు నమితానమ్రుఁడై యుండుటను గనిపెట్టి వేణీప్రసాదు తీక్ష్ణదృష్టిపాతముచే వానిహృదయభావములఁ బరించుచుండెను. "నాకన్నులు నన్ను మోసగించుచుండుట లేదుకదా, వీఁడే నాకు మహోద్యానమందిరమునఁ గాన్పించినతురుష్కుఁడు, వీఁడే యారాత్రి **1213** నం. గృహమును బ్రవేశించిన జులిమావిటుఁడు. వీఁడేహంతకుఁడు. వీనిని బంధించిన సర్వము కరతలామలక మగుటనిజము. సందియ మేల. ఇఁక పొరపడుట కవకాశము లేదు. వేకువజాముననే రక్షకభటసహాయముతో వచ్చి వీనిని బంధించి

కొంపోవలెను." అనియనుకొనెను. అట్లు నాలుగైదునిమిషము లతిక్రమించిపోయినవి.

వే : రజాక్ ! తాజుద్దీనున కేమైయుండెను ?

అ : అతఁడు హత్యకావింపఁబడినాఁడు.

ప్రసాదరావు మరల నాశ్చర్యము నటించి "హా ! ఏమంటివి, హత్యయా !" అని నిస్తబ్ధుఁడై యూరకుండెను—మరల రెండుమూఁడు నిమిషములకాలముమూకత్వము—

వే : ఎవరుచంపిరి ?

అ : అది యింకను తెలియరాకున్నది. పోలీసువారు హంతకుల జాడల నరయుచుఁ దిరుగుచున్నారు. ఇంతలో నచ్చటి కొకపురుషుఁడు వచ్చి "అయ్యా ! భోజనమువేళ యైన" దని చెప్పి వెడలిపోయెను. వానిని వేణీప్రసాదు నిదానించి చూచెను. ఆక్షణముననే మనసున విస్మయానందములుద్భవించినవి—ఏల ? వాఁడుమ రెవ్వఁడును గాఁడు—ఇస్మాల్ ఖాన్ సేవకుఁడు గులామ్ ! ! !

ఇప్పుడు వాఁడబ్దుల్ కడనుండెనని తెలియవచ్చుచున్నది. ఇస్మాల్ ఖానును వదలి మూఁడునాల్గుదినములైనఁ గాలేదుకదా యింతలో నీ యిరువురి కెట్లుపరిచయము చేకూరి యుండును. ఇన్‌స్పెక్టరిట్లు తలంచెను, "యోచించిచూడ నీయిరువురకును బూర్వపరిచయము కొలఁదిగనో గొప్పగనో యుండితీరవలయును. నాఁడు మహోద్యానమున నేఁగాంచిన దీయబ్దుల్ రజాకునే యనుట నిస్సందేహము. ఇఁక నిప్పుడు సంభాషణవశమున నాలకించినది యీగులామ్ పేరే కావచ్చును. వీఁడు కూడ హంతకవర్గము లోనివాఁడే." అనుకొని గులాము చరిత్రను గ్రహింపఁగోరి "భాయి ! ఇటు రమ్ము." అనెను. అందుపై వాఁడు సాహసించి పోఁజాలక నిలిచిపోయెను.

వే : అబ్దుల్ ! వీఁడు నీ సేవకుఁడేనా ?

అ : అవును. ఏల, స్వామీ ?

వే : ఈ సేవకుఁ డుండుటచే నీవు మిగుల సదృష్టవంతుఁడవు.

అ : ఎట్లు ?

వే : వీఁడు నీకు మహోపకారి. మిగుల కృతజ్ఞుఁడు.

అ : ఎట్లు ?

వే : నీకత్యంతసహకారి కాఁగలఁడు. ఇప్పటి కప్పుడే నీకెంతో తోడ్పడినాఁడు.

అ : ఏవిషయములందు తోడ్పడినాఁడు ?

వే : సరిగ చెప్పనేరను. వీనినిమాత్రము వదలకుము. నీకెంతను గొప్పయుపకారి గాఁగలఁడు.

అ : అదెట్లు కనుగొంటిరి ?

వే : మా యోగశక్తివలన. దాని కసాధ్య మెందు కలదు.

వీరిరువు రిట్లు మాటాడుకొనుచుండ గులాము ప్రసాదరావు నెగాదిగ నుపలక్షించుచుండెను. వానివైపున కప్పుడప్పు డిన్ స్పెక్టరు చూచుచుండెను. ముందునకుఁ బోనియ్యక యేమేమో మాటాడు చుండెను. అబ్దుల్ ఫకీరుమాటలకు విస్మితుఁడై యది నిజముగ మహాత్మ్యమా ? జగద్వంచకసంభావణయా యని తలపోయసాగెను. అప్పు డున్నట్టుండి గులాము మిద్దెవిఱుగునట్లు ప్రళయాట్టహాసముఁ గావించి "మహారాజ్ ! వేణీప్రసాద్ జీ ! సలామ్." అని భీషణహాసధ్వనిచే నామందిరమునంతటిని ప్రతిధ్వనితముఁ గావించెను.

అది గాంచి తక్కినయిద్దరు నివ్వెరపోయిరి. అందును వేణీప్రసాదు విస్మయభయావస్థ విలేఖనాతీతము. గులామట్లు భీషణహాసముఁ గావించుచు నతనివైపు చుఱచుఱఁ జూచుచుండెను. వేణీప్రసాదు

విభీతస్మరయావస్థ మితిమీరిపోయెను. అబ్దుల్ రజాకునకుఁగూడ నేమియుఁ దోఁచలేదు. అతఁడంత చటాలున లేచి గులామును సమీపించి "ఓరీ! వేణీప్రసాదేఁడిరా? కలవరించుచున్నావా?" అనెను. గులాము నగుచు "అయ్యా! ఇప్పుడు నేనును మీరును మాటాడుచుండు టెంతనిజమో నేను వేణీప్రసాదరావును జూచుటకూడ నంతనిజమే." అనెను. అబ్దుల్ నివ్వెరపాటున "ఏఁడీ, అతఁడేఁడీ" అని ప్రశ్నించెను. "ఇదిగో, దొంగఫకీరు వేషమున మనయెదుట నున్నవా రెవరను కొంటివి?" అని గులాము బిరబిరవచ్చి యిన్‌స్పెక్టర్ కుర్చీని పట్టుకొని నిలిచెను. రజాకు విస్మయచకితుఁడై "ఎవరయ్యా నీవు? నిజముగ తెల్పుము." అని గద్దించెను.

ఆహా! ఇప్పుడు వేణీప్రసాదునవస్థనుగుఱించి యేమని వ్రాయఁ గలము. తన్ను వారట్లు గుర్తింపఁగలరని యతఁడు దలంచియుండలేదు. తలవనితలంపుగా నిప్పుడొక వ్యాఘ్రకూటమున (బోనున) దగుల్కొన్నట్లు తల్లడిల్లి తనమనోరథ మిట్లు విషఫలప్రదమగుటకు విచారించెను. అయినను ధీరోత్తముఁడు కాన తనమనోభావముల గోప్యపఱచి "అబ్దుల్! నీకును మీయింటివారికి నప్పుడప్పుడు పిచ్చి యెత్తుచుండునా యేమి? లేకున్న నింతవింతగ మాటాడరు. నీకు మర్యాద తెలియదు. నన్నిట్లవమానించుటకేనా నీవు తోడ్తెచ్చినది? నాయెడల సంశయించుచుంటివా? నీకు దృష్టిమాంద్యమా లేక బుద్ధిమాంద్యమా?" అని యదలించి మాటాడెను. గులాము వెలుపలగదిలో నున్న మఱి యిరువురు సేవకులను హస్తసంజ్ఞలచేఁ బిలిచెను. వారు వచ్చిరి.

ఇప్పు డేమిచేయనగును? ముష్కరతురుష్కచతుష్టయమున వేణీప్రసాదు తగుల్కొన్నాఁడు. ఇంకెట్లు బ్రతికి పోఁగలఁడు. అయినను "ధైర్యం సర్వత్ర సాధయేత్" అను నార్యోక్తిని మఱవక తన

రూపమును మఱుగుపఱుప నెన్నియో మాటలాడెను. అబ్దుల్‌రజాకు డోలాందోలితచిత్తుఁడై చూడసాగెను. గులాము కనుగీటులచే తక్కిన యిరువురుభటులు తటాలున వచ్చి యిన్‌స్పెక్టరు చేతులు గట్టిగఁ బట్టు కొనిరి. గులా మతనిచొక్కా జేబులోని పిస్తోలును వెలుపలికి తీసి పట్టు కొని పకాపక నగుచు "ఫకీరునకు పిస్తోలెందుకోకదా." అనుచు నమాంతముగ నతఁడు ధరించినకృత్రిమశ్మశ్రువులనుబట్టి లాగివైచెను. ఇంకేమున్నది! రూపము మారిపోయినది!! నిక్కముగ వేణీప్రసాద రావు వారికిఁ బ్రత్యక్షమయ్యెను!!!

# పదునాల్గవ ప్రకరణము

## భయంకరపరిణామము.

అబ్దుల్‌రజాకు విస్మయపడిపోయెను. వేణీప్రసాదిట్లు వచ్చునని యతఁడు కలనైనఁ దలంపలేదు. అట్లుకృత్రిమరూపముతో నేలవచ్చె నని యాలోచించి పోలీసువారికి తనపై సంశయము కలిగియుండు నని యనుకొని రజాకు క్రుద్ధవ్యాఘ్రమువలె గాండ్రించి "ఏమండీ, ఇందు మీయుద్దేశమేమి? మమ్ము మోసగించుటకుఁ గతమేమి?" అనెను. ప్రసాదరావున కీక గత్యంతరము కాన్పింపలేదు. అందుచే నతఁడు తనచేతులను బట్టుకొన్నయిరువురిని విదలించివైచి "అయ్యా! నీబోటి దుండగీఁడులచర్యలఁ గనిపెట్టుటకు మేమిట్టివేషముల వేయుటతప్పదు. ఇందు విచిత్రమేమియు లేదు" అనెను.

అ: ఏమంటివి నేను దుండగీఁడనా?

వే: అవును. అట్లు తలంచుటలో నాప్రమాదములేదు.

అ : నీకీదేశపు జనులమర్యాదలు తెలిసినట్లు లేదే.

వే : అట్లు కాదు. మీవంటిమహాశయులకుఁ దగినమర్యాదనే చూపుచున్నాను. నీస్థితి ముందుమందు తెలియఁగలదు. అబ్దుల్ రజాక్! నీదుష్ప్రవర్తనము జగమెఱుంగదని నమ్మెదవేమో. మన సుకృత దుష్కృతంబుల కెన్నఁటికిని లోకమున మఱుఁగుండదు. ఎంత దాచ యత్నించినను తుదకు మనయత్నములు నిరర్థకములే. మనుష్యుల పాప పుణ్యములకు సాక్షిభూతుం డగు జగత్సాక్షిని మనము వంచింపనేరము. ఇఁక దాచుటచే ఫలములేదు" అని యింకను నేదియో చెప్పఁబోవు చుండ రజాకు రోషకషాయితాక్షుఁడై "చాలించుము నీయుపన్యాసము మును. నీ తెలివి నీ మొగముమండినట్లే యున్నది. బుద్ధికలిగి యిటనుండి వెడలిపొమ్ము." అని గర్జించెను.

వే : పోయెదను. మొదట నాప్రశ్నలకు సదుత్తరముల నిమ్ము. ఈగులా మెవఁడు? మహోద్యాన మందిరమున నాఁటిరాత్రి తాజు ద్దీన్ హత్యాపరాధమునుగూర్చి మాటాడుచున్న హంతకులు మీరే. మిమ్ము నేను చక్కఁగఁ జూచినాఁడను. గులామ్ ఇస్మాల్ ఖాను మందిరమునువీడి పారివచ్చినప్పుడు మొగము మూసికొనుటకుఁ గార ణము తెలిసినది. సమక్షమున మేముంకుటచే నానవాలిడుదు నేమో యని యట్లుచేసినాఁడు. మీరుకూడ ఇస్మాల్ ఖాన్ విచారణకాలమున నేను చెప్పినదంతయు నాలకించి యుండవచ్చును—అందుకే యింత జాగ్రత్త.

గులామును, రజాకును, పండ్లు గీటుచు హుంకరించి "నోరు మూయు" మని బెదరించిరి. వేణీప్రసాదించుక పొరపడెను. తానుశత్రు మధ్యమున నుంటినని తలంపకలేను్న వారేమిచేతురో యనిన్యైనభీతిలక

మాటాడసాగెను, "మీసంగతి నేనెఱుఁగుదును. సత్యమును దాచుటచే లాభమేమి? మహోద్యానమందిరమున నారాత్రి ముప్వురు రహస్యసంభాషణను నెఱపుచుండుటగాంచితిని. అందులో మీరిరువురు, మూఁడవవాఁడెవఁడో తెలియదు. వాఁడును మీలోనివాఁడే. మీ గుట్టును దెలిసికొన్నతర్వాత నే నిరపరాధి యగు నిస్మాయిలును వదలించితిని. నాసంగతి మీకుఁ దెలిసియుండవచ్చును. జాగ్రత్త. నన్ను మీరు వంచింపలేరు." అని రజాక్ గులామ్ శాహీలముఖముల నవలోకించెను—అప్పుడవి నిస్తేజములై యుండెను—వారి చిత్తసంక్షోభము కన్నులలో తాండవించుచుండెను. వారు కొంతసేపు మాటాడక శిలావిగ్రహములవలె నిలుచుండి చూచిరి. ప్రసాదు వారిని జూచి నవ్వి "అయ్యో! రజాక్! ఇప్పు డంతయు విశదమైనదా?" అనియెను. చూచుచుండఁగనే యబ్దుల్లా క్రోధమూర్తియై గులామువంక చూచెను, ఆ కన్నులలో నజ్ఞాతభావకాంతులు ప్రజ్వరిల్లినవి. ఆహా! తర్వాత సంగతి నేమని వ్రాయఁగలము!! పాపము వేణీప్రసాదరా వాయుత్తరక్షణముననే యాకఱకుతురకల కరాఘాతములకు లోనైపోయెను!!!

పాపము! వేణీప్రసాదు నిరాయుధుఁడు. ఉన్నయొకపిస్తోలును మొదటనే గులాము లాగుకొనెను. అతఁ డిపు డేమిచేయఁగలఁడు! ఎంతబలియుఁడైననేమి? ముప్వురు — నల్వురతోఁ బోరఁగలఁడా! ఆ ప్రఘాతముల కతఁడు భూపతితుఁడై మిగుల నలిగిపోయెను. వారతనిని బాగుగఁ బ్రహరించి యఱవకుండ నోట గ్రుడ్డలుగ్రుక్కి కాలుసేతులు బంధించిన. వేణీప్రసాదుదుర్గతి శోచనీయము. వాడతని నందే మట్టుపెట్టవలసినదే కాని యిహాబుణశేష ముండుటచే నప్పు డా కిరాతకుల కట్టిదుర్బుద్ధి పుట్టలేదు. అయ్యో! పాపము! ఇన్స్పెక్టరా దెబ్బల కాగలేక శోషిల్లి పడిపోయెను.

అప్పటికప్పుడే చాలరాత్రి యైనది. పురవీథులు జనసంచారశూన్యములై యుండెను. అది చూచి రజాకు తక్కినవారితో "ఓరీ! వీఁడింకను చావలేదు. ఇప్పటికీశిక్ష చాలును. ఈ నిర్భాగ్యుని మోచికొనిపోయి రాణిగంజిలోఁ బారవైచిరం" డని యాజ్ఞాపించెను. తోడనే కాలకింకరులవలె వారు స్మృతివిహీనుఁడై పడియున్న ప్రసాదరావును మోచికొని మెల్లు దిగి పోయిరి.

ప్రభాతకాంతు లలమికొనుచున్నవి. వేణీప్రసాదింకను నింటికి రాలేదు. అజీజుద్దీను కారేయి యంతయు కునుకుపట్టలేదు. ఎప్పుడు ప్రసాదరావు వచ్చి తన్నుఁ బిలుచునో యని గదియం దొంటరిగఁ గూర్చుండి యోచనాపరవశుఁ డయ్యెను. రాత్రి యతఁడు రాలేదు. తెలతెలవారవచ్చినను నిలుచేరలేదు. అందుపై నతనికి హృదయాందోళన మారంభమై కాలాతీతమైనకొలఁది నదికూడ నభివృద్ధి నొందసాగెను. ఇంటివారు మాటిమాటి కతనికడ కేతెంచి "బాబూ! మా వేణి రాలేదా? రాత్రి యెచ్చటికిఁ బోదునని సీతోఁ జెప్పిపోయె" నని ప్రశ్నించుటచే నతని యుద్విగ్నత యినుమడించెను. వేణీప్రసాదున కింట వృద్ధులగు మాతాపితరులు కలరు. వారజీజువలన తనకుమారునిపోకడఁగూర్చి విని యంతటిభయంకరకార్యార్థియై పోయిన వాఁడింకను రానందుకు మిగుల తల్లడమొందిరి. అతని సతీమణి కమలామణి యుదిలపాటుకూడ నేమాత్రము తక్కువకాకుండెను. అప్పుడజీజు "ఇన్‌స్పెక్టరుగారు వెళ్లినకార్యము నిక్కముగ సపాయకరమైనది. అబ్దుల్ రజాకే హంతకుఁడై యుండునా? లేక ప్రసాదరావు స్థలాంతరమున నుండునా? ఎట్లయిన నిప్పుడు నండలాలును దర్శించి యాతని సాయమును బడయుట లెస్స" అని యాలోచించుకొని యతఁడు వెంటనే యాన్యాయవాదిని జూడ బయలు వెడలెను.

అజీజుద్దీను నందలాలుసౌధమును జేరుసరికి త్రొమ్మిదిగంటలై యుండెను. అదృష్టవశమున లాయరుగా రప్పుడింట నుండుటచే నజీ జాతనితో రాత్రి వేణీప్రసాదు కార్యార్థియై యబ్దుల్ రజాకు మందిర మున కేగినసంగతిని దెలిపి యతఁ డింకను నింటికి మరలి రాలేదని చెప్పెను. నందలాలు కొంతదనుక మాటాడక మిన్నకుండి "నీతోనతఁ డుదయమున మరలవత్తునని చెప్పియుండెనా?" అనియడిగెను.

అజీ : రాక యెందేఁగును? వచ్చియే తీరవలయును.

నంద : అట్లుకాదు. అపరాధులజాడల నరయునెడఁ బోలీసు వారుగాని, పత్తేదారులుగాని సందర్భోచితంబుగ చరించుచుందురు.

అజీ : అట్లయిన మీయభిప్రాయమేమి?

నంద : వేణీప్రసాదు కార్యావసరమునై నీనగరునువదలి స్థలాం తరమున కేగియుండు ననుకొందును.

అజీ : ఎట్లయినను మనమిపు డబ్దుల్లామందిరమున కేగుట మంచిదికాదా!

నందాలా లాలోచించి "అట్లేకానిమ్ము. సంగతులచ్చట నెంత వఱకుఁ దెలియునో చూతము." అని లేచెను. వెంటనే వారొకచలన హేతుశకటము నధిరోహించి రజాకుసాహేబు వీధినిబట్టిపోయి కొంత సేపటికి గమ్యస్థానమును జేరిరి. రజాకునింటిముందర నొక సేవకుఁడు నిలుచుండి యుండెను. మోటారుబండి వచ్చి తమగృహప్రాంగణమున నిలుచుటఁ గాంచివాఁడు సమీపమున కేతెంచి "స్వామీ! తామెవ్వ" రని ప్రశ్నించెను.

నంద : అబ్దుల్ రజా కింట నున్నాఁడా!

సేవ : లేఁడు.

నంద : ఎందేఁగెను.

సేవ : నిన్న సాయంకాలము బరోడాకు వెళ్ళిపోయెను.

నంద : ఎవరెవరు ?

సేవ : అతఁడొకఁడే, మీ కతనితో నేమిపని ?

నంద : కలదు. అతఁ డెందుకుపోయెనో తెలియునా ?

సేవ : నాకేమి తెలియును ?

నంద : పోనీ. అతఁ డెప్పుడు వచ్చునో తెలియునా ?

సేవ : తెలియదు.

నంద : రాత్రి మీయింటి కెవ్వరైన వచ్చిరా ?

సేవ : ఎవ్వరును రాలేదు.

నంద : నీవు రాత్రి యిచ్చటనే యుంటివా ?

సేవ : ఉంటిని. పరులు మాయింటికివచ్చుట చూడలేదు.

వారి కట నేరహాస్యమును దెలియలేదు. సేవకుఁ డితరు లెవ్వరు రాత్రి తమయింటికి రాలేదని చెప్పుచుండుటచే వారియాలోచనలు నానామార్గములఁ బరువులిడుచుండెను. వారటనుండి కదలి వేణీప్రసాదు గృహప్రాంగణమున నిలుచుండిరి. అదేసమయముననే వచ్చి నిలిచిన యొక యశ్వశకటమునుండి యువకుఁడొకఁడు క్రిందికిదిగెను. అతఁ డెవఁడు వేణీప్రసాదు కాక మతెవ్వరు ?

ఇన్‌స్పెక్టరును గాంచినంతనే పరమానందముతో నందలాలతని నుద్దేశించి "అయ్యా ! మీకొఱకందఱు మిగుల పరితపించుచుండిరి. ఎప్పుడింటికి వచ్చినారు ?" అని యడిగెను. "అయ్యా ! నిన్నరాత్రి మీరు పోవునపుడు తామొకవేళ రాకున్నను భీతిలవలదని చెప్పితిరి. కాని మాకుమాత్రము ధైర్యముజనింపలేదు. అందుచే నేనును నందలాలుగారును అబ్దుల్ రజాకు మందిరమున కేగి యిప్పుడే మరలివచ్చుచున్నాము." అని యజీజు చెప్పెను. అదివిని ప్రసాదరావు నిశ్వసించి "అచ్చట మీ కేమి తెలిసినది ?" అనెను.

అజీ : "రాత్రి పరులెవ్వరైన మీయింటికి వచ్చిరా ?" యని సేవకు నడుగ వాఁడు "లేద" ని బదులుచెప్పెను.

వే : అంతయు నసత్యము. రజా కెంట నుండెనా ?

నంద : లేఁడఁట. నిన్న సాయంకాలమే బరోడాపోయెనఁట !

వేణీప్రసాదు మరల నిట్టూర్చెను. అది కాంచి వారతనికి విశేషాయాసము జనించినదని గమనించిరి. అంతలో లోపలినుండి యాత్మీయులందఱు వెలుపలికి వచ్చిరి. వృద్ధుఁడగు గిరిధరరావు కుమారునిఁ గాంచి తత్తరముతో నతనిని డాసి "బాబూ! ఏమిది, నీ మోమేల యొక్కరాత్రిలో నింతవివర్ణదశ నొందినది ! ఏలయిట్లాయాస మొందెదవు" అని యాతురముతోఁ బ్రశ్నించెను. వేణీప్రసాదు నిలుచుండ లేక బల్లపై మేనువాల్చి పరుండెను. మాటాడలేదు. దాహమని చెప్పుటచే నింతశుద్ధోదకముఁ దెచ్చి యియ్యఁబడెను. అతని యవస్థను గాంచి యందఱు మిగుల భయావహులైరి. నందలాలు దాపునకు వచ్చి "ప్రసాద్‌జీ! ఏల యిట్లుంటిరి ? మీకేదైన శరీరాయాస ముదయించి నదా ?" యనెను. వేణీప్రసాదు కొంతకాలము నిరుత్తరుఁడై దీర్ఘోచ్ఛ్వాసంబును వెలిబుచ్చుచు నిట్లనెను. "అయ్యా! శరీరబాధకాదు, మరణబాధ." అనవుఁ డందఱు హాహాకారములఁ జేయసాగిరి. గిరిధరుఁ డందఱిని వారించి తనయునిప్రక్కఁ జేరెను. ప్రసాదరావు హస్తసంచాలనచే నందఱి నూఱడించుచు "నా కేమియుఁ బ్రాణభీతి లేదు. వైద్యునిఁ బిలువఁబంపుఁడు. బలమగు దెబ్బలు పడినవి" అని హీనస్వరముతో వాక్రుచ్చెను. వెంటనే భిషగ్వరసహాయార్థ మొక సేవకుఁడు పంపఁబడెను.

నంద : మీకు బలమగు దెబ్బలు తగిలినవా ?

వే : అవును.

నంద : ఎచ్చట ?

వే : రజాకు మందిరమున.

నంద : ఎప్పుడు ?

వే : రాత్రి.

అంత నతఁ డందఱి వేడికోలుపై రాత్రి తాను పోయినదాదిగ జరిగిన సమస్తవృత్తాంతమును వినిపించి "అట్లాకఱకుతురకలు నాపైఁబడి ప్రహరింప నేను మూర్ఛిల్లి పడిపోతిని. పిమ్మట నేమిచేసిరో నాకుఁ దెలియదు. తెలివొంది చూచుసరికి నేను రాణీగంజిలో నొకశిథిలమందిరమునందు పడియుంటిని. అచ్చటివా రప్పుడే కొందఱు నాచుట్టును జేరి నన్ను విగతజీవునిగా భావించి యేమేమో మాటాడుకొనుచుండిరి, నేను తెలివొంది లేవఁగనే వారు విస్మితులై నాచరిత్రను దెలుపఁ గోరిరి. నేనేదియో సమాధానము చెప్పి వారి సాహాయ్యముతోనే యొక బండిని కుదుర్చుకొని యిటువచ్చితిని."

వేణీప్రసాదుమాటలు విని యందఱు విషాదవిభీతచేతస్కులై మృత్యువునుండి తప్పించినందుకు దైవము ననేకభంగుల నభినందించిరి. అంత గిరిధరుఁడు "వైద్యుఁ డింతలోనే రాఁగలఁడు. రమ్ము. లోపల పరుండుము. ఈపాడు పోలీసువృత్తిని మానుమని యెంతచెప్పినను వినవు. ఇందలి పేరుప్రతిష్ఠలు ప్రాణముల నాహుతిగొనునని తెలియకున్నావు. నేను పోలీసువృత్తి నవలంభించియే ధనమును గడించితినా! మాకు వృద్ధులమాటలు చెవికెక్కవు. స్వానుభవమే చక్కనిపాఠము నేర్పవలయును" అని గొణుగుచు నతని లోపలికిఁ గొంపోయెను. నందలాలు వృద్ధుని మాటలకు లోలోన నవ్వుకొనుచు వారి ననుసరించి పోయెను.

# పదునైదవ ప్రకరణము

## ఫలకరండము

ఆ సాయంసమయమువఱకును మఱెట్టి విశేషంబులును జరుగలేదు. నందాలాలాలోపున నొకటిరెండుమారులు వేణీప్రసాదును జూడవచ్చి యతనిశరీరస్థితిని విచారించుకొని, యతఁడప్పుడే లేచి పారాడుచుండుటను గాంచి యానందించెను. అందఱును జేరి యాదినము సంపూర్ణ విశ్రాంతిని గైకొనఁగోరుటచే ప్రసాదరావు వారిమాటలఁ ద్రోసిపుచ్చక యారాత్రి యింట సుఖముగా గడపనిశ్చయించుకొనెను. గిరిధరరావు చిరకాలము దక్షిణదేశమునం దొకపట్టణమున నున్నతపాఠశాలయందు ప్రధానోపాధ్యాయుఁడుగ నుండి తనకాలమును సుఖముగా వెళ్లఁబుచ్చి యిప్పుడు విశ్రాంతివేతనమును గొనుచు కుమారుని యుద్యోగవశమున నిపు డహమదునగరును వచ్చిచేరెను. మొదటినుండియు శాంతజీవనమున కలవాటుపడినవాఁడగుటచే నతనికి నెమ్మదిలేని పోలీసుడిపార్టుమెంటుపైఁ గడుజుగుప్స. తండ్రి వలదనుచుండఁగనే వేణీప్రసాదు ప్రస్తుతోద్యోగమును స్వీకరించెను. గిరిధరుఁ డందులకుఁ దనయునితో నప్పుడప్పుడతితీవ్రముగనే వాదించుచుండెను. కాని యాయుద్యోగమునే సుఖకరముఁ గావించుకొని వేణీప్రసాదు కీర్తికాంతనొకప్రక్కను, ధనదేవత నొకవైపునను నడిపించుకొని వచ్చుచుండుటను గాంచి తన వాదమును క్రమముగఁ దగ్గించి గిరిధరుఁ డూరకుండెను. మరలనది నేఁడొకమారు తలయెత్తినది. రాత్రి భోజనమునకుఁబూర్వము గిరిధరప్రసాదరావు లోకవిశాలమందిరమునఁ గూర్చుండి యేదోమాటాడుకొనుచుండిరి. గిరిధరుఁడు చెప్పుచుండెను—వేణీప్రసాదు వినుచుండెను. అంతలో నందలాలజీజుద్దీనుతో నట ప్రత్యక్షమై "తాతగా రేదో

యుపన్యసించుచున్నారే ” యనుచు నొకపడకకుర్చీలో సుఖాసీనుఁడయ్యెను. గిరిధరుఁ డిట్లనెను. “ అయ్యా ! నాకుమారునికి నేనెప్పుడు నుపన్యసించున దొక్కటే. ఈయుద్యోగమును వదలుమని చెప్పుచున్నాను. చూడుఁ డిది యెంతకష్టపదమో, తుద కొకనాఁడు ప్రాణము లాహుతిఁగొనక మానదు. ”

నంద : విడిచి యేమిచేయు మందురు ?

గిరి : పునహోఘర్గూజన్ కళాశాలలో నొకప్రొఫెసర్ పనియున్న దని నామిత్రుఁడు స్మిత్ దొర వ్రాసినాఁడు. మావాని నతఁడు మిగుల ప్రశంసించుచుండువాఁడు. ఇప్పుడు పోయినను వీని కాపని నిచ్చును. నందలాల్ జీ ! మీరే చెప్పుఁడు. ఉపాధ్యాయవృత్తినిమించిన శాంత జీవనము కలదా ?

నంద : లేనిమాట నిజమే. ప్రసాదరావుగా రేమనుచున్నారు ?

గిరి : వానివాదమును వానినోటినుండియే వినుఁడు.

వే : ప్రొఫెసర్ పని మంచిదికాదని నేనెప్పుడును చెప్పను. కాని మొదటినుండియు నీవృత్తికభ్యాసపడిన నాకది గిట్టదు. పోలీసు డిపార్టుమెంటు నాకునచ్చిపోయినది. నాకిందే యాదాయము మెండుగా కలదు.

గిరి : ఆదాయమే కాని దేహసౌఖ్యము చూచుకోవలదా ?

వే : నాకిందు సౌఖ్యలోప మేమున్నది ? ఏదోయొక్కొక్కమారిట్టిగండములు రావచ్చును. రానిండు. నాలుకయపభ్రంశము లాడు నని కోసివేయవచ్చునా ? ఉన్నదానిని చక్కఁబఱచుకొనుటే వివేకము. ముఖ్యముగ కీర్తిప్రతిష్ఠలనాశించువారి కిదియే యనుకూలోద్యోగ మని నామతము.

గిరి : పిచ్చివాఁడా, పేరుప్రతిష్ఠలఁ బొందినమహానీయు లందఱు నీ పోలీసుడిపార్టుమెంటులోనివారేనా ? ఎంతపొరపడితివి. దాదాభాయ్ నౌరోజ్, తిలక్ మహాశయులు, గాంధీమహాత్ముఁడు మున్నగువారే పోలీసుపని గావించిరి ?

వే : ఇదియు నొకరీతి మానవసేవ. ఇది దుష్టశిక్షణ, శిష్టరక్షణ ప్రియుఁడగు భగవంతునకు ప్రమోదకరమైనది.

గిరిధరుఁడు పోలీసుశాఖలోని కష్టములంగూర్చి వాదించుటయు వేణీప్రసాదు ఖండనఁ గావించి స్వీయోద్యోగమును శ్లాఘించెను. అతఁ డుపాధ్యాయవృత్తిని నిరసించలేదు. కాని యది తనకనిష్టమైనదని చెప్పెను. వర్షము కురిసి వెలిసినట్లు వారివాద మంతటితో నాగిపోయెను. నందలాలు తనయభిప్రాయ మొసంగి వెడలిపోయెను.

భోజనానంతరము వేణీప్రసాదు వార్తాపత్రిక చూచుచు తన యాఫీసుగదిలో కుర్చీపైఁ గూర్చుండియుండెను. గిరిధరరావు సేవకుఁడు పరచిన పరుపును సవరించుచు హాలులో నేదో గొణగొణలాడుచుం డెను. అప్పుడు గడియారము పదిగంటలు కొట్టెను. అప్పు డొకఁడు ద్వారముకడ నున్న రామసింగను సేవకునిఁ గాంచి "ఇన్‌స్పెక్టర్ బాబుగా రున్నారా" అని ప్రశ్నించెను. రామసింగు "ఉన్నారు. పని యేమి ?" అనెను. "ఇదిగో యీ పండ్లబుట్టను వారి కందఁజేయుము." అని వానిచేతి కొకకరండము నిచ్చెను. దానిచుట్టును గాగితములు చుట్టఁబడి లక్కముద్రలు వేయఁబడియుండెను. రామసింగు దానిని జూచి "ఇది యెవ రిచ్చిరి ?" అని మరల నడిగెను. ఆ నూతనవ్యక్తి "నేను నందలాలుగారి సేవకుఁడను. వారు దీనిని మీబాబయ్యగారి కిమ్మనిపంపిరి. ఢిల్లీనుండి యతనికై ప్రత్యేకముగఁ దెప్పించిరఁట" అని చెప్పుచు నటనుండి వెడలిపోయెను. రామసింగు తలుపు మూసి వైచి యాఫలకరండమును బట్టుకొని ప్రసాదరావుగదిలోనికి వచ్చెను.

తండ్రితో వాదించినప్పటినుండి వేణీప్రసాదు మనసు మిగుల నాందోళన మొందుచుండెను. అంతలో రామసింగు పండ్లబుట్టను బట్టుకొనివచ్చి "నందలాల్ జీ తమకై ఫలములు పంపినారు. స్వామీ!" యనెను. ప్రసాదరావునకు ఫలములపై నిష్టము. మఱియొకప్పుడై యుండిన — నామాట నాలకించినంతనే యెగిరి వచ్చి యాబుట్టను లాగుకొనియుండును. కాని నేఁడు వ్యస్తచిత్తుఁడై యున్నాఁడు. "దాని నామేజాక్రింద నుంచి యందు రెండుమంచిపండ్లను తండ్రిగారికిమ్ము" అని చెప్పి శయ్యామందిరమును ప్రవేశించెను. రామసింగు దానిని మూలనున్న బల్లకడ నునిచి మూఁతనుఁదీసి చేతిని లోనికుంచెను—ఆహా! ఏమని చెప్పుదుము! ఆ మరుక్షణముననే ఘోరశతఘ్ని పేల్చినట్లు నిర్ఘోషనినాద మొకటి వినఁబడెను!! వెంటనే రామసింగు 'హా' యనియార్చి నేలఁబడెను!!!

ఆప్రళయనిస్వనము నాలకించి యింటివారందఱు పారివచ్చిరి. గదియంతయు దుర్వాయుపూరితమై యుండెను. కొంతసేపటివఱకు నేదియు దృగ్గోచరము కాలేదు. బల్లకడ రామసింగు పడి యుండెను. శరీరము రక్తప్లుతమై యున్నది. అంతటను మేకులు గ్రుచ్చుకొని యుండెను. చుట్టును కొంతదూరము వాడిసూదులును, ముండ్లును పడి యుండెను-వేణీప్రసాదు భయసంభ్రమవిలోలుఁడై "బాంబు-బాంబు. బాంబుప్రేలిన" దని యఱచెను—అందఱు విభ్రాంతులైరి—

వెంటనే గిరిధరుఁడు "అయ్యో, రామసింగుగతి చూడుఁడు." అని యఱచుచుఁ బోయి వానికడఁ గూర్చుండి పరిశీలించెను. పలువురు వీథినిఁబోవువారు వచ్చిరి. ప్రసాదరావు వానిని పరీక్షించి "లేదు చావలేదు. డాక్టరును రప్పించుట బాగు" అని యొకభటుని వైద్యునికై పంపెను.

పాపము ! రామసింగు మిగుల శోచనీయస్థితికిలోనై యుండెను. శరీరమునఁ బలుతావుల రక్తధార లేకరీతిగ స్రవించుచున్నవి. అందందు ముండ్లుసూదులు గాఢముగ గ్రుచ్చుకొన్నవి. సాధ్యమైనన్నిటిని వారు తీసివైచి శైత్యోపచారములఁ గావించిరి. ఎంతచేసినను వాఁడు కన్నులు విప్పలేదు. దేహము వెచ్చగ నుండుటను, గుండెలు కొట్టుకొను చుండుటను వాఁడింకను మరణింపలేదని యందఱు నిశ్చయించుకొనిరి. అందువలన వారు మఱింత ప్రయత్నపూర్వకముగ వానికిఁ దెలివి కలిగింపఁ బూనిరి.

ఇంతలో వైద్యుఁడును వచ్చెను. అతనివెంట నందలాలుకూడ వచ్చెను. గిరిధరుఁడు "ఎంతదుర్దినము, బాబూ" అని వారికిస్వాగత మొసంగెను. డాక్టరు రామసింగును బాగుగ పరిశీలించి "అయ్యలారా! వీనికిఁ బ్రాణభయము లేదు. ఘోరధ్వనిచే మూర్ఛిల్లినాఁడంతే. కొంత సేపటిలోఁ దెలివి రాఁగలదు" అని యొకటిరెండవుషధముల నాసికా పుటములయం దూదెను. కొంతసేపటికి రామసింగుకనులు విచ్చిచూచి "అయ్యో-అయ్యో-బాధ-బాధ-" యని యఱవసాగెను. నందలాలు ప్రసాదరావును జరిగినయుదంతమేమని యడిగెను. "నాకేమియుఁ దెలియదు. నేను పరుండఁబోవుచుండఁగా రామసింగు ఫలపుటమని యొకబుట్టను పట్టుకొనివచ్చి మీరు పంపినట్లు తెలిపెను. నేను రెండు పండ్లను మాతండ్రిగారి కిమ్మని చెప్పి నాపడకటింటికిఁ బోతిని. ఇంకను పరుండకమునుపే నాకీబాంబు పగిలినధ్వని యాకర్ణితమయ్యెను. అప్పుడే నేనిటు పరుగిడి వచ్చితిని." అని చెప్పెను. నందలా లద్భుత వీక్షణములతో "ఏమి ! నేను మీకు ఫలములఁ బంపితినా ? నాకా సంగతియే తెలియదు" అనియెను.

రామసింగు మెల్లగా "వాఁడట్లు చెప్పినాఁడు" అనెను.

నంద : వాఁడు తానెవఁడనని చెప్పుకొనెను?

రామ : మీా సేవకుఁడనని.

నంద : మాయింటి సేవకుల నీ వెఱుఁగుదువా?

రామ : చాలమంది నెఱుఁగుదును.

నంద : వాఁడు మాయిఁటివాఁడే యనుకొంటివా?

రామ : అప్పుడు నమ్మితిని. ఇప్పుడు నమ్మను.

నం : ఇది ప్రబలమోసము. ఇన్‌స్పెక్టరుగారి ప్రాణము లపహరింప హంతకులు పన్నిన పన్నుగడయిది. దైవము దయామయుఁడై యీ యుపాయము తప్పించినాఁడు—పలువురు పలురీతుల మాటాడిరి. వెంటనే రామసింగు వైద్యశాలకుఁ గొంపోఁబడెను పరులందఱు వెడలిపోయిరి. తర్వాత తక్కినవారిట్లు మాట్లాడుకొనిరి.

వే : ఇది మోసమనుట స్పష్టము.

నంద : ఈవిధముగఁ జేసినవా రెవరై యుందురు!

వే : అబ్దుల్ రజాకో, యిస్మాలో యని తోఁచుచున్నది. ప్రస్తుత మీా పురమునందు నావిరోధులు వారేకదా.

అజీ : దుండగీండ్రందఱును బోలీసువారి శత్రువులే!

గిరి : రామసింగు వానిని లోపలికిఁ దీసికొనిరావలసినది.

వే : వాడంత సూక్ష్మగ్రాహి కాఁడు. అమాయకుఁడు. ఎట్లయిన నీ సంగతులు హంతకులు పట్టువడినప్పుడు తెలియకపోవు.

నంద : ఇది రజాకునిపనియే కావచ్చునని తోఁచుచున్నది. వాఁడు స్థలాంతరమున కేగుట కల్ల. వాని సేవకుఁడు మాతో నన్నృతము లాడెను. రజా కింటనే యుండవచ్చును. ఇప్పుడే వానిగృహశోధన గావించి వానిని బంధించుట మేలు.

వేణీప్రసాదు యోచించెను. గిరిధరుఁడు నందలాలుతో నేకీభవించెను. అజీజుఖాడ సమ్మతించెను.

నంద : ప్రసాద్‌జీ ! ఇంకను నాలోచించుచుంటిరేల ? మిమ్ముఁ గొట్టినసేర మొకటిచాలదా వానిని బంధించుటకు ?

వే : మఱేమియు లేదు. వాఁడింట నుండునా యని యోచించు చున్నాను.

నంద : పోయి చూచినఁ దెలియును. ఒకవేళ నింట లేకున్న ననుమానమైన తావులందెల్లఁ బరిశోధింతము. నిక్కముగ నీ బాంబును రజాకేపంపినచో వాఁడూర నుండకపోఁడు.

వీరిట్లు మాటాడుకొనుచుండఁగనే మఱియొక సేవకుఁడు పరుగున వచ్చి "స్వామీ, మనరామసింగు బాధ కాగలేక మరణించె" నని తెలిపెను. ఆ మాటల నాలకించి యందఱు మిగుల కటకటపడిరి. నందలాల్ గిరిధరప్రసాదాదులు వెంటనే వైద్యశాలకు పోయిరి.

# పదునాఱవ ప్రకరణము

## రజాకు మోసము

ఆయపరరాత్రియందు ప్రకృతికాంత నిశ్శబ్దముగ నుండెను. ఆకాశ లక్ష్మి యామెను మాటాడింప యత్నించుచుండెను. సుమా రొంటి గంట కావచ్చినది—పార్కురోడ్డుమీఁద కొందఱు పురుషులు నడచి పోవుచుండిరి. అందులో నొకఁడు మనవేణీప్రసాదరావు. రెండవవాఁడు నందలాలు. తృతీయుఁడజీజుద్దీను. తక్కినముగ్వురు రక్షకభటులు. అందఱును మౌనముతో నడచుచుండిరి. వారారాత్రి మాటాడు కొన్నట్లు రజాకుమందిరమును ముట్టడించి వానిని బంధింపఁబోవుచున్నట్లు

స్పష్టమగుచుండెను. కొంతసేపటి కందఱునువచ్చి యబ్దుల్లా గృహ ప్రాంగణమున నిలిచిరి. ద్వారములు మూయఁబడియుండెను. కాని లోపల బంధింపఁబడియుండనందున వారు దానిని తెఱచుకొని గృహా వరణమున ప్రవేశించిరి. చావడిలోఁ గొందఱు సేవకులు పరుండి నిదు రించుచుండిరి. అంత నందఱు వసారాలోనికేగి పరిచారకులను లేపిరి. వారును తొందరతో లేచి, పోలీసువారిరాక కాశ్చర్యచకితులై చూడ సాగిరి. వేణీప్రసాదు వారిలో నొకనినిగాంచి "ఓరీ! మీయజమానుఁ డింట నున్నాఁడా?" అని యడిగెను. వాఁడు వడఁకుచు మాటాడ లేదు. ఊరక వారినందఱి నెగాదిగచూడసాగెను. ప్రసాదరావు విద్యు ద్దీపికను వెలిఁగించి వానిముఖలక్షణములచూచి "ఏమిరా! అట్లుచూచె దవు. నామాట వినఁబడదా. రజాకుసాహేబింటనున్నాఁడా?" యని మరల ప్రశ్నించెను. వాఁడు కంపితగాత్రముతో మొదట "ఊ—ఊ" యని యంతలో మార్చి "లేఁడు. లేఁడు. మహారాజాజ్" అనెను. చచ్చెనని తలంపఁబడిన ప్రసాదరావిపుడు కాలయమునివలె వచ్చుటను జూచి వాఁడు తల్లడిల్లిపోయెను. వానితొందరపాటునుగాంచి రజాకింట నుండెనని యందఱు తలంచిరి. అప్పుడు నందలాలిన్‌స్పెక్టరును జూచి "అయ్యా! వానినడిగెదరేల? లోపల నెవరున్నారో పిలువరాదా" యనెను. రక్షకభటుఁడు వెంటనే తలుపునుదట్టుచు "అయ్యా, అబ్దుల్ రజాక్! అబ్దుల్‌రజాక్!" అని యఱచెను. ఎంతపిలిచినను ఎవరును తలుపులను దీయలేదు. అప్పుడు వెలపలనున్న మఱియొక సేవకుఁడు "అయ్యా, ఎందు కఱచెదవు? అతఁ డూరలేఁడు" అనెను,

వే: ఏయూరికిఁ బోయినాఁడు.

సేవ: బరోడాకు.

వే: ఏల?

సేవ : నాకేమి తెలియును ?

వే : ఎప్పుడు పోయెను.

సేవ : నిన్న సాయంకాలము—కాదు —ఉదయమున—కాదు కాదు. స్వామీ, యీదినం తెల్లవారి—ఊఁఊఁ.

వానిమాటల కందఱు నవ్విరి.

వేణీప్రసాదు వానిని తట్టుచు "ఏమిరా, నిద్దురమత్తు వీడలేదా? నన్ను మఱచితివా ? నిన్నరాత్రి జరిగినగందరగోళమును స్మరించు కొనుము. నేను చచ్చితినని తలంచితిరి కాఁబోలు. మిమ్ముమ్రవిడిచి నేనెట్లు చత్తును. మరల బ్రతికినాను. సత్యమును నచింతువా, లేదా ? పశువా" యని గర్జించెను. వాఁడును మరలబమ్మెరపోయి "ఏమి—నే—నే—నబద్ద—ము—మి—లా—లాడు చు—చున్నానా. స్వామీ, బరో—రోడాకు పో— పోయినా—నాడు." అనెను. "ఎప్పుడుపోయినాఁడు ?" అని మరల ప్రశ్న—"నిన్న—రా—రాత్రి" యని జవాబు.

వే : నిన్న రాత్రి నన్ను చుట్టుముట్టి కొట్టువఱ కిందే యుండెనే, ఇంకెప్పుడు పోయెను !

వాఁడు నిరుత్తరుఁడై యూరక చూడసాగెను.

నంద : ప్రసాద్ జీ ! వీఁడే నేఁటియుదయమున మాతోఁగూడ రజాకు బరోడాకుఁ బోయెనని కల్లలాడినది. ఏమిరా ! ప్రొద్దుననే మేము మీయింటికి రాలేదా ?

సేవకు : (చూచి నిదానించి)—ఊఁ—వచ్చియుంటిరి.

వే : వీఁడు నన్నుఁ గొట్టినవారిలో నొకఁడు. వీనిని బంధింప నగును. తక్కినసంగతులు వీని నడుగుటేల ! తలుపు బ్రద్దలుకొట్టి లోపలఘూరి దొంగను పట్టవచ్చును.

అనుచుండఁగనే యింటితలుపులను దెఱచుకొని యొకవృద్ధుఁడీవలకు వచ్చి యందఱికిని సలాముఁజేసెను. వేణీప్రసాదాదు లతని వినయగౌరవాదులఁ గాంచి యెవ్వఁడై యుండునా యని విస్మితులై చూచిరి. అతనిఁ గాంచి ప్రసాదరావు "అయ్యా! అబ్దుల్ రజా కింట నున్నాఁడా?" అని యడిగెను. ఆతురుష్కుఁడు సవినయముగ "నాది యహామ్మదాబాద్. రజాకు నామేనల్లుఁడు. నేనీ మధ్యాహ్నమె వానిఁ జూచుటకు వచ్చితిని. రజాకుతోఁ బోలీసువారి కేమిపని?"

వే: కలదు. లోపల నున్నాఁడా?

వృద్ధుఁడు: మేడపై నిద్రించుచున్నాఁడు. పిలువనా!

వే: నీ పేరేమి?

వృ: నాపేరు మీర్జుమ్లాఖాన్.

అంతలో నజీజుద్దీ నడ్డువచ్చి "అయ్యా! తామేనా మీర్జుమ్లాఖానుగారు?" అనెను.

మిర్జు: అవును. నీవెవరవు? నీకుఁ బోలీసులదుస్తులు లేవే!

అజీ: లేవు. నేను రక్షకభటుఁడనుకాను.

మి: మఱియెవ్వరవు? నన్నెందు చూచితివి?

అ: నేను తాజుద్దీన్ కుమారుఁడను, పోలీసు—

అనునంత వాఁడు రిచ్చపడి చూచి "ఆహా! నీవా నాయనా! అజీజుద్దీనుకదా నీపేరు! పాపము! మీతండ్రిగారిదుస్థితి నేఁడు మారజాకువలనఁ దెలిసినది. తాజుద్దీను సుగుణనిలయుఁడు. మేమిరువురము చిన్ననాఁటి సహాధ్యాయులము. నీకు నాపరిచయములేదు. నీవుపుట్టిన రెండుసంవత్సరములకే నేను కుటుంబముతో నహామ్మదాబాదునకు వెళ్లిపోయితిని. అప్పుడే యెంతవాఁడవై తివిరా నాయనా." అనియేదో పురాణమును జెప్పసాగెను.

అ: మీపేరు వింటిని. రజాకు మీసంగతి చెప్పియుండెను.

మాటలతో కాలము గడచుటఁగాంచి వేణీప్రసాదు "అయ్యా! మిర్జమ్లా! రజాకుడు బిలువుము. మేము పోవలయును." అనెను.

మి : అతనితో మీకేమిపని? ఏదైన నేరముచేసినాఁడా?

వే : అతఁ డొక నేరములో సాక్షిగా నున్నాఁడు. అతనిసాయమున మేమపు డపరాధుల బంధింపవలయును.

మి : అట్లైనసరి. రండు. ఆ ప్రక్కగదిలోఁ గూర్చుండుడు. నేను రజాకును దోడ్తెచ్చెద.

వే : సరి. అట్లే కానిమ్ము.

అని వేణీప్రసాదు తనయనుచరులతో గదిలోని కేఁగెను. అచటికి బహిర్ద్వారము కాన్పింపదు. వృద్ధుఁడు లోపలికిఁ బోయినట్లే పోయి మరల వారికిఁ గానరాకుండ వచ్చి వెలుపలిద్వారమును దాఁటి పారిపోయెను. ఎవరును చూడలేదు. ఆహా! అతఁడెవఁడు? — అబ్దుల్‌రజాకే! పోలీసువారికంట దుమ్ముచిమ్మి పారిపోవుచున్నాఁడు!

నిమిషము దాటెను—అరగంట దాటెను. మరల నావృద్ధుఁడగు మిర్జమ్లా రాలేదు. అబ్దుల్లాకూడ రాలేదు. పరస్పరముఖావలోకనఁ గావించుకొనిరి. కారణ మందఱికిని దురూహ్యముగా నుండెను. అంత వేణీప్రసాదాయింటిపరిచారకుని గాంచి "ఓరీ, నీవు మేడమీఁదికి పోయి మీరజాకును, మిర్జమ్లాను శీఘ్రముగఁ దోడ్కొనిరమ్ము." అనెను. వాఁడు నవ్వి "రజాకూరలేఁడు స్వామీ" అనెను. ప్రసాదరావు కోపముతో "ఛీ! మూర్ఖా! అబద్ధములఁ బ్రేలకు. ఆవృద్ధుఁడు చెప్పలేదా రజా కింట నున్నాఁడని?" అనెను.

సేవ : ఆ వృద్ధుఁడెవఁడో నాకుఁ దెలియదు.

వే : ఏమి, నీకాసంగతియే తెలియదా? మీయజమానుని మేనమామకాఁడా?

సేవ : నేనిదివఱ కాతని జూడలేదు. మీరు చూచినప్పుడే నేనును జూచితిని. రజాకునకు మేనమామ యుండెను. కాని యాతఁడు బహుకాలమునుండి యీప్రాంతములకే రాలేదు.

అజీ : ఆ వృద్ధుఁడు మిర్జుమ్మా కాఁడా ?

సేవ : కాదు. అబ్దుల్ రజాకే మిమ్ము వంచించి పారిపోయినాఁడు.

అనవుఁడంద ఱొక్కమా రాశ్చర్యచకితులై "ఆ—ఆ" అనుచు లేచిరి.

వే : అతఁ డబ్దుల్ రజాకేనా ? నిజము చెప్పుము.

సేవ : అవును. నేనాతని గుర్తింపలేకుందునా ? ఎన్నిమాయలు పన్ననను మేముమాత్రము గుర్తింతుము.

నంద : అయిన నప్పుడే మాకేల తెలుపలేదు ?

సేవ : యజమానుని రహస్యములను బయటపెట్టు ద్రోహు లుందురా స్వామీ ?

అందఱు నివ్వెరపోయి యొండొరులఁ జూచుకొనుచు నిలుచుండిరి. తోడనే నందలాలుసలహాపై నందఱు మేడమీఁదికేఁబోయిరి. ప్రతిస్థలమును వెదకిరి. రజాకును పేరుపెట్టి పిలిచిరి. కాని యబ్దుల్లా మాత్ర మెందును గానరాలేదు. వారింగాంచి సేవకులు "అయ్యలారా ! ఎందుకీనిరర్థక శ్రమ. మీరు రజాకును బట్టలేరు." అనెను. క్రమ్మకొని వచ్చుచున్న కోపానలముచే భగ్గున మండి వేణీప్రసాదు వారిని గొట్టుచు "పద్మాషులారా ! మీరు మొదటనే తెలుపరైతిరేల ? ఇప్పుడైనఁ జెప్పుఁడు. వాఁడెందు దాగినాఁడో ! " అని యార్భాటించెను. సేవకులు జంకలేదు. ధైర్యవిహీనులు కాలేదు. "మాకుఁ దెలియదు, మాకుఁ దెలియదని" యందఱు బదులుచెప్పిరి.

వే : ఊ— తెలియదా ? మిమ్మందఱినిఁ జిత్రహింసఁ గావించి నపుడు మీరే చెప్పఁగలరు. భటులారా ! వీరిచేతులకు సంకెళ్ళనుఁ దగిలించి కారాగారమున బంధింపుఁడు.

సే : చిత్తము. మీయిష్టము. కాలాహికూపమునఁ ద్రోసినను బ్రతికియుండఁగా మా యజమానునివార్త మానోటినుండి వినఁజాలరు.

వే : రజాకుబిడ్డ యెందున్నది ?

సేవ : ఆమె యూర లేదు. సాయంకాలము తనబంధుగుల యొద్దకు బొంబాయి పంపఁబడినది.

వేణీ : రజాకు దూరమాలోచించినాఁడు. ఎట్టిగందరగోళము పుట్టునోయని ముందే జాగ్రత్తపడినాఁడు.

సేవ : అవును. మీవలె నతఁడు మూర్ఖుఁడు కానుఁ.

వేణీప్రసాదు మరల కోపోద్రిక్తతచే వానినితన్నను. కాని యేమి ప్రయోజనము ? " ఓరీ ! రేపుమీకుఁ దగినశాస్తిఁ గావించెదను. రజాకు మాయెదుటనే పారిపోయెను. వాని నింతటితో విడువను. ఇపుడా దురాత్ముఁ డెందుండునదియు నాకుఁ దెలియును. వాఁడట దొరకఁ గలఁడు. " అనెను.

సేవ : ఎందు దొరకుననుకొన్నారు ?

వే : ఎందా ? నీకుఁ దెలియదా, గాడిదా ! వాఁడిపుడు ముక్టాజ్ జులియాయింటనుండును నందలాల్ జీ ! రండు. మనము త్వరగా నటకుఁ బోదము.

నంద : ముక్టాజ్ జులియా యెవరు ?

వే : వానియుంపుడుకత్తె.

నంద : అది మీకెట్లు తెలిసెను ?

వే : ఆ చరిత్ర నిన్ననే కనుఁగొంటిని. రండు.

అని యందఱితోను వెలుపలికి వచ్చి యాయింటికి తాళము వేసెను. పరిచారకులందఱు చెఱసాలకుఁ గొంపోఁబడిరి.

# పదునేడవ ప్రకరణము

## గణికా గృహము

అహమదునగరున నితరస్థానములందువలె జులియామందిర ప్రాంగణముకూడ నిశ్శబ్దముగనుండెను. వెలుపలనెవఁడో యాయింటి సేవకుఁడు కట్టపైఁ బరుండియుండెను. లోపలిసంగతి మనకుఁ దెలియదు. సుమారు రెండుగంటలు దాటియుండవచ్చును. అప్పుడు ముప్వురు పురుషులు వచ్చి ముంగిటనిలఁబడిరి. వారాలోచించుకొనుచు కొంతకాలము నిలిచియుండి తర్వాత నచ్చట పరుండియున్న పరిచారకుని లేపిరి. వాఁడు నిద్దురబద్దకముచే కన్నులు నులిమికొనుచుఁ చిరాకు నొందుచు "ఎవరయ్యా, మీరు?" అని యడిగెను. అప్పు డందులో నొకఁడు "మేము దక్షిణదేశీయులము, ఇదిమాకుఁ గ్రొత్తతావు. తలదాచుకొనుట కనువగుస్థలములేక యీ వేశ్యామందిరమునకు వచ్చినాము. మీ బీబీని చూడవలయును." అనెను. వాఁడు విస్మితుఁడై "మీ రెన్నఁడును బోగమిండ్లకు వచ్చినవారివలె లేరు. వేళకాని వేళలో నీ కోరిక యేమి? ఇపుడుకాదు, రేపు రండు" అనెను.

పురు : భాయీ! నీపేరేమి?

సేవ : నన్ను ఫీరూభక్షందురు. లోపలబీబీ యన్యులతోనున్నది.

పురు : అన్యు లనఁగానెవరు?

సేవ : ఎవరోయొకరు. అదంతయు మీకేల?

పురు : హిందువులా ? మహమ్మదీయులా !

సేవ : ఎవరోయొకరు. పొండు. పొండు.

అని మరల ముసుగువైచుకొనెను. ఆ పురుషులును చేయునది లేక సర్వజనసమ్మోహినియగు ధనదేవిసాయమున వానిని లోబఱచుకొనం దలంచిరి. అప్పుడు మొదటిపురుషుండే ఫీరూభక్షును లేపి "భాయీ ! బోగమింటిపరిచారకుల కీబిగువు తగునా ? పట్టుము." అని వానిచేతిలో నొకవెండిరూపాయ్యముంచెను. "ధనమూలమిదంజగ" త్తనికదా పెద్దలు చెప్పిరి. ఫీరూభక్షు దానిని కన్నులవఱకెత్తి చూచి నవ్వెను. అది కాంచి యీ పురుషులు వాండిఁక తమకు లొంగెనని నిశ్చయించుకొనిరి.

ఫీరూ : అయ్యా ! మీరు నాకు మహోపకారమును జేసితిరి. కాని నేను మీకెట్లు చేయఁగలను ? ఇప్పుడు లోపలికేగుట కనుకూలము కాదు.

పురు : నీసాహసముకొలఁది పాటుపడవలయును. ఫీరూ ! లోపల పురుషుఁ డింకెవఁడో యున్నాఁడంటివే. అతఁడింకను నున్నాఁడా !

ఫీరూ : ఉన్నాఁడనియే యోచించుచున్నాను.

పురు : అతఁ డుండ మీబీబీ పరులను రానిచ్చునా ?

ఫీరూ : ఎట్లురానిచ్చును. అతఁడామె ప్రియుఁడు.

పురు : అతఁడు హిందువా ?

ఫీరూ : కాదు. మహమ్మదీయుఁడు.

పురు : ఎంతసేపైన దతఁడువచ్చి ?

ఫీరూ : ఒకయరగంటయై యుండును.

పురు : అతనిపేరేమి ?

ఫీరూ : అబ్దుల్ రజాకు.

పురు : ఫీరూ ! లోపలికేగుట కవకాశము దొరకునేమో చూడుము.

ఫీరూంభ క్షేదియో యోచించుచుండెను. ఇంతలో లోపల నెవరో గుసగుసమాటాడినట్లు కనిపెట్టి వాఁడు "తాళుఁడు. లోపల నెవరో లేచినారు. నేను పోయి సమాచారమును దెలిసికొనివత్తును" అని లేచి చిన్నగ తలుపుఁ దట్టెను. ఎవరును మాటాడలేదు. మరల తలుపుచఱచగా చిన్నగ తలుపు తెఱవఁబడెను. తోడనే 'రయొకయువన విలాసిని' వారికిఁ బ్రత్యక్షమయ్యెను. ఆమె ఫీరూంభక్షును గాంచి "ఏమి రాపని ? ఏటికి తలుపు దట్టితివి ?" అని యడిగెను. ఫీరూ వినయముతో "అమ్మా ! క్షమించవలెను. తమకు నిద్రాభంగ మైనదేమో. నేను మీకొఱకు తలుపుఁదట్టలేదు. బుడన్ షాహితోఁ బనియుండెను." అనెను.

సుందరి : సరి. నీతల. నీకెప్పుడు నీరోగమే. వీరెవరు ?

ఫీరూ : ఈ పెద్దమనుష్యులు బీబీగారిని చూడవచ్చినారు.

ఆ తురుష్కకాంత మేలిముసుఁగు సవరించుకొని యాపురుషులను దిలకించి "ఎవరయ్యామీరు ?" అని యడిగెను.

పురు : మాది దక్షిణదేశము.

సుంద : ఇందు తమకేమిపని ?

పురు : ఇది వారాంగనామందిరము కదా. ఇట్టి తావులందఱికి నేమిపని యుండునో మాకును నదియేపని.

సుంద : అయిన నిది సమయము కాదు. రేపు రండు.

పురు : డబ్బు దొరకుచున్నప్పుడు మీబోటివారు సమయాసమయములు లెక్కింపరాదు. జలియాబీబీ నీకేమి కావలయును ? ఆమెను మేము చూడవలయును.

సుంద : ఆమె నిద్రించుచున్నది. ఇప్పుడు రాదు.

పురు : ఎట్లయినను మా కాసుందరిదర్శనమును జేయించుము. నీశక్తి సామాన్యమైనదా.

సుంద : నాపరిచయమే నీకు లేదుకదా యిప్పుడే నాశక్తి నెట్లు గ్రహించితివి ? మంచి గట్టివాఁడ వయ్యా. నీకు పోలీసు వారికున్నంత సూక్ష్మబుద్ధి యున్నది. అయిన రండు లోపలికి, ఫీరూ ! నీవిందే యుండుము.

ఫీరూ : చిత్తము.

సుందరి తలుపులను యథారీతి బంధించి వారిని లోపలికిఁ గొంపోయెను. వారు సౌధమునలు ప్రక్కలు పరిశీలించి చూచుచు నామె ననుసరించుచుండిరి. అందందు కొందఱు పరిచారకులు పరుండి నిదురించుచుండిరి. సుందరి వారి నందఱిని రెండవమేడలోనికిఁ గొంపోయి సొంపగునాసనములపైఁ గూర్చుండఁబెట్టి "అయ్యా ! మీరు హిందువులేకదా ?" యనెను.

పురు : నీకెట్లు కనఁబడుచుంటిమి ?

సుంద : సరి. మీరు హిందువులేలెండు. మీపేరేమి ?

పురు : నాపేరు పురుషోత్తమదాసు. ఇతనిపేరు లక్ష్మాజీ. ఆపెద్ద మనిషి దామోదరనాథుఁడు.. నీపేరేమి ? నీవు బీబీ కేమికావలెను ?

సుంద : "నే నామె మేనత్తకుమార్తెను. నాపేరు రోషినారా. మీరిందే యుండుఁడు. నేను పోయి యామె యేమిచేయుచున్నదో చూచి వచ్చెద." అని పైమేడమీఁదికిఁ బోయెను.

పాఠకమహాశయా ! ఆ మువ్వురుపురుషు లెవ్వరనుకొంటివి ? పురుషోత్తమదాసని చెప్పుకొన్నపురుషుఁడు మనవేణీప్రసాదే. తక్కిన యిరువురు రక్షకభటులు. కాని వారు విటులుకారు. అబ్దుల్ రజాకు నన్వేషించుచు నటువచ్చినారు. ఆ యపరాధి యిందుండుననితలంచియే

వచ్చిరి. రోషినారా కాసంగతి యేమి తెలియును ? గోముఖవ్యాఘ్రము లను గోగోష్ఠమునఁ దోలినది. వారు తీక్ష్ణదృష్టులతో నామందిరము నంతటిని బరిశీలించుచుండిరి. వేణీప్రసాదు మనోదృష్టులుమాత్ర మొకచో నుండక యీయిల్లంతయుఁ దిరుగుచుండెను. వారు మిగుల జాగరూకతతోనే యుండిరి. చుట్టుప్రక్కల నేవ్యక్తి యగపడినను బరిశీలించుచుండిరి. రజాకెం దుండెనని చూచుచుండిరి. రోషినార తమ్మెనుమానింపకుండ ప్రయత్నపూర్వకముగ తమసహజవేషభాషల మరుగుపుచ్చుచుండిరి. ఇంతలో రోషినార "ఆర్యులారా ! తడవైనది క్షమింపుఁడు. మా జులియాకు మీరాకను వినిపించినాను, ఇప్పుడే రాఁగలదు." అని యొయ్యారముతో వచ్చి కూర్చుండెను. వెంటనే సేవకులు వెండిపళ్లెరములలో తాంబూలద్రవ్యములను దెచ్చి వారి యెదుటఁ బెట్టిరి. వానిని సేవింపుఁడని రోషినార బతిమాలెను. కాని మొదట నెవ్వరును ముట్టరైరి.

రోషి : ఏమి, మీకీతాంబూలములు రుచింపవా ?

వే : రుచింపకేమి ?

రోషి : మీరందఱు నొక్కస్థలమువారేనా ?

వే : కాదు. వ్యాపార మొక్కటేకావున మాకు జతకూడినది.

రోషి : మీ వ్యాపారమేమి ? .

వే : మేము రత్నవర్తకులము.

రోషి : మాబీబీకి రత్నములు కావలెను అమ్మెదరా ?

వే : విక్రయించుటేల ? జులియాకటాక్షవీక్షణలకు మెచ్చి మే మా మెకొక్కొక్క రొక్కొక్కరత్నమును బహూకరించి పోఁగలము,

రోషి : మంచిది అదే యుదారబుద్ధి. అట్టివారి కిది స్వర్గము.

వే : ఏదీ మీయజమానురా లింకను రాలేదేమి !

రోషి! మఱియొకమారు చూచివత్తును. మరల పరుండెద నేమో.

అనుచు నాసుందరి మరల మేడమెట్లెక్కి పోయెను. ఈసారి వేణీప్రసాదు తిన్నగ కూర్చుండుట కిష్టపడక రోషినార వెడలిపోయిన మార్గమున ననుసరించి పోవుటకు వెలుపలికి వచ్చెను. అందు పైకి పోవుటకు మూడునాల్గు త్రోవలు కలవు. అతఁడు తనకుఁ దోఁచిన మార్గమును బట్టి మెట్లెక్కి పోసాగెను. అంతలో నదేత్రోవను రోషి నార దిగివచ్చుచు "ఎచ్చటికి వెళ్ళుచున్నారు! రండు. రండు, బీబీ వచ్చుచున్నది" అనెను. ప్రసాదరావు వెనుదిరిగి "కట్టడ మతిరమణీయ మైనది. అంతయుఁ జూచిపోదమని వచ్చితి" ననెను. "తరువాత చూపింతును. ఇప్పు డామెతో మాటాడుదురుగాక రండు" అని రోషినార యతని యథాస్థానమునకుఁ గొనివచ్చెను.

వే: బీబీ యేమి చేయుచున్నది?

రోషి: ముఖము గడుగుకొనుచున్నది. అలంకృతమై యిప్పుడే వచ్చును.

వే: మీ యజమానురాలికడ నింక నెవరైన నున్నారా!

రోషి: ఎవరును లేరు. అయ్యో! అప్రశంశ మీకేల?

వీరిట్లు మాటాడుకొనుచుండఁగనే యాగదిలోనికి తుణప్రభ వలె నొకసుందరీమతల్లి వచ్చెను. ఆమె నేత్రములశ్రుప్రపూర్ణములై యుండెను—ఆముద్దు మొగమున కదియొకసొగసు. పోలీసువా రాని శ్యామోహినినిఁ గాంచి ముంటాజ్ జులియాబీబీ కావచ్చునని తలంచిరి. నిక్కముగనా మెయే.

ఆమె గదిలోనికివచ్చి యందరికి నమస్కరించి "మహాశయు లారా! తాము నన్నిట్లు వంచింపఁదగదు. మీరు మోసగింపఁదలంచి నవా రెందు లేరు. మీమీరూపములతో స్వస్థానమునకుఁ బోవచ్చును!"

అని దీనాననయై పలికెను. వారు విస్మితులై పోయిరి. ఎవరును మాటాడ లేదు. వారి హృద్భావములు ముఖములపై విస్పష్ట మగుచుండెను. జులియాపరల "అయ్యలారా! మీసంగతినాకుఁ దెలియదు. పోలీసు వారికిట్టి రూపములు క్రొత్తలుగావు. నేనపరాధిని గాను. అపరాధి వేఱు. మీరాతనికై పోవచ్చును. అతఁ డిందు లేఁడు." అనియెను.

ఆస్త్రీ యంతవిచ్చలవిడిగ మాటాడుచుండ తాము మౌనమును వహించి కూర్చుండుట బాగుకాదని ప్రసాదరా వెట్టకేలకు సుందరీ! మమ్మెవరినిగాఁ దలంచితివి?" అనెను. జులియా నవ్వుచు "నాకం తయుఁ దెలిసినది. మీరు వేణీప్రసాదరావుగారు కాదా? వీరు రక్షక భటులు. మీరబ్దుల్ రజాకు నన్వేషించుచు నిచ్చటికి వచ్చితిరికాదా?" యనెను. మనయపరాధపరిశోధకుల విస్మయావస్థ కంతమే లేదు.

వే: నీకింతయు నెవరు చెప్పిరి? రజాకిట నున్నాఁడా?

జులియా: లేఁడు. వచ్చి పోయెను. నాకతఁడే మీవిషయము నంతను చెప్పి తుదకు నాతోఁ గలహించి విడలిపోయెను.

వే: నీమాటలు చిత్రముగ నున్నవి. అబ్దుల్లాకు మాసంగతి యెట్లు తెలిసెను? అతఁడు నీతోనేల తగవులాడెను? ఇపు డెందేగెను? బీబీ! చెప్పుము? నీకేమియు భయము లేదు.

ముంటాజ్ కన్నులనీరునిండ "అయ్యా! రజాకునకును నాకును నేస్తమబ్బి బహుకాల మైనది. అతఁడు నాకై యెంతోధనము నిచ్చెను. నేను నతనినింతదాఁక నానందాబ్ధి నోలలాడించితిని. కాని యతఁడీ నడుమ నేవో కొన్ని మహాపరాధములఁ గావించి నేఁడు నన్నుఁ గూడ మహాపరాధినిఁ గావింప యత్నించెను. కాని నేనాతనివలలోఁ జిక్కక కష్టములనుండి గట్టెక్కితిని. లేకున్న నీసరికి జులియా కూడ నిందితురాలై పోవలసినదే" అనియెను.

వే : తానట్టినేరములఁ గావించినట్లు రజాకు నీతోఁ జెప్పెను ?

జులియా : అంతదూరము నాకుఁ జెప్పలేదు. తన్నుఁ బట్టుటకు మీరు వచ్చినట్లు గ్రహించి మీసంగతి నాతోఁ జెప్పెను.

వే : మాసంగతిని వాఁడెట్లు కనుఁగొనఁగల్గెను ?

జులియా : అయ్యో ! రజాకును సామాన్యునిగాఁ దలంచితిరా ? అతఁడు మీవంటివారి నెందఱినో వంచించినవాఁడు. రెండుగంటలకు ముందు మీరాతని స్వగృహమునందే బంధింపఁబోయియుండిరఁట కాదా ?

వే : ఆ సంగతి నెవరుచెప్పిరి ?

జులియా : అతఁడే. మిమ్మెట్లో మోసగించి యిచ్చటికి పారి వచ్చి నాతోనంతయును దెలిపి మీరిటకుకూడ రాక విడువరని యూహించి నాతోఁగూడ మేల్కొని వీథిలో నెవరుమాటాడినను కిటికీకడకు వచ్చి తొంగిచూచుచు నొకవేళ మీరు వచ్చిన పాఱి పోవుటకుఁ దగినసన్నాహములఁ గావించుకొని యుండెను. ఇంతలో మీరువచ్చి వెలుపల మాటాడుచుండ జాలకమునుండి చూచి వెళ్లిన మిమ్ము లోపలికిరప్పించి గొప్పహాని జేయువలయునని యీసంగతి నాతోఁ జెప్పెను. నేను మొదట వానిమాటల కెదురాడలేక మారోషి నారాను బంపి మిమ్ము లోపలికి రప్పించితిని. తాముచూడలేదు కాని రజాకుమాత్రము మీరు రోషినారాతో సంభాషించుకాలమున ప్రక్క గదిలో దాగి గవాక్షముగుండఁ గాంచి మీసంగతి తెలిసికొని నాతోఁ జెప్పెను. మిమ్ముఁ గడతేర్చుటకై నన్నుఁగూడ తనమాయోపాయమునఁ బొల్గొన బలాత్కరించెను. కాని దైవయోగమున నప్పటికి నాబుద్ధి తిరిగిపోవుటచే నొక్కమారు వానిపైఁగల ప్రేమయంతయుఁ బోయినది. అతఁడు నిందితుఁడనియు దురాత్ముఁడనియు నెఱింగి

యతని యాలోచనతో నేకీభవింపక తీవ్రముగ లోలోనఁ గలహించి తిని. అందుపై నతఁడు మహోగ్రహముతోఁ దిన్నగ దొడ్డివాకిలిగుండ నెందో పాఱిపోయెను.

వే : రజాకు తిన్నఁగ నింటికే పోయి యుండునా?

జులియా : ఆసంగతి నెట్లు చెప్పఁగలను ?

వే : ఇంతలోఁ బట్టణమును విడుచుటసాధ్యపడదు. తనయింటికిఁ గూడఁ బోయియుండఁడు. నీవు రజాకుపారిపోవునపుడు వెంటనే మాకేల తెలుపవైతివి ?

జులియా : ఇన్నాళ్లదాక నతని ప్రేమించినదాననగుటచే నిప్పుడు చేతులార మీకప్పగింపఁజాలనైతిని. అపరాధియని విన్నతర్వాత త్రోసిపుచ్చితిని. ఇఁక నెన్నఁడును రానియ్యను.

వే : మంచిపని చేసితివి. లేకున్న నీవుకూడ మాచేఁ బట్టువడి కష్టములకు లోనైయుందువు. జులియా! నిన్నుఁ గొన్ని ప్రశ్నలడుగఁ దలంచితిని. నీవు రజాకును ద్వేషింతివిగదా! కాన నిక్కముదాపక వచింపఁగలవా ?

జులి : అడుగుఁడు !

వే : రజాకునకుముందు నిన్నెవ్వరును జేపట్టలేదా ?

జులియా : (ఊరకుండును.)

వే : చెప్పుము. దాఁపకుము. రజాకు నీవుతలంచినదానికన్నఁ బదిరెట్లు పాపుఁడు. వానిదౌష్ట్యము బయలుపడినప్పుడు నీవెట్టి కాల రాక్షసుని చెట్టఁబట్టితివో విశద మగును. నీకు తాజుద్దీన్‌ఖానుతో స్నేహములేదా ?

జులియా : (విస్మయముతో)—ఆసంగతి నెవరు చెప్పిరి ?

వే : ఒకరు చెప్పుటేమి? సంగతులు తెలియువఱకును మేమువదలు దుమా. ఎట్లో యాసమాచారము తెలిసినది. అది నిజమా? కాదా?

జులియా : నిజమే.

వే : నీకుఁ దాజుద్దీనుపైఁ బ్రేమ యుండెనా ?

జులియా : లేకేమి. అతఁడు నాకుఁ జిరకాలపరిచయుఁడు. అతని యనుగ్రహమే నాయీభాగ్యమంతయును. అతఁడు వృద్ధుఁడగుటచే నప్పుడప్పుడు చిరాకు నొందుచుండెను. అయినను నేను త్రికరణశుద్ధిగ నతనిని గౌరవించుచుంటిని.

వే : పిమ్మట నెన్నేండ్లకు రజాకు సంబంధము చేకూరినది ?

జులియా : సుమారు రెండేండ్లకు.

వే : నీ వతనినిఁగూడ బ్రేమించుచుంటివా ?

జులియా : చిత్తము. మొదటనే చెప్పితినే యాసంగతిని ?

వే : రజాకుతోఁ జెలిమిసంఘటిల్లిననాఁటినుండి నీవు తాజుద్దీనును ద్రృణీకరించుచుంటివన్న మాట ?

జులియా : ఆమాట నెవరనిరి ? అట్లు తలంపకుఁడు. తాజుద్దీనుపై నాకెన్నఁటికిని గౌరవప్రేమలు తగ్గలేదు. నాహృదయము నిరువురికిని సమముగఁ బంచిపెట్టితిని.

వే : తాజుద్దీనునకుఁ దెలియునా రజాకు మీయింటికి వచ్చు చుండుట ?

జులి : మొదట తెలియదు. క్రమముగఁ దెలిసికొని నన్ననేక భంగుల దూషించెను. అయినను రజాకును దొంగతనముగా నైన మాయింటికి రానియ్యకుండ నుండనైతిని.

వే : తాజుద్దీనెన్నఁడైన నీనిమయమై రజాకుతోఁ గలహించెనా ?

జులి : నేనట్టిదాని నెన్నఁడు నవకాశ మియ్యలేదు. కాని యొకనాఁడు నేను జ్వరపీడితనై యుండ వారు కఠినముగ వాదులాడి రనియు. బలిష్ఠుఁడగురజా కావృద్ధుని బడఁదన్ని పోయెననియు. సంతలో

సేవకులు తాజుద్దీనున కుపచారముఁ జేసి యింటికిఁ బంపి రనియు మారోపింపారావలన వింటిని. అది మొదలు రెన్నాళ్ళవఱకు నతఁడు మాయింటికి రాలేదు. రమ్మని యన్నిమారులు పిలిచినను రాలేదు. తుదకొకనాఁడు పడకనుండి లేచియులేవకమున్నే యతఁడు హత్య కావింపఁబడెనని యీపాడుచెవులార విని మిగుల దుఃఖించితిని—

అంతటితో జులియా యాగిపోయెను. కంఠము బాష్పనిరోధిత యయ్యెను. ఆమె మాటాడనేరదయ్యెను.

వే : జులియా ! నీవిందుపై నేమూహించితివి ?

జులి : నాకేమియుఁ దోచకున్నది.

వే : తాజుద్దీన్ హత్యాపరాధమున రజాకున కేమైన సంబంధము కలదని చెప్పఁగలవా ?

జులి : ఎట్లు చెప్పఁగలను. నాకేమియుఁ దెలియకున్నది. అతఁ డట్టిక్రూర కార్యమును గావించునని నమ్మను. అతని కట్టిమర్యాదయ మున్నట్లు నేను గనిపెట్టలేదు.

వే : సరి. ఆ సంగతి నిరూపించుభారము మాది. పాపము నీకేమి తెలియును లెమ్ము.

జులి : మీరబ్దుల్లాను హంతకుఁడని సంశయించుచుంటిరా ?

వే : అవును. అదియే మాయనుమానము.

జులి : ఆధారమేమి ?

వే : నీవే. నీవే వారివిరోధమునకు హేతువు. నీకొఱకే రజాకు హంతకుఁడుకూడ నైయుండును. కాంతాకనకంబులేకదా లోకుల విమోహితులఁ గావించునవి !

జులి : ఉండిన నుండవచ్చును. నాకది తెలియదు.

వే : జులియా ! నీవు మాకు మహోపకారమును గావించితివి. వలసినప్పుడు నీ సాక్ష్యమును కోర్టువారియెదుట వినిపింపవలెను. మేమికఁ బోయివత్తుము.

జులి : చిత్తము. నాకష్టమును నేనే చేతులార తెచ్చిపెట్టు కొందునా ?

అప్పటికప్పుడే తెల్లవాఱుజాడలు గోచరించుచుండెను. వీథులలో జనసంచారమగుచుండెను. వారు మున్‌టాజ్‌మందిరమును వీడి యీవలికి వచ్చిరి.

# పదునెనిమిదవ ప్రకరణము

## ద్వితీయ హత్య

వేణీప్రసాదు నిజగృహంబును జేరుసరికి తెల్లవారిపోయెను. అతని కారాత్రి యంతయు నిద్దురలేక తల తిరిగిపోవుచుండెను. అతఁడు రక్షకభటులను బంపివైచి యెవరితోడను మాటాడక నిద్రింపనెంచి పడకటింటిలోని కేగి శయ్యపై మేను వాల్చెను. అంతలో గిరిధరుఁడు "వేణీ ! వేణీ !" అని పిలుచుచు వచ్చి చూచి "ఏమట్లుంటివి ? రాత్రి యెందుంటివి ?" అని యడిగెను.

వే : రాత్రి నిద్దురలేదు. పరుండి లేచిమాటాడెదను.

గిరి : నీ వజీజుద్దీనును జూడలేదా ?

వే : లేదు. అతఁ డేడి ?

గిరి : తనయింటికిఁ బోయినాఁడు.

వే : ఏల ? ఇస్మాలు రానిచ్చెనా ?

గిరి : నీ విస్మాలు మందిరమునకుం బోలేదా !

వే : లేదు. అక్కడివిశేషము లేమి ?

గిరి : పాపము ! ఇస్మాలునుకూడ నెవరో చంపివైచిరంట.

వే : (ఉలికిపడి)—ఆ, ఆ, ఏమంటిరి ! ఇస్మాలును కడతేర్చిరా ! ద్వితీయహత్య జరిగినదా ! ఎవరు హంతకులు ?

గిరి : ఆ సంగతులు నాకుం దెలియవు. సేవకుం డొకండు పరుగున వచ్చి నిద్రించుచున్న యజీజుద్దీనును లేపి "మీ పినతండ్రి నెవరో కూనీచేసినారు. శీఘ్రముగ రండ" ని యతనినిం దోడ్కొనిపోయెను. అజీజు వెంటనే నాకాసంగతినిం దెలిపి నీవు వచ్చినంతనే తమయింటికిం బంపవలయునని చెప్పెను.

ఈభయంకరవార్త నాలకించి ప్రసాదరావు నిర్ఘాంతపడిపోయెను. కొంతకాలము కన్నులు మూసికొని యేదియో చింతించుకొని తలపంకించెను. గిరిధరుండు మరల "నీవిప్పుడచ్చటికేంబోవా ?" అనియెను.

వే : పోకున్నందీరదు. సంఘటన మతిభయంకరముగా నున్నది.

అంతలో నిస్మాలునింటిసేవకుండు వచ్చుటయు వేణీప్రసాదు చూచి సమాచార మేమని యడిగెను. వాండు తడంబడుచు "మహారాజా ! అజీజుద్దీన్‌గారు మిమ్ము శీఘ్రముగం బిలుచుకొనిరమ్మనిరి." అనెను. వేణీప్రసాదు తండ్రికడ సెలవుగైకొని వెంటనే యాసేవకు ననుసరించి పోయెను.

అతం డిస్మాలునిల్లు చేరుసరి కచట ననేకులు గుమికూడి యుండిరి. పోలీసువా రటునిటు పారాడుచుండిరి. వేణీప్రసాదు వారినిం బిలిచి లోపలికి దారితీసెను. అందఱు సోత్కంఠులై యతనిచుట్టును మూగిరి. అజీజుద్దీ నతనిని గలిసికొని "అయ్యా ! రండు. జరిగినఘోరమును జూడుండు." అని లోనికిం గొంపోయెను.

క్రిందిహాలునందే ప్రసాదరావునకు రక్తప్రవాహము కాన్పించినది. అందే రక్తసిక్తమైన ఖానుమృతకళేబరము పడియుండెను. ఈ రెండవనరహత్యను గాంచి వేణీప్రసాదు దిగ్భ్రమనొంది శవమును బరీక్షించెను. కూనీజరిగి రెండుమూడు గంటలకంటె నెక్కువ సేపైనట్లు తోచలేదు. హృదయమునందను, కంఠతలమీఁదను కత్తిపోటులు కాన్పించుచుండెను. రక్తధారలింకను నాఁగలేదు. వేణీప్రసాదజీజును గాంచి "సమాచార మేమి? ఎవరితనిని జంపిరి?" అని యడిగెను. అజీజు "నాకుఁ దెలియదు. నేనింకను మేల్కొనకముందే మా సేవకుఁడు వచ్చి నాకీసంగతి చెప్పెను. హంతకుఁ డెవ్వఁడో తెలియదు. హత్య చిత్రముగా జరిగిపోయినది." అనెను. వేణీప్రసాదాశ్చర్యముతోఁ జూచుచు, "అబ్బా! రెండుహత్యలు—ఒకదానికన్న నొకటి భయంకరము! రాత్రి యితఁ డెందుపరుండెను? అని యడిగెను.

కిరణ: మహారాజ్! ఇంటనే పరుండియుండెను.

వేణీ: రజియాబీబీ యేది?

అజీ: ఆమెయీగడయే తెలియకున్నది. ఇంట లేదు.

అజీజు ప్రసాదరావు సలహాపై నాకళేబరమును వైద్యశాలకనిపి యుండటితోఁ జేరి మేడమీఁదికిఁ బోయెను. వారిపాడుగునను రజియాపడకటింటివఱకును రక్తచిహ్నములే. అచ్చట నంతయు వ్యత్యస్తముగ నుండెను. పరుపులు తలక్రిందైనవి. గోడకుఁ దగిలించినపటములు చూర్ణీభూతములైనవి. తాంబూలపళ్లెరము చితికిపోయెను. ఎవరో ద్వంద్వయుద్ధముఁ జేసినట్లు విశదమగుచుండెను. అంతయుఁ జూచి వేణీప్రసాదు "రజియాదాసి సాఖియా యేదీ!" అని యడిగెను. వెంటనే సేవకుఁ డొకఁడు "క్రిందనున్న" దని చెప్పి యామెను దోడ్తెచ్చెను. వేణీప్రసా దామె నిట్లని ప్రశ్నించెను.

వే: నీవెప్పుడును రజియాబీబీతోనే యుందువా?

సాక్షి : చిత్తము.

వే : అయిన నీవు డామెనెందు విడిచి వచ్చితివి ?

సాక్షి : ఆమె యెట కేగెనో నాకును దెలియదు.

వే : కడసారి నీవామె నెప్పుడు చూచితివి ?

సాక్షి : నిన్న సాయంకాలమువఱకు నామెకడనే యుంటిని. రాత్రి యేదో యల్పకారణములను బట్టి గలహించి, నిర్హేతుకముగ దూషించి నన్నింటికిం బంపివైచెను. నేనువిచారించుచు నింటికిఁబోయితిని.

వే : ఆమె నీతో నేకారణమునఁ గలహించెను ?

సాక్షి : ఖాన్‌సాహేబు కొన్నిదినములముం దామెనొక బనారస్ చీరను దెచ్చి యిచ్చియుండిరి. రాత్రి యామె దానిని ధరింపఁగోరినది. నేనద్దానినిఁ దీసి సవరించుచుండ నొకయుంచు మంచముకొనకుఁ దగిలి చినిగిపోయెను. అదియే యామె యాగ్రహహేతువు.

వే : ఆమె కోపగుణము కలదేనా ?

సాక్షి : కాదు. నాతో నెన్నఁడును వాదులాడి యెఱుఁగదు. రాత్రి యదేమో నాపై నంతతీవ్రక్రోధ మొదవినది. పొరపాటున మున్ను నేనంతకన్న నెక్కుడగు నపరాధముల నెన్నిఁటినో చేసియుంటిని. ఎప్పుడును గోపపడలేదు.

వే : నీమాటను బట్టి చూడ రజియా రాత్రి నీతోఁగావలయునని కొట్లాడిన ట్లున్నది ?

సాక్షి : ఆ సంగతి నాకెట్లు తెలియును ?

వే : ఆమె తనపని తీర్చుకొనుటకు నీతోఁ గలహించియుండును ?

సాక్షి : ఉండిన నుండవచ్చును.

వే : సాక్షియా ! ఉన్నదున్నట్లు చెప్పుము. ఈనడుమ మీ యింటికిఁ బరు లెవ్వరైన వచ్చిపోవుచుండిరా ?

సాఖి : పరు లెవరున్నారు ? పాఱిపోయిన గులాము మరలవచ్చి తమరూపణగోరి నిన్ననే మరలఁ దనపనిలోఁ బ్రవేశించెను.

వే : (ఆశ్చర్యమున) గులామ్ మరల వచ్చెనా ? వాఁడేఁడీ ?

సాఖి : వాఁడును ఉదయమునుండి కాన్పింపకున్నాఁడు.

వే : ఇస్మాల్ మరల వాని నెట్లు చేర్చుకొనెను ?

సాఖి : నిన్న ప్రొద్దున వాఁడు జంకుచు వచ్చి పాదములపైఁ బడి తనతప్పు మన్నింపుమని ప్రార్థించుటచే నిస్మాలు కనికరించి యింట నుంచుకొనెను.

వేణీప్రసాదు దీర్ఘముగ నాలోచించి "సాఖియా ! నీవు సదా రజియాకడ నుండుదానవగుటచే నామెసంగతి నీకు బాగుగఁ దెలిసి యుండును. నిజమును కప్పిపుచ్చకుము. ఆమె యీ నడుమ మఱి యెవ్వరినైన వలచియున్నదా ?

సాఖి : లేదు. అట్టిభావము నాకగపడలేదు. ఆమె కిస్మాలనిన నెంతయో ప్రేమ !

వే : పారిపోయిన తర్వాత నీవిఁక గులామును జూడలేదా ?

సాఖి : లేదు. వాఁడు నిన్ననే మరల మాకంటఁబడినాఁడు.

వే : రాత్రి యింటఁ బరున్నసేవకు లెవరెవరు ?

కిరణ : నేనును, గులాము, మఱియిరువురు.

వే : మీరెందు పరుండియుంటిరి ?

కిరణ : వెలుపల వసారాలో.

వే : లోపలఁ జప్పుడైన నచ్చటికి వినఁబడునా ?

కిరణ : వినఁబడదనుకొందును. మే మెట్టిశబ్దమును వినలేదు.

వే : వేకువజామువఱకు గులాము మీకడనేయుండెనా ?

కిరణ : లేదు. మాకదేమో కాని నిన్నరాత్రి చావునిద్దుర వచ్చినది. అందుకుఁ గారణ మిప్పుడు తెలియుచున్నది.

వేణీ : ఏమి ?

కిరణ : గులాము రాత్రి పరుండఁబోవునపుడు మాకందఱికిని గొన్నిచుట్టలనిచ్చెను. కాల్చిన కొంతసేపటికే మేము మైమఱచి నిద్రించితిమి. తెల్లవారుజామున సాఖియావచ్చి లేపువఱకును మేల్కొనమై తిమి. గులామప్పుడు మావద్ద లేఁడు. ఎప్పుడు లేచిపోయెనో నాకుఁ దెలియదు. మావద్ద పరుండియున్న ప్రతినుఁడును కానిపింపకున్నాఁడు. అజీజుద్దీనప్పుడు వేణీప్రసాదును గాంచి "అయ్యా! ఈసాక్షులు చెప్పిన దానివలనఁ దమ కేమి తోఁచుచున్న" దని యడుగ "నిదానింపుము. ఇంకను విచారింపవలసియున్నది." యని సమాధానముచెప్పి యూరకుండెను. అంతలో నటునిటు దిరుగుచున్న సాఖియా పెద్దకేకతో "స్వామీ! అటు చూడుడు. ఆహస్త మెవరిది!" అని యఱచెను. అందఱావైపు చూచిరి. అచట నొకఖండితహస్తము పడియుండెను. దానిని ప్రసాదరావు తటాలునఁ దీసికొని పరిశీలించెను. అందఱు నతని చుట్టుఁ జేరిరి. అది యొకపురుషుని వామహస్తము. ఖండితమై కొంత కాలమే యైనది. దానినిఁబట్టి చూడ నాపురుషుఁడు నల్లనివాఁడని తోఁచుచుండెను. వ్రేళ్ళకు రెండుంగరములు కలవు. అందొకటి వజ్రపుటుంగరము. రెండవదానిపై హిందూస్థానిభాషలో రెండక్షరములు చెక్కఁబడియుండెను. వానినజీజిట్లు వెడలించెను—"అ—ర." దానియర్థ మందఱికిని దురవగాహమై యుండెను. వేణీప్రసాదు దీర్ఘాలోచనచేసి యజీజును గాంచి "ఇది యెవరిదని నీయూహ ?" అని ప్రశ్నించెను.

అజీ : ఇది పురుషునిది కాని యువతిదికాదు.

వే : మీ యిన్‌మాల్‌ఖానుది కాదుగద !

అజీ : కాదు. అతనిచేతులు కత్తిరింపఁబడ లేదు

వే : ఈ యుంగరములఁగూర్చిక్షేమైనఁ జెప్పఁగలవా !

అజీ : నాకుఁ దెలియదు. ఇవి మావి కావనుకొందును.

వే : అయిననీకింక ననుమానమున్నట్లే.

అజీ : నిస్సంశయముగఁ జెప్పనేర. ఈ పదునేనుదినములనుండి యీ యింట నేమేమిజరిగినదో నాకెఱుక లేదు.

వే : పోనీ, మీతల్లి పూర్తి పేరేది ?

అజీ : (విసుగుతో)—అయ్యా ! ఆమెకును నాకును తల్లికొడుకుల సంబంధము పెట్టకుఁడు. ఆధాత్రిని నాజనని కాదు.

వే : పోని, రజియాబీబీ సంపూర్ణనామ మిద్ది ?

అజీ : అంతే యామె పేరు.

వే : ఈ హస్తమును, ఉంగరమును నాచాలో భద్రపఱుపవలసియున్నది. ఈ ద్వితీయహత్యయందు రజియాబీబీ, గులామ్ వీరిరువురును జేరియుందురని తోఁచుచున్నది. తక్కినవారిని ముందు కనుఁగొనవలెను. నేను మఱియొక యనుసంధానము చేసెదను. అజీజ్ ! ఇప్పటికి కొన్ని సంగతులు తెలిసినవి. నీపైతృకసంపత్తి యంతయు మరల నీకబ్బినది. నేఁటినుండి నీయాస్తిని నీవు చూచుకొనుచుందుము. భగవంతుఁడు చిత్రముగ నిస్మాలును నీ మార్గమునుండి తొలఁగించెను. కాని మా కష్టము ద్విగుణితమైనది. నేనిఁక నివు డింటికేగెద. సాయంకాలము వత్తును. అని వేణీప్రసాదు ఆ హస్తమును, అంగులీయకమును దీసికొని వెడలిపోయెను.

# పందొమ్మిదవ ప్రకరణము

## హస్త మెవరిది ?

వివిధాలోచనలచే శిరోభారముతో వేణీప్రసా దింటికివచ్చెను. జరిగిన విషయముల నన్నింటిని భోజనసమయమునఁ దండ్రియెదుటఁ జెప్పెను. కమలామణి , మున్నగువా రతని బోగమింటిచరిత్ర నాలకించి కొంత వర కపహాసించిరి. భోజనానంతరము ప్రసాదరావు శయ్యాగృహ మునుఁ జేరి పండుకొనెను. అప్పుడతఁ డీవిధముగ నాలోచింప సాగెను, "ఆహా ! కార్యభారము రానురాను దుర్భరమగుచున్నది. నిక్కముగ నీభయంకరపరీక్షలయం దుత్తీర్ణుఁడ నైనచోఁ గీర్తి లభించును గాని వీనిని సాధించు టెట్లు ? నాకుఁజూడ నీరెండుహత్యలను సలిపినవాఁ డబ్దుల్‌రజాకే కావచ్చునని తోఁచుచున్నది. తాజుద్దీన్‌ఖానును సంహరించుట జులియాబీబీకొఱకనియు, నిస్మాల్‌ఖానును గడతేర్చుట రజియా బీబీకొఱకనియు నాబుద్ధికిఁదోఁచుచున్నది. ఈ హత్యానాటకమంతయు కాంతలకొఱకే యనుటకు సందియము లేదు. గులాము రజాకున కనుకూలుఁడు, నాఁడువారు మహోద్యానమందిరములో నాలోచించిన దానినిబట్టి రజాకు రజియాను తనకు వశపఱచుటకై గులాముసాయము కోరినట్లు తోఁచుచున్నది. గులామే రజియా నెట్లో రజాకు పాలు చేసియుండును. నిన్న యుదయమున గులాము మరల నిస్మాలును జేరవచ్చుట రజియాను తీసికొనిపోవుటకే. గులాము రజియా నింటినుండి సాగించు ప్రయత్నము చేసినాఁడు. నిన్నరాత్రి ముంటాజ్ మందిరమునుండి పారిపోయినతర్వాతనో, తత్పూర్వమో యబ్దుల్ యిస్మాల్ మందిరములోనికి దూరి రజియాను దీసికొనిపోవుచు తన్నెదిరించుటచే ఖాన్‌సాహేబును బొడిచియుండును. సందడి జరిగినను

దెలియకుండుటకై గులాము సేవకులకందఱకును మత్తుమందిచ్చినాఁడు. గులాము తెల్లవారుజామున వారివెంటనే పోయియుండవచ్చును. ఎంత మోసము! నాయూహ నిక్కమే. ఏది యెట్లున్నను రజియా రజాకుతోఁ బారిపోవుట నిజము. గులాము వారినిఁ బాయకుండును. రజాకు రాత్రి రజియా యింటికి వచ్చినట్లు నాకట దొరకినహస్తము స్థిరపఱచుచున్నది. ఆ రెండుంగరములు నాకీయగాఢాంధకార రూపమున దివ్యజ్యోతులు కాఁగలవు. ఇది నిక్కముగ నబ్దుల్లాకరమే యగుచో ముంటాజ్ జులియా గుర్తిడఁగలదు. కావున నామె యభిప్రాయమును గనుఁ గొనుట మంచిది, అనియిట్లు పర్యాలోచించుకొనుచుండఁగనే నిద్రాదేవి ప్రసాదరావు కన్నులు మూసివైచెను.

ఒకగంట యైనతర్వాత మూపుపై నెవరో చేయివైచి తట్టుటచే వేణీప్రసాదులికిపడి లేచి చూచెను, ఎదుట నందలాలు నిలుచుండి హసించుచు "ప్రసాద్‌జీ! దైవచిత్రము నేమనవచ్చును! నిరపరాధి యగు నజీజుకష్టపాశము నెంతసులభముగ విచ్ఛేదము గావించెను." అనెను. ప్రసాదరా వతనినిఁ గూర్చుండఁబెట్టి యిస్మాల్ హత్యను గూర్చి తాను గావించుకొన్న యాలోచనలఁ దెలిపెను.

నంద : అవును. మీ రాయుంగరములఁగూర్చి చర్చించుట మంచిదే.

వే : ఒకవేళ నీవిషయ మామెవలన విశదము కాకపోయిన వార్తాపత్రికలందు ప్రకటింతును.

నంద : అది తర్వాతిపని. ఇప్పుడు జులియాయింటికిఁబోయి రండు.

వే : మీరు రారా?

నంద : నేనేల రావలయును?

వే : పోయివత్తుము రండు. అప్పుడే మూఁడుగంటలైనది.

తర్వాత నాయిరువురును బీబీమందిరమునకు బయలుదేరిరి. ద్వారమున వారి కుస్తాన్ దర్శన మయ్యెను. వానిమూలమున బీబీకి తమరాకనుజెప్పి పంపి లోపలికేఁగిరి. జులియా వారి కెదురువచ్చి నమస్కరించి " మహాశయులారా ! మరల నింతలోనే వచ్చితిరేమి ? " అని ప్రశ్నించెను.

వే : అవును, బీబీ మరల నీతోఁ బనికలిగినది. తాజుద్దీనుఖాన్ తమ్ముఁడగు సిస్మాల్ ఖాను నెవరో హత్యకావించినారు—

జులియా : (విస్మయవిభీతయై)—ఆ—ఏమంటిరి ! హత్యయా ?

వేణీప్రసాదు జరిగిన సంగతులాతు కెఱింగించి " నేనిప్పుడు రెండు హత్యలను భేదింపవలయును. నీవు రజాకును బాగుగ నెఱుఁగు దువు. అతని మేనిరంగెట్టిదో తెలుపఁగలవా ? " అని యడిగెను.

జులి : మీరతనిని జూడ లేదా ?

వే : ఒకటిరెండుసారులు రాత్రివేళఁ జూచితిని.

జులి : కాఱునలుపు.

ప్రసాదరావు తనజేబులోనిపెట్టెను దీసి యందులోని హస్తము నెత్తి " చూడుము. ఈ వ్రేళ్ళకు రెండుంగరములు కలవు. ఇవి యెవ రివో చెప్పుము " అనియెను. ఆమె విస్మయభయాతిరేకమున నాచేతిని పరిశీలించెను. నందలాల్ ప్రసాదరావు లామెముఖభావముల నవలో కింపసాగెను. జులియా యొకమారు కన్నుల నీరుగార్చెను—అంతలోఁ బెదవి విఱిచెను—నిట్టూర్చెను. అది కాంచి వేణీప్రసాదు " జులియా! అది యెవరిదో గుర్తించితివా ?" యనెను. జులియా మరల దీర్ఘోచ్ఛ్వా సమును వెలిబుచ్చి " అయ్యో ! ఇది రజాకుసాహేబుదే " అనియెను.

వే : ఎట్లానవాలు పట్టితివి ?

జులి : ఇది నేను పలుమార్లు చూచినహస్తము. ఇదిగో మీఁది వైపున నొక పెద్దమచ్చ కలదు. ఇది యతనిదే.

వే : ఉంగరములో ?

జులి : హస్త మెవరిదో యదికూడ వారిదే. ఇందలి యక్షరములు మీకుఁ దెలియువా ?

వే : అది యతనిపేరేనా ?

జులి : అవును.

వే : జులియా ! నీవు ప్రమాదపడ లేదుకదా ?

జులి : లేదు.

వే : నీ విస్మాల్ ఖాను నెప్పుడైనఁ జూచితివా ?

జులి : లేదు. నాకతనితోఁ బరిచయము లేదు.

వే : నీకీనడుమ రజాకు సంభాషణలోఁగాని, నడవడిలోఁ గాని యతఁ డింకొక కాంతను వలచినట్లు నీకనుమానము తోఁచినదా ?

జులి : లేదు. నాకెన్నఁడు నట్టిసంశయము కలుగలేదు.

అట్లు తెలిసికొని ప్రసాదు నందలాలుతో నటనుండి కదలెను. జులియా మరల నొకమారు నిట్టూర్పునిగుడించి వెక్కి వెక్కి యేడువసాగెను. రోషినారా యామె ననేకభంగుల నూఱడించి లోనికిఁ గొంపోయెను.

ఇలుసేరుపర్యంతము నందలాల్ వేణీప్రసాదు లిరువురు నేదో చాలవఱకు రహస్యముగ సంభాషించుకొనిరి.

క్రమక్రమముగ దివాకరుఁడు పశ్చిమాంబుధిని మునిఁగెను. అది వర్షాకాలము. వినీలమేఘమాలిక లాకసమునిండ క్రమ్మియుండెను. వేణీప్రసాదు కొందఱు రక్షకభటులతో రజాకుమందిరావరణమున పుష్పోద్యానమున నొకమల్లికానికుంజమున దాగుకొని యెవరైన నచ్చటికి వత్తురేమో యని చాలసేపు నిరీక్షించెను. చూచుచుండఁగనే

నడిరేయి దాటిపోయెను. కాని యెవ్వరును వచ్చినట్లు లేదు. తుదకు విసుఁగుకొని ప్రసాదరావు పోలీసువారితో నీవలకువచ్చి యొకమారు గృహకవాటమును జూసి దానికి తామువైచిన తాళము నొకమారుపరి శీలించెను. అది యథారీతిగనుండెను. ఎవ్వరు నందుఁ బ్రవేశింపలేదు. అంత నతఁడు "ఇఁక వారెవ్వరును రారు. పోదము రండు. ఊరనుండిన రాకుందురా?" అని రక్షకసేవకులతో నాతావును వదలిచనెను.

ఇలుసేరి శేషరాత్రినంతను చింతాపరంపరలతోఁ గడపివైచెను. గిరిధరుఁ డతని యోచనాగతి కడ్డుపడలేదు—అట్లే తెల్లవారినది.

ఉదయమున నతఁడింకను శయ్యను వీడి లేవకమున్నే యజీజుద్దీ నొక సేవకునితో నచటికి వచ్చెను. ఇన్‌స్పెక్టరతనినిఁగాంచి "ఏమైనఁ గ్రొత్తసంగతులు తెలిసినవా!" అని యడిగెను.

అజీ: అవును. ఈ మనుష్యునివలననే.

వే: వీఁడెవఁడు?

అజీ: మాయింటి పరిచారకుఁడే.

వే: ఓరీ, నీ పేరేమి?

సేవ: నన్నుఁ బ్రతనుఁడందురు.

వే: నీకుఁ దెలిసిన రహస్యాంశములేవి?

ప్రత: అబ్దుల్‌రజాకు, గులామ్‌శాహీ, రజియాబీబీ బొంబాయికిఁ బ్రయాణమై పోయిరి.

వే: (విస్మితుఁడై)—నీ కెవరు చెప్పిరి? ఎప్పుడు పోయిరి?

ప్రత: నేనే వారిని వేకువజామున బొంబాయి మెయిలులో పీడ్కొని వచ్చితిని.

వే: మిగుల వింతగనున్నవే నీ మాటలు. ప్రతనా! జరిగిన సమాచార మేమో తెలుపుము.

ప్రత : స్వామీ ! నేను వీరియింటి పరిచారకుఁడను. నాకును గులామ్‌శాహీకిని మిగుల నేస్తము. మేమొకరి నొకరు ప్రేమించు కొనుచుందుము. కాని మాయిర్వురకును భేద మేమన గులామ్‌స్వార్థము నకై స్వామియసువులనైన నాహుతిఁగొను దుస్స్వభావుఁడు. నేనందుకు వ్యతిరేకదృష్టాంతము. ప్రభువునకై నాప్రాణములనైన సర్పింతును. కొంతకాలమునుండి నాకు వానిపై ననుమానము కలిగినది. అయినను నేను వానియెడల విశ్వాసమునే నటించుచుంటిని. వాఁడప్పుడప్పుడు రజాకు గుణగణాదుల నుగ్గడించుచు, నిస్సాల్‌ఖానును నిందించుచుం డెను. తుదకొకనాఁడు రజియాబీబీని రజాకు మోహించినట్లును, ఆమె యతనితోఁ బోఁదలంచినట్లును దెలిపి నన్నా సంధానములో దనకుఁ దోడుపడవలయునని కోరెను. నేనందుల కియ్యకొనక వానిని దూల నాడితిని. ఈసంగతి బయలుపడినది. మొన్నరాత్రి పరుండఁబోవునప్పుడే నేను వెంటనే యీవార్త నిస్మాల్‌ఖానునకుఁ దెలుపవలయు నని యత్నించితిని కాని యతఁడపుడింట లేఁడు. పిమ్మట గులామ్‌శాహి నాకును కిరణాలాలునకును, మఱియొకనికిని చుట్టలఁగాల్ప నిచ్చెను. మేము వానిని గాల్చి మైమఱచి పరుంటిమి. తెలివి వచ్చి చూచుసరికి బొంబాయిమెయిలులో రజాకు, గులామ్, రజియాబీబీలతోఁ బ్రయాణము చేయుచున్నట్లు గ్రహించితిని. అంత నేను గులామునుగాంచి నేనిచటి కెట్లు వచ్చితి నని ప్రశ్నింప వాఁడు "చింతింపకుము. నేను చెప్పినమాట వినవైతివి. అయినను నేను రజాకుసాహేబుగారికి సాయ పడితిని. ఈయుపకారఫలము మిత్రుఁడగునీకును లేకుండఁబోదు. నిన్నును నన్నును దనకడ నుంచుకొనఁగోరి సాహేబుగారు బొంబాయికిఁ దోడ్కొని పోవుచున్నారు. ఇఁక సుఖదినములు చూడఁగలవు లెమ్ము" అని నన్ను తనవలలో వైచుకొన యత్నించెను. రజాకును, రజియాబీబీ

యును నన్నుఁజేరి తమవెంట బొంబాయికి రావలసినదని మిగుల బోధించిరి. మేమున్నబండిలో నితరులు లేరు. ఒకవేళ నేనప్పుడు వారికన్యథా మాటాడిన నేమికీడు మూడునో యని భావించి తాత్కాలికముగ గులామును శ్లాఘించుచు; రజాకుమాట కియ్యకొని యతనిని పలు రీతుల నుతించితిని. కాని వారిచేతులనుండి యెట్లు తప్పించుకొందునా యని చింతించుచుంటిని. ఇంతలో రైలు విషపురి (Visapur) స్టేషనును జేరినది. అప్పుడు నాకింతయవకాశ మబ్బినది. నేనేదో యొక కారణమును దెలిపి బండిదిగి యది కదలిపోవువఱకును జనులనడుమ దాగి తర్వాత నహమదునగరునకువచ్చి సామానుబండిలోఁబడి మరల నిల్లు చేరుకొంటిని. ఇది జరిగినవార్త.

# ఇరువదియవ ప్రకరణము

## బొంబాయి ప్రయాణము

ప్రతనుఁడు చెప్పుచున్నంతకాలము వేణీప్రసాదరావు మౌనముతో వినుచుండెను. ఆ మాటలవలన క్రమముగా నంధకారము విడిపోవుచుండెను. అతఁడత్యంతాహ్లాదముతో "ఓరీ ప్రతనా! ఇప్పటికి వారు బొంబాయినిఁ జేరియుందురా?" అని ప్రశ్నించెను.

ప్రత : నాకుఁ దెలియదు. వారుమాత్రము బొంబాయికే పోదురు.

వే : మంచిది. నాయూహ సత్యమే. వారీయూర లేరు.

అజీ : అవును. వెంటనే పోయిన వారు దొరకుదురు.

వే: ఆమాట నిజమే. రజాకునకు బొంబాయిలో బంధువు లున్నారా!

అజీ: నాకాసంగతి బాగుగఁ దెలియదు. ఒకవేళ నున్నను వారటకుఁ బోక రహస్యముగా నుందురు.

వే: ఇప్పు డింక బొంబాయికిఁ బోవురైలు లేదుకదా!

అజీ: లేదు. రాత్రి పదిగంటలకు వెడలవచ్చును.

వే: కానిమ్ము. ఆ విషయమై యాలోచింతము.

అప్పుడు వేణీప్రసాదు తండ్రిచెంతకేగి సవిస్తరంబుగ మాటాడి రాత్రి బొంబాయికి పోవుట కనుజ్ఞవేడెను. గిరిధరుఁడెట్టి యభ్యంతర మును గల్పింపలేదు.

* * * * *

వేణీప్రసా దహమదునగరును వదలి యప్పుడే నాల్గుదినము లైనవి. అతఁడు బొంబాయిలో బసచేసియున్న "మాడెరన్" హోటలునందు సౌఖ్యమున కేమియుఁ గొదవలేదు. కాని ప్రసాదున కొక్క-క్షణమైన చిత్తశాంతి చేకూరలేదు—ఎట్లుండఁగలదు! అతఁ డెవరి నన్వేషించుచు బొంబాయికి వచ్చెనో వారిలో నెవ్వరును నేఁటిదనుక నతని కంటఁ బడలేదు—వారియునికికూడ తెలియరాకుండెను. వారు నిక్క-ముగ బొంబాయికి వచ్చిరో ప్రతినుఁడు తప్పించుకొని పారిపోవుటచే వాఁడుతమ రహస్యము బయలుపఱచునను భీతిచే మఱియొండైనఁ బోయిరో యని పలురీతుల యోచించెను. ఈ నాల్గుదినములలో నతఁడు బొంబాయిపట్టణము నంతను రెండుమారులు చుట్టివచ్చెను. అంతే కాదు—కంటికి కాన్పించిన ప్రాణిని పరిశీలించి చూడక వీడలేదు. పుర జనులచే నూతనులని చెప్పఁబడిన స్త్రీపురుషులలోఁ జాలమందిని చూచివచ్చెను. పక్షములోఁ జేయవలసినకార్యము నా నాల్గుదినము

లలో నడపెను. కాని యేమిలాభము ?— హంతకులుమాత్రము పట్టు పడలేదు. ఇంక నతఁ డేమిచేయఁగలఁడు ? అతఁడు పడినపాట్లన్నియు వృథ యయ్యెను.

అయిదవదినము రాత్రి భోజనానంతర మతఁడు శయ్యామందిర మునఁ బరుండి " ఆహా ! పట్టినపట్టు నెఱవేఱని దే మరల నహమదునగ రున కెట్లుపోదును ? నేఁటికినాలుగైదు దినము లాయెను. ఇంకను హంత కులజాడ గోచరింపకున్నది. నేనేమిచేయఁగలను ? మానవశక్తి కతీత ముగఁ గష్టించితిని విచారించిచూడ వీరుతప్పించుకొనుటకై తమగమ్య స్థానమును మార్చుకొనిరేమో యని తోఁచుచున్నది. లేక యింకను నిందే యెందైనఁ గృత్రిమాకారములతోఁ దిరుగాడుచుందురా ? నేనీ సమయమున నొంటిగఁబని చేయుటకన్న మఱియొకనిసాయ మొంది యుండుట మంచిది. ఉదయముననే లక్ష్మణసింగును రమ్మని వ్రాసెదఁ గాక " అని యాలోచనాపరంపరలలో మునిఁగి తేలుచుండెను. అప్పుడప్పుడించుక కనుమూయుచుండెను. కాని వెంటనే మెలకువ— ఇట్లే కలతనిద్దురతో నతఁడారాత్రి వేగించివైచెను. ఉషఃకాలమంద మలయానిలసుఖస్పర్శచేమాత్ర మొకగంటవఱకు మైమఱచి నిద్రిం చెను. ఇంకను బరుండియుండెడివాఁడే కాని యంతలో నెవరో తలు పులు తట్టుటచే తటాలున మెలకువకలిగెను. వేణీప్రసాదు కనువిచ్చి చూచి " ఎవరువార " ని ప్రశ్నించెను. వెలుపలినుండి " మహారాజ్ ! నేను లక్ష్మణసింగు " నని ప్రత్యుత్తరము వినవచ్చెను. అడఁబోయిన తీర్థ మెదురైనట్లు ప్రసాదరావు పరమానందపడియెను. అతఁడు వెంటనే పోయి ద్వారమును తెఱచెను. నిక్కముగ వచ్చినవాఁడు లక్ష్మణుఁడే—అతఁడుఁ డతనికి సలాముచేసెను.

వేణీప్రసాదు వానిని లోపలికిఁ గొనివచ్చి " లక్ష్మణా ! ఎం దుండి నీరాక ? సమాచార మేమి ? " అని యడిగెను.

లక్ష్మి : సమాచారములు విశేషముగ నున్నవి. మీరు వెంటనే ప్రయాణము కావలయును.

వే : (విస్మయముతో) ఎచ్చటికి ?

ల : అహమదునగరునకు.

వే : ఏల ?

ల : మీకిందు హంతకులు చిక్కరు.

వే : అదెట్లు గ్రహించితివి ?

ల : వారిందు లేరు. ఇదిగో ఈ కాగితము చూచుకొనుడు.

అతని చొక్కాజేబులోనున్న యొక కాగితమును తీసి యతని కిచ్చెను. ప్రసాదరావు దానిని విప్పిచూచెను. అందిట్లు లిఖితమై యుండెను.

" ప్రియమిత్రమా ! గిరిధరరావుజీ !

నేను గుల్బర్గాకు వెళ్లి వచ్చినవార్త మీకుఁ దెలియదు. నే నిచ్చటికే వచ్చి మూఁడుదినములైనవి. మీకుమారుఁడు వృథా బొంబాయియందు హంతకులఁ బట్టఁ బాటుపడుచున్నాఁడు. వారచట లేరు. మొన్న నేనీపట్టణమున గులామును గాంచితిని. వాఁడు తన యనుచరులతో నిందే యుండునని తలంచుచున్నాను. ఇంకను వాఁడిట మఱికొన్నినాళ్లుండవచ్చును. కాని తామసింపఁగూడదు. తాము దయచేసి యీ కాగితము చేరినవెంటనే వేణీప్రసాదరావున కీవార్త నెఱింగించి, యతని నిచ్చటికే పంపవలెను. ఈదినమే ప్రసాదరావుగారి కొకతంతివార్తను బంపినాను.

చిత్తగించవలెను.

బి. వి. నందలాల్. గుల్బర్గా.

లేఖ నాద్యంత మవలోకించుసరికి ప్రసాదరావు పెదవులపైఁ జిఱునగ వంకురించెను. "ఔరా! హంతకులు నే నెంచినట్లు ప్రతనుని వంచించినారు. కానిమ్ము. వారెందున్నను విడువను. గులాము పట్టువడిన లెక్కినవారందఱు పట్టువడుదురు. ఇప్పుడే గుల్బర్గాకు వెళ్లవలెను" అనెను.

ల: మీ రహమదునగరునకు రారా?

వే: పనియేమి? తండ్రిగారితో నేను గుల్బర్గాకు వెళ్ళితినని చెప్పుము. నీ వహమదునగరునకుఁ బొమ్ము.

ల: మీరు మరల నెపుడు వత్తురు?

వే: ఇపు డెట్లు చెప్పఁగలను? తర్వాత కాగితము వ్రాయుదును.

వీరిట్లు మాటాడుకొనుచుండ టపాలాబంట్రోతు వచ్చి వేణీ ప్రసాదున కొకతంతివార్త నిచ్చిపోయెను. అది నందలాలు పంపియుండు నని యతఁడు గ్రహించెను. నిక్కముగ నదియే. "హంతకు లిందు న్నారు. తక్షణము నీవు గుల్బర్గాకు రావలయును." అని యందున్నది. వేణీప్రసాదునకుఁ జాలవఱకు సంశయవిచ్ఛేదమయ్యెను. అతఁడు నెం టనే గుల్బర్గాకు వెళ్ళనిశ్చయించుకొని యామధ్యాహ్నమే లక్ష్మణ సింగుతో ధూమశకటవిశ్రమస్థానమునకు విచ్చేసెను. జనసమ్మర్ద మట విశేషముగ నుండెను. ప్రసాదరావు లక్ష్మణునితోఁగూడ నొకబండిలోఁ గూర్చుండెను. కొంతసేపటికే రైలుకదలినది. మఱికొంతసేపటి కెన్నియో గ్రామములఁ బట్టణములఁ గడచి రైలుబండి దోండ్ స్టేషనును జేరెను. ప్రసాదరావు లక్ష్మణసింగు నట దిగిపొమ్మనెను.

ల: స్వామీ! నేనుకూడ గుల్బర్గాకు రాకూడదా?

వే: నాకేమియు భయములేదు. నందలాల్ సేవకులుందురు కదా. నీవును నావెంట వచ్చిన తండ్రిగారికి నేను గుల్బర్గాకుఁ బోయినవార్త నెఱిఁగించువా రెవ్వరు? కావున నీవింటికిఁ బొమ్ము. నీసాహాయ్య మవసరమగుచో రమ్మని వ్రాయుదును.

ల : తమచిత్తము. పరస్థలమునందు భద్రముగా నుండవలెను.

వే : మంచిది. నీవుపొమ్ము.

లక్ష్మణుఁ డతనికడ సెలవందుకొని యహమదునగరునకు వెళ్లు బండి నెక్కెను.

బొంబాయినుండి పయనమగుటకుముందే వేణీప్రసాదు గుల్బర్గా తనకపరిచిత ప్రదేశమగుటచే స్టేషనునకు రావలసినదని నందలాలునకొక తంతివార్త నంపియుండెను. ఆధైర్యముమీఁదనే యతఁడు లక్ష్మణసింగు నింటికిఁ బంపివైచి యొక్కఁడును గుల్బర్గాకు వచ్చిచేరెను. రైలు నిలిచి నంతనే యతఁడు నందలాలు వచ్చియుండెనేమో యని చూడసా గెను. పెక్కండ్రు ప్రయాణీకులు వచ్చి బండినిఁ జేరుచుండిరి. పలువురు దిరిగిపోవుచుండిరి. జనసమ్మర్దమత్యంతమైయుండెను. వారందఱు హైదరాబాదునకు వెళ్లుచున్నారు. అచ్చట మొహరంపండుగ మహా వైభవముతో జరుగునఁట. వేణీప్రసాదు చాలసేపు చూచెను. కాని తనమిత్రుని జాడలేదు. ఇంతలో మఱియొకధూమశకటము స్టేషనును జేరవచ్చుచున్న ట్లొకయీల వినఁబడెను. అది హైదరాబాద్ మెయిలు బండి. అది వచ్చియాగినంతనే యిఁక జనబాహుళ్యమునుగూర్చి వ్రాయ వలెనా ! కాలిడుటకు సందులేదు. వేణీప్రసాదింకను రైలుదిగక మిత్రునిరాకకు వేచియుండెను. ఇంతలో బండియీలఁబెట్టుటయు దిగి యొకకూలివాని సాహాయ్యముతోఁ దనసామగ్రిని గ్రిందికిదింపి యట నున్న యొకబల్లపైఁ గూర్చుండెను. ఒంటిగ నుండుటచే వస్తువులను విడిచి యటునిటు తిరుగుటకుఁగూడ వీలు లేకపోయెను. అప్పుడతఁడు లక్ష్మణసింగును గొనిరానందుకుఁ బశ్చాత్తాపము నొందసాగెను. ఇం తలో మొదటిబండి వెడలిపోయెను. అప్పుడతఁడిఁకఁ దెల్లవారునర కందున్న విశ్రమాగారమునసుండి తరువాత నూరిలోనికిఁ బోవచ్చునని

యొంచి కదలెను. అప్పు డానరసాగరమధ్యమునుండి యెవరో "బాబూ! వేణీప్రసాద్ మహరాజ్!" అని పిలిచినట్లయ్యెను. ప్రసాదరావు అచ్చటి విద్యుద్దీపకాంతిలో నావ్యక్తిని నిదానించి చూచెను—వాఁడెవఁడు? నందలాల్ పరిచారకుఁడగు విశ్వనాథుఁడు!! ప్రసాదరావు వానిని జూచి "ఏమిరా, విశ్వనాథా!" యనెను. వాఁడు నమస్కరించి "స్వామీ! తమకొఱకు కిదంతయు వెదకితిని. ఎందుండిరో యెంతసేపటికిని గానిపింపరైతిరి" అనెను.

వే: మీా యజమానుఁ డేఁడీ? నాతంతివార్త చేరినదా?

విశ్వ: ఆ, చేరినది. బాబుగా రస్వస్థతగా నుండి ననుఁబంపినారు.

వే: మంచిది, ఈసామానులు దీసికొమ్ము. పోదము.

విశ్వనాథుఁ డాసామానులలోఁ గొన్నిఁటిని దాను గైకొని తక్కినవాని నొకకూలివాని చేతి కిచ్చెను. వానిననుసరించి వేణీప్రసాదు బయలుదేఱెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

## దైవసహాయము

శాస్త్రపరిశోధకులు కృషిచేసి లోకోపకారమునకై విద్యుద్దీపికల గనుఁగొన్నకాలమిది. రాత్రులయందు సూర్యకాంతి శూన్యమైనను ఆదీపికలచేనంతయుఁ బట్టపగలై యుండును. గుల్బర్గా స్టేషనునందు బహుదూర మట్టితటిద్దీపికాసంహతి ప్రకాశించుచుండెను. వేణీప్రసాదు

విశ్వనాథునితోడను, కూలివానితోడనుఁ ఆజనసమూహమున నడచి పోవుచుండెను. అప్పటికింకను దనభోజనము కానందున ప్రసాదరావు దారిలోఁ గొన్ని కదళీద్రాక్షనారింజఫలములఁ గొనెను — ముందున నడుగిడెను, సేవకు లతనివెంటనే పోవుచుండిరి. ఇంతలో నాకస్మిక ముగ వేణీప్రసాదు తటాలున నాఁగిపోయెను. విశ్వనాథుఁడు కారణ మూహింపలేక నతనివంక చూచెను. ప్రసాదరావు మనుష్యసముదా యమున నల్లంతదవ్వున నేగుచున్న యొకవ్యక్తిపై దృష్టి నిగిడ్చి చూచుచుండెను—వాఁడు మనగులామ్‌శాహి!!

ఆ సమయమున నాతనిమస్తిష్కమధ్యమున మెఱసిపోయినయూ హాపరంపరలఁగూర్చి యేమనిచెప్పఁగలను! ఒక్కక్షణములో నెన్ని యోతలంపు లతనితలలోఁ దరలిపోవుటచే ప్రసాదు విశ్వనాథునిఁ గాంచి "విశ్వనాథా! నాకిట కొంతపని కలదు. నేనిప్పుడే యింటికి రాను. మీవీథిపేరును, గృహసంఖ్యను గుర్తువేసి యిమ్ము. నీవీసా మానుల నిలుఁజేర్చి నందలాల్‌గారికి నారాకను దెలుపుము." అని వానివలన తనమిత్రుని గృహసంఖ్యను వీథిపేరును దెలిసికొని వానిని బంపివేసి తాను తిన్నగ గులాము కనుమఱుగు కాకుండ వాని ననుస రించి నడువఁదొడఁగెను. విశ్వనాథున కీచర్యలేమియు నర్థముకాలేదు. వాఁడు విస్మయముతో వేణీప్రసాదునకేమో చెప్పఁదలంచెను— కాని యతఁడేఁడీ? ఆమనుజసంఘమున నెందదృశ్యుఁడయ్యెనో! అప్పు డీఁక చేయునది లేక తనతోనున్న కూలివానిఁ దోడ్కొని నందలాలుబసకుఁ బయన మయ్యెను.

వేణీప్రసాదరావు తదేకదృష్టితోఁ జూచుచు నాజనమహార్ణవ మున గులామెందు కనుమఱుఁగై పోవునోయని జాగ్రత్తతో నుండెను. గులామ్‌శాహీమాత్ర మతనిని జూచినట్టు లేదు. వాఁడెవ్వరికినిఁ బరి

చితుండు కానందున పనులచేఁ బలుకరింపఁబడకుండెను. క్రమక్రమ
ముగ వాఁడు స్టేషన్ గుంపును దాటి తూర్పుదెస కొకమై వడివడిగఁ
బోఁదొడఁగెను. వేణీప్రసాదు మిగుల హెచ్చరికతో చూచుచు
గాఢాంధకారమునఁ దానును విలీనుఁడై రహస్యముగ నడచుచుండెను.
ప్రొద్దుపోయి యుండుటచే నావీథియంతయు జనశూన్యమై యుండెను.
అది తక్కినవీథులవలె నంతవిశాలము ను గాక, యంతరమణీయమును
గాక యుండెను. అది సాధారణపుబీదజనుల కాపురంస్థానమువలె గోచ
రించుచుండెను. వీథిలో నెట్టిదీపమును లేదు. చీకటి చెలరేగి తాండ
వించుచుండెను. అట్టియెడ వేణీప్రసా దప్రమత్తుఁడై వాని ననుసరిం
చుచు వాఁడు వెనుదిరిగిచూచిన నందే యెందో యిండ్లమఱుగున
నక్కుచు, తననడకచప్పుడు వినిపింపకుండ జనుచుండెను. ఇట్లు వారి
రువు రొకయరగంటకాలము నడచినపిమ్మట గులా మొకయిఱుకుసం
దులో నొకమందిరమునఁ బ్రవేశించెను. అది వెలుపలికి రమణీయ
ముగ నుండెను. కాని లోపల నెట్లుండెనో—యందున్న వారెవ్వరో
గ్రహించుటకు వేణీప్రసాదున కవకాశ మబ్బలేదు. వాని నప్పుడే
బంధింతమని యతఁడు మొదట తలఁచెను. కాని తానొక్కరుఁ డట్టి
సాహసకార్యమున కాయపరిచితస్థానమునఁ బూనుట యపాయకరమని
వెంటనే తనతలంపును మార్చుకొనెను. "ఈయిల్లెవరిదై యుండును!
ఇందే రజాకు రజియాతో నుండునా? లేకున్న పిఁడింతచనువుతో
నీమందిరమున దూరుటకుఁ గారణ మేమైయుండును? దాపున విచా
రించుటకుఁ బరులెవ్వరును లేరుకదా!" అని యీవిధముగఁ దలపో
యుచుండ నంతతో నామందిరద్వారము బంధితమైనట్లు చప్పుడు విన
నయ్యెను. ఇఁక సాహసించియైన లోపలి కేగుట కవకాశము లేదు.
అతఁ డంత చేయునది లేక ఇప్పుడిట్లే నేను వెనుదిరిగి పోవుటవలన

లాభము లేదు. చీకటిలో నందలాబుబసను గ్రహింపలేను. వృథా పురమంతయుఁ దిరుగాడవలసివచ్చును.” అని మనసులోఁ దలంచి యంతలో మరల నేమో విచారించుకొని తిన్నగ నాసదనమును డాసి యాకారమును హృదయఫలకమునఁ జిత్రించుకొని, దానికవాటము పైనున్న **2019** సంఖ్యను నోటుబుక్కులో గుర్తువేసికొనెను. పిమ్మట నతఁడు చేరువనున్నకట్టను జేరెను. అచ్చట కూర్చున్న నా మందిరము విస్పష్టముగ గోచరించును. వేణీప్రసాదు కూర్చుండుటకన్న పరుండి చూచుట మేలని మీఁదియుత్తరీయమును పఱచుకొనిపరుండి యాగృహముతట్టు చూపుల్లు నిగిడ్చి చూడసాగెను.

అప్పుడప్పు డెవరివో యొకటిరెండు గుఱ్ఱపుబండ్లు పరుగెత్తిపోయినవి. ముప్వురు నల్వురుమనుష్యు లొకమా రేదోమాటాడుకొనుచుఁ బోయిరి. అంతే — మరల నప్పటినిశ్శబ్దభావమున కంతరాయముఁ గల్పించినవా రెవ్వరును లేరు. కొంతకాలము కడచినతర్వాత ప్రసాద రావు తనరేడియమ్‌డయల్ వాచీ తీసి చూచుసరి కించుమించుగా నొంటిగంట యైయుండెను. అతఁడట్లు చూచుచుండఁగనే యాయింటితలుపులు తెఱచినచప్పు డయ్యెను. ఎవరో వెలుపలికి వత్తురని యతఁడు చూచుచుండ నొకపురుషుఁడు వెలుపలికివచ్చెను. వానితో నొకసుందరికూడ నుండెను. ప్రసాదు నిశ్చలదృష్టితోఁ జూచి యామగవాఁడు గులామనియే నిశ్చయించుకొనెను. ఆస్త్రీయెవరు? రజియా యగునా? కాదుకాదు. రజియా జగన్మోహిని — ఈనాతి కట్టిసౌందర్యము లేదు. శరీరచ్ఛాయ యించుక నలుపు. తురుమునిండ పుష్పములు దుఱుముకొని, యొఱ్ఱనివసనమును ధరించి హిందూయువతివలె నుండెను. ఆమె యెవరైనది బోధపడక వేణీప్రసాదు చూచుచుండ నాయిరువు రేదో గూఢముగ మాటాడుకొనుచుండిరి. గులా మాతన్విని

కౌగిలించుకొని ముద్దిడుకొని హిందూస్థానీభాషలో "రేపురాత్రి తప్పక వత్తును." అని తనదారిని తీసెను. ఆయువతియుఁ గొంతసేపు వానిని చూచుచుండి తర్వాత లోపలికేగి తలుపును బంధించివైచెను. దీనియర్థ మేమిచెప్పవచ్చు? ఆస్త్రీ యెవ్వరు? గులామంత స్వేచ్ఛగ నాయంగనతోఁ జరించుటకుఁ గతమేమి? వేణీప్రసాదున కావింతలన్నియు నబోధములై యుండెను. ఎట్లయినను దాను మరల గులామువాడ ననుసరించి పోవుట మేలనియు, నుదయమున నే వచ్చి యాలలనయుదంతము నరయవచ్చుననియు తలంచి యతఁడు గులాము పోయిన మార్గమునుబట్టియే వానికిఁ దెలియరాకుండ నడవసాగెను.

నిక్కముగ నారాత్రి భగవంతుఁడు తనకు సాయపడుచుండెనని వేణీప్రసాదు తలంచి "ఇది నిజముగ నొకమహారహస్యమే. ఇఁక గొలఁదిదినములలోనే నాపాటంతయు సఫలీకృతము కానున్నదని స్ఫురించుచున్నది. ఉదయమున నే వచ్చి యీయువతిని విచారించిన గొంత నిజము తేలఁగలదు. వీడిప్పుడు పోవు రెండవస్థానమేదియో గమనింప వలెను. రజాకు రజియాతో నుండుమందిర మిదికాదు." అని పలు భంగుల నాలోచించుకొనుచు వేణీప్రసాదు సుమారరగంట వఱకు గులాము ననుసరించి తిరుగుచు తుదకొకవీధిలో నొకానొకతరు ప్రకాండము వద్ద నిలుచుండెను. గులామాసమీపమున నున్న యొక యింటియొద్ద నిలుచుండి తలుపు చఱచెను. కొంతసేపటికి తలుపు నెవరో లోనుండి తీసి వాఁడు లోపలికిఁ బ్రవేశించినంతనే మరల మూసివైచిరి. ఆ గృహ మెవ్వరిది! అందుండువా రెవ్వరు? గులామున కందేమిపని.? వేణీప్రసాదు తిన్నగఁ బోయి యాయింటి చిత్రమునుకూడ నిజహృదయచ్ఛాయాచిత్రగ్రహణపేటిక (Camera) యందు భద్రపఱచుకొని తలుపు మీదనున్న **4900** నంబరును పుస్తకములో గుర్తువేసుకొని" వీఁడు

మరల మొదటివలెనే యీయింటిని విడిచివెచ్చుటికైనఁ బోవునా ? ఇంచుక నిదానించి చూచుట మంచిది " అని యెంచి యాసరిహాపమున నున్న యింటియరుగుపైఁ బండుకొనెను—మొదటినుండియు గులాము వేణీప్రసాదునుఁ జూడకుండుటచే ప్రసాదరావున కుపకారమయ్యెను. త్వరలోనే హంతకులు పట్టుపడుదురను ధైర్యము కూడ జనించినది..

వేణీప్రసాదరావు బహుకాల మచట వేచిచూచెను. ఇంతలోఁ ప్రభాతకాంతులు గోచరించెను. గులా మంతిదనుక బహిర్గతుఁడై రాలేదు. అంత నతఁ డటనుండి లేచి " ఇఁక నిటఁ గాచియుండుటచే ఫలమేమి ! గులామ్‌శాహీ యిఁక వెలుపలికి రాఁడు. ఇదియే కాఁబోలు వీరినివాసస్థానము. ఉదయముననే వచ్చి యీసుందిరద్వయచరిత్ర విచారింతము " అని యటనుండి కదలెను. గుల్బర్గా యతనికి నూతన పుర మని చెప్పియుంటిమిగదా ! అందుచే నతఁ డానుహాపట్టణమునఁ దనమిత్రునియింటి నెఱుంగుటకు కొంత శ్రమింపవలసివచ్చెను. ఎట్లో యతఁడు కఱకఱప్రొద్దుపొడుచువేళకు పెద్దబజారునందున్న **1546** నంబరు గృహమును జేరఁగలెను. అదియే నందలాలుబస.

విశ్వనాథునిమూలమున రాత్రియే వేణీప్రసాదురాక నాలకించిన నందలాలు హాసన్ముఖుడై యతని కెదురుగా వచ్చి కరమును బట్టుకొని " ఇన్‌స్పెక్టరుగారు రాత్రియంతయు నెందుండిరో కదా. ఏమండీ, మీ కిందెవరైన చుట్టములు కలరా ? " అనెను. ప్రసాదరావొకచో విశ్రమించి " నాకు నిద్దురబద్ధకముచే కన్నులూడిపడునట్లున్నవి. " అనెను,

నంద : మీకు రాత్రి యంతయు నిద్దుర లేదా ? విశ్వనాథునితో సామానులఁ బంపి మీ రెందేగియుంటిరి ?

వే : నందలాల్‌జీ ! గుల్బర్గాయందు కాలుంచియు నుంచక పూర్వమే భగవానుఁడు నాకెంతో సాయపడినాఁడు. త్వరలో హంత

కింటఁ బట్టఁగలనని నమ్ముచున్నాను. మీమాటను పాటించి నేనిట వచ్చుట మేలైనది. హంతకులు మమ్మువంచించి దోంద్‌వద్దనే యీవైపు తిరిగినారు.

నంద : వారు మీకగపడిరా?

వే : రాత్రి స్టేషనులో దేవుఁడే వారిని జూపినాఁడు.

నంద : ఎవరెవరినిఁ జూచితిరి?

వే : గులామ్‌శాహీం నొక్కనినే.

అని యావద్వృత్తాంతము నతనికి వినిపించి "మీకేమి తోఁచుచున్నది? ఆ రెండిండ్లను మనము పరిశీలింపవలయును" అనియెను. నందలాలంతయు నాలకించి "అయ్యా, ఎట్లున్నను మీరు పోలీసువారు గదా. రహస్యభేదనోపాయ విద్యయంతయు మీపాలు. వహావ్వా! ఒక్కరాత్రిలో నెన్నిరహస్యములఁ గాంచినారు. నిక్కముగ మీకు భగవానుఁ డచిరకాలముననే యశోధనములఁ గూర్చి మీకష్టముల ఫలితములు గావించును—" అని యింకను నేమేమో చెప్పనుంకించుచుండ వేణీప్రసాదు "మహాశయా! మీప్రశంసల నిఁక గట్టిపెట్టుఁడు. ఇందు మీరు హంతకులుకలగని గ్రహించి వారిజాడ నెఱింగింపఁకున్న నేనీ రహస్యవర్తనముఁ దెలిసికొని యుందునా? వీరుబాంబాయియందు కలరని వృథాకాలహరణముఁ గావించుచుండ నీదుర్జాతులీప్రక్క నాకన్నుల దుమ్ముజిమ్మి యెందైనఁబోయియుందురు. ఈభయంకర వ్యాపారము నాకనుకూలముగను వారికిఁ బ్రతికూలముగను ద్రిప్పినతమకు నేను వేయి ధన్యవాదము లర్పించుచున్నాను." అనెను. నందలాలుమాత్రము తన ప్రశంసాభారమును దక్కించుకొనలేక మరలనిట్లనెను. "ప్రసాద్‌జీ! ఇందునాసాయము కించిన్మాత్రమే. దాని నాధారపఱచుకొని మీరు కొండంతపనిగావించితిరి! ఇందు మీప్రజ్ఞయా, నాప్రజ్ఞయా శ్లాఘాయోగ్యము?"

వే : నాదెట్లగును ? మీదే. మీసహాయ మల్పమైనను కోటి మహంగులు ఫలించినది. మీరు తెలుపకుండిన వీరిందున్నారని నేను కలనైనఁ దలంచియుందునా ? విత్తును నాటినవారుమీరు. మీరన్నట్టి కృషికుఁడను నేనే కావచ్చును. కాని యంకురము లేనికృషి నెవ్వఁడు చేయఁగలఁడు ?

నంద : న్యాయముగ నిందురాఁగలయశోధన మంతయు మీదే నాదెంతమాత్రమును కాదు.

వే : పోనిండు. మీరీనృశంసు లిందుండుట నెట్లు కనుగొంటిరి ?

నంద : ఒకనాఁటి సాయంకాలము నేను కోర్టునుండి తిరిగివచ్చుచుండ దారిలో కొందఱుబిక్షుకు లొకవినోదమును జరుపుచుండిరి. అట ననేకులు గుమిగూడి యుండిరి. వారిలో నాకు గులామ్‌శాహి గోచరించెను. నేను వానిని బాగుగ గుర్తెఱుఁగలిగితిని. కాని వాఁడు నన్నుఁ జూచినట్టు లేదు. నేను వెంటనేవానినిఁ బట్టదలంచితిని కాని కార్యభంగ మగునేమో యనిజంకి తత్క్షణమే మీతండ్రికి కొక జాబువ్రాసి మీరురాకుండుటచే మీకు బొంబాయి కాతంతివార్త నంపితిని.

వే : మీరిప్పుడు కోర్టుకుపోయెదరా ?

నంద : రేపు పోదును. మీరన్నట్టిప్పుడు మనమిరువురమును రాత్రి మీరు చూచివచ్చిన మందిర చారిత్రముల నరసి వత్తము.

వే : అందుకు మీకుఁ దీరిక కలదా ?

నంద : తీరికకేమి ? నేఁడంతయుఁ గలదు. కావలయుననన్న రేపును గలదు. ఉపహారమును గైకొని పోదము లెండు.

అని వేణీప్రసాదుతో లోపలికేగెను.

# ఇరువదిరెండవ ప్రకరణము

## వ్యూహము

సుమారెనిమిది తొమ్మిదిగంటలవేళ **2019** నంబరు గృహము నకుఁ గొంతదూరమున నొకబంట్రోతుతోఁగూడి నందలాలును ప్రసాద రావును నిలిచియుండిరి.

నంద : ఈయింటినిఁగూర్చియే కదా మీరు చెప్పినది ?

వే : అవును. అందుఁ బ్రవేశించుటకుఁబూర్వ మందుండు కాపురస్థు లెవరో, వారిచరిత్రమేదియో విచారించుకొనుటబాగు.

నంద—కానిండు. విశ్వనాథా ! అటకూర్చున్న యావృద్ధునిఁ దోడ్కొనిరమ్ము.

విశ్వనాథుఁడు సత్వరము యేగి యావృద్ధునిఁ దోడ్తెచ్చెను. వాఁడును వారియాకారాదులఁ గాంచి యున్నతోద్యోగులని శంకించి నమస్కరించి నిలుచుండెను.

వే : తాతా ! నీపేరేమి ?

వృ : నన్ను చందుఁడందురు, దేవరా !

వే : నీవేవంశస్థుఁడవు ?

వృ : గొల్లలము.

వే : ఆతూర్పువాకిలిగలచిన్నయింటిలో నెవరుకాపురమున్నారు ?

వృ : మావంశీకురాలే యొక ర్తెకలదు.

వే : ఆయింట నెవరెవ రున్నారు ?

వృ : మఱెవ్వరును లేరు. ఆమె యొంటిగనున్నది.

వే : ఆమెకు పతిసుతు లెవరును లేరా ?

వృ: భర్త యీయూరిలోనే వేశ్యాకవీధియందు కలఁడు. ఆమె కులటావృత్తి నవలంబించినది.

వే: ఓహో, అలాగా?

వృద్ధు: చిత్తము.

వే: ఆమె పేరేమి?

వృద్ధు: రంగనాయకి.

వే: ఇప్పు డామెయింటఁ బురుషు లెవరైన నున్నారా?

వృద్ధు: లేరు. మహాప్రభూ! దానిని మాకులమునుండి వెలి వేసినాము.

ఆస్త్రీ కులట యని విన్నంతనే వేణీప్రసాదు నందలాలును జూచి నగి "మనకార్యము సుకరమగును. నాయుపాయము పారినది" అనెను. వారెవరో, యెందుకై యాతన్విని గుఱించి యడిగిరో తెలియక యావృద్ధుఁడు "స్వామీ, ఆయింట మీ కేమి పని?" యని యడిగెను. "ఏమియు లేదు. నీవిఁకఁ బొమ్ము" అని చెప్పుచుఁ బ్రసాదరావు నందలాలుతో రంగనాయకి మందిరమును డాయఁబోయెను.

వారాగృహము చేరుసరి కింతవఱకు గడపలోనుండి చూచుచుండిన యొకవిలాసవతి యించుక పైట సవరించుకొని యొయ్యారముగఁ దలనాడించుచు "అయ్యా! లోపలికి దయచేయుఁడ"ని స్వాగతమొసఁగెను. వేణీప్రసాదు నిదానించి చూచెను—ఆమెయే చందుఁడు చెప్పిన రంగనాయకి. ఆమెనే రాత్రి గులాము కౌఁగిలించుకొన్నది. రంగనాయకి విలాసవతి—మోహనాకార మున్నది. కాని లావణ్యము లేదు. వచ్చినవారి వేషభాషలఁగాంచి రంగనాయకి భక్తిగౌరవంబులు గదురలోపల వారికొకయాసనము నునిచి "దయచేయుఁడ"ని వేఁడుకొనెను. వారులోపలఁ బ్రవేశించిరి. విశ్వనాథుఁ డొకచో నిలుచుండెను.

నందలాల్ ప్రసాదులు తమయాసనముల స్వీకరించిరి. వేణీప్రసాదు విశ్వనాథునిఁగాంచి "ఓరీ, నీవు వెలుపల నిలఁబడి పరుల నెవ్వరిని లోపలికి రానియ్యకుండ హెచ్చరికతోనుండు" మని యాజ్ఞాపించెను. వాఁడు వెంటనే యాస్థలమును బాసిపోయెను. రంగనాయకి యది కాంచి యించుకసంశయించి తనయింటిని కాచుటకు వారెవ్వరని యెంచి "అయ్యా, తమరెవ్వరు? అతని నేల వెలుపల కావలియుండఁబంపితిరి?" అని యడిగెను,

వే: నీ వేమియు భీతిలకుము. మనసంభాషణ పరులచెవి కెక్కరాదు. గోడలకు చెవులుండును. అందుచే మాసేవకునిఁ బంపితిని.

రంగ: రహస్యసంభాషణ మేమి? తమరెవరు?

వే: మేము పోలీసుయిన్‌స్పెక్టర్లము.

రంగ: (జంకి)—అమ్మయ్యో, దేవుఁడా, పోలీసువారికి నాతోఁ బనియేమండీ!

వే: (నవ్వి)—ఓసీ, భీరూ! రక్షకోద్యోగులన్న నేల యట్లు భయపడెదవు. మేము సాధురక్షకులము, దుష్టశిక్షకులము. నిష్కారణవైరమూని యొకరిని బాధించువారముకాము. నీవు నిందితురాలవని చెప్పుటకు రాలేదు. నీనుండి కొంతసమాచార మెఱుంగఁగోరి వచ్చితిమి. మాకించుక సాయపడిన సర్కారునుండి నీకు మంచిబహుమతి రాఁగలదు.

రంగ: సమాచార మేమి? మీరడుగఁదలంచిన దేది?

వే: భీతిలకుము. కూర్చుండుము. ఇంట నింకెవ్వరైనఁగలరా?

రంగ: లేరు. ఇంట నుండునది నేనొక్కతె నే.

వే: మంచిది. నీవు వేశ్యావృత్తియం దుంటివని తెలిసికొంటిమి. నీయింటికి నిన్నరాత్రి వచ్చినతురుష్కుఁ డెవఁడో తెలుపఁగలవా?

రంగనాయకి కశాఘాతమును దిన్న బాలకురంగిణివలె మిట్టిపడెను. ఏమిచెప్పుటకును నోరాడక విస్మయవిస్ఫారితనయనయై వా

నాపాదమస్తక ముపలక్షింపసాగెను. ఆమె హృదయము దడదడలాడ సాగెను. అదియంతయు గాంచి యిన్‌స్పెక్టరు హసించుచు "రంగనాయకీ! ఏలయట్లున్నావు?" అనెను. తనపేరు వారికెట్లు తెలిసెనని యావనిత మఱింతవిస్మయాతీతయయ్యెను. ఎట్టకేలకు చెదరినహృదయమును సరిదిద్దుకొని యది తడబడుచు నిట్లనెను. "అయ్యా! నాపేరు మీకెట్లు తెలిసెను?"

వే: నీవు జారిణివి, నీతోఁ బనియుండి నీయింటికి వచ్చునప్పుడు నీనామధేయము నరయక వత్తుమా? అంత యరసికులమా? నీబోటి చతురమతిని "నీపేరేమి? అని యడిగిన గౌరవమా!

ప్రసాదరావు మాటలకు నందలాలు నవ్వు నాపుకొనఁజాలక పోయెను. రంగనాయకికూడ మందస్మితము గావించుచు సవిలాసముగ "అయ్యా! ఏటిమాట లివి! తమబోటి మహాశయులు మర్యాదకన్న నాదేమిహెచ్చు?" అనెను.

వే: అట్లు కాదు, నీ సంగతి తెలిసినది. నీవు మిగుల కుశాగ్రమతివి. రంగనాయకీ! నాప్రశ్నకు బదులుచెప్పలేదు. రాత్రి నీయింటికి వచ్చిపోయిన యువకుఁ డెవఁడు?

దానికి కుత్తుకనొక్కిన ట్లుండెను. హృదయకుహరమున నెన్నియో భావతరంగములెగసి విఱిగిపోయెను. అయినను నిరుత్తరయగుట సంశయకారణ మగునేమోయను భీతిచే నేమియు నెఱుఁగనిదానివలె వెదవివిఱిచి "మీరనున దేదియో నాకుఁ దెలియలేదు. ఏపురుషుని సంగతి మీరడుగుచుంటిరి?" అని యనెను.

వే: నాకంతయుఁ దెలియును. నీవు దాచయత్నించినను సత్యము దాఁగదు. నిన్నరాత్రి పండ్రెండుగంటలవేళ నీయింటి కొకమహమ్మదీయుఁడు వచ్చి సుమారొంటిగంటదాఁక నిందుండి, రేపురాత్రి ఖండితముగ వత్తునని నీతోఁ జెప్పి పోలేదా?

రంగ : (ఆశ్చర్యముతో) మీరపప్పు డెందుంటిరి ?

వే : మీయింటి కెట్టయెదుటనున్న కట్టపైఁ బరుండి యుంటిని.

రంగ : అంతరహస్యముగ దాఁగి చూచుటకుఁ గారణమేమి ?

వే : కలదు. ఆపురుషుని పేరేమో చెప్పఁగలవా ?

రంగ : ఎవరివిషయమై విచారించుచుంటిరో వారిపేరే మీకుఁ దెలియకుండునా ?

వే : నాకుఁ దెలిసినమాట యటుండనిమ్ము. నీవు చెప్పుము చూతము. మాది సరియగునో కాదో చూచుకొందుము.

రంగ : అతనిపేరు హాసన్‌ఫీరు.

వెంటనే వేణీప్రసాదు గులామ్‌శాహీ కృత్రిమనామముతోఁ దిరుగుచుండె నని గ్రహించెను. పేరు మఱుగుపడినమాత్రమున రూపము దాగునా ?

వే : మంచిది. అతఁ డెన్నిదినములుగ మీయింటికి వచ్చుచుఁ బోవుచున్నాఁడు ?

రంగ : స్వామీ ! తమకతనితోఁ బనియేమో తెలిసినఁ గాని మీప్రశ్నలకు సదుత్తరముల నివ్వలేను. క్షమించవలెను.

వే : ఆసంగతిని దాచుటకు రాలేదు. చెప్పెదనువినుము. వాని దీయూరు కాదు. అహమదునగరు. కొన్ని ఘోరహత్యలు కావించిన నృశంసుఁడు. వానిని బట్టుటకై మేము తిరుగుచుండఁగా నిచ్చటికివచ్చి ప్రచ్ఛన్నరూపనామములతో నీయూర సంచరించుచున్నాఁడు. వీఁడిట్టివాఁడని నీవెఱుఁగవు కాఁబోలు. ఇప్పుడైనఁ దెలిసినదా ? మేము పోలీసువారము. నీతోఁ గొండెములఁగాని, యసత్యములఁగాని చెప్పుటకు రాలేదు. ఇందుపై నీవింకను మౌర్ఖ్యమును వహించితివా త్వరలోనే మహావిపత్తునఁ దగులుకొందువు. నామాటవిని వానివృత్తాంత

మును దెలుపుము. అట్లయిన నిన్ను మాకు సహాయభూతురాలినిగాఁ బరిగణింతుము. సర్కారున నీకు లాభము చేకూరఁగలదు.

రంగనాయకికిగుండె గుభిల్లుమనెను. తనవిటుఁ డొకహంతకుఁడని యాలకించినంతనే యామెమేనెల్ల జల్లుమనెను. రంగనాయకి యప్పటి తన పరిణామమును దలంచుకొని కంపితకంఠయై "స్వామీ ! ఏమను చుంటిరి ? అతఁడు హంతకుఁడా ?" అనెను.

వే : (దృఢముగ) అవును. మున్ముందటికి—వాఁడు నీతో నేమని చెప్పెను ?

రంగ : తనపేరు హసన్ ఫీరు అనినాఁడు.

వే : అది కాదు. నిజముగుపేరు గులామ్‌శాహీ.

రంగ : అయిన నేను వంచింపఁబడితినా ?

వే : నిస్సందేహముగ. తర్వాత ?

రంగ : తనది యహమదునగరనియు, వ్యాపారార్థియై యిటు వచ్చితిననియు చెప్పకొన్నాఁడు.

వే : అదియంతయుఁ గల్ల. వానితల, వ్యాపారమేమి ? హత్యా వ్యాపారము, రంగనాయకీ ! నీ వబలవు. అందు నమాయకురాలవు. నీకేమి తెలియు నీ ఘోరరహస్యము ? ఈయూర నుండునది వాఁడొ క్కఁడే కాదు. మఱియిరువురు కలరు.

రంగ : నాకేమి తెలియును మహాప్రభూ ! యీ సంగతులు. ఏదో యింత పైకమును జూచినంతనే నేను మోసపోయి వానివలలోఁ దగుల్కొంటిని. ఇందు నాయపరాధ మేమికలదు ?

వే : ఇప్పటివఱకు నీతప్పేమియు లేదు. ఇఁకముందు మేము చెప్పినట్లు చేయకపోయిన నీగతి దుర్గతియగును.

రంగ : నన్నేమి చేయుమందురు ? మీయాజ్ఞను నెరవేర్తును.

వే : నీవాగులామును బట్టి యియ్యవలయును. నీ మూలమున వాఁడు సుళువుగా మావశము కాఁగలఁడు.

రంగ : అదెట్లు నాకు వలనుపడును ! అతనికాపురస్థలము నిది వఱకుఁ గాంచి యెఱుఁగనుకదా.

వే : దానివలన నష్టమేమియు లేదు. వాఁడీరాత్రి నీయింటికి వత్తునని చెప్పిపోయినాఁడు కదా.

రంగ : అవును.

వే : వాఁడు తప్పక రాఁగలడనుధైర్యము కలదా ?

రంగ : అవును. ప్రతిదిన మతఁ డావేళకే వచ్చుచుండును.

వే : ఈరాత్రి మీయింట మేముదాగియుండుట కేర్పాటు చేయవలెను. వాఁడు వచ్చినంతనే సమయమును కనిపెట్టి పట్టు కొందుము.

రంగ : (యోచించుచు నూరకుండెను.)

వే : అట్లుచేయుట నీకిష్టము లేదా ?

రంగ : మిమ్మెట్లు దాచియుంచఁగలనని యాలోచించుచున్నాను

వే : నీయనుకూలముకొలది చరింపుము. మేము చీకటిపడినంతనే వత్తుము. వాఁడు వచ్చినంతనే వాని నిజస్థితినిఁ గనుఁగొనయత్నింపుము. నీకపాయము రాకుండ మేము కాచియుండఁగలము.

వారుచెప్పినట్లు చేయకున్నఁ దనకుఁ జేటు మూఁడునని యది బెదరి “నిష్కారణముగ నుస్థితిపాలేల కావలయును ? ఇంతకు వీనినుంచి నాకురాఁగలలాభ మేమున్నది ? వీనినిఁ బట్టియిచ్చిన సర్కారులో గౌరవలాభము లబ్బును. పెద్దలయనుగ్రహపాత్రురాల నగుదును.” అని లోలోనఁ దలఁచుకొని యామె వారుచెప్పినట్లు చేయుటకు సమ్మ తించెను, నందలాల్ వేణీప్రసాదులు పలురీతులఁ బ్రశ్నించి దానిమనో నైర్మల్యమును బరిశీలించి యది యిఁక తిరుగనేరదని గ్రహించిరి. ఇట్లే

విధముగ నాయింతిమందిరమునఁ దగినయేర్పాటులఁ గావించి యిప్పటికి మిగుల కాలాతీతమైయుండుటచే రంగనాయికితో నిక్కముగ దీపము లుంచువేళకు వత్తుమని నొక్కిచెప్పి, రహస్యము నెందును వెలిబుచ్చకు మనియు హెచ్చరించి వారు వెడలిపోయిరి.

## ఇరువదిమూఁడవ ప్రకరణము

### "ఇంకేమున్నది ?"

రంగనాయికి సహజముగ సమాయికరమైనను పుంశ్చలి యగుటచే చతురమతియై యుండెను. ఆమె తనపడకటింటి కానియున్న మఱి యొక విశాలమందిరమునఁ బోలీసువారిని దాఁచియుంచెను. ఇప్పుడా మెకు హంతకుని బోలీసువారి కప్పగించి మన్నన లొందవలయునని యాశ కలుగుటచే వేణీప్రసాదాదులు చెప్పినదానికన్న నెక్కువ యేర్పాట్లు గావించెను.

వేణీప్రసాదు నాఁటితోఁ దనహృదయకంటకులగు హంతకు లలో నొక్కనిబట్టవచ్చునుగదా యని మహానంద మందుచుండెను. ఆదినాంతమున నతఁడు పోలీసుఠాణాకు వెళ్ళి నలువురు రక్షకభటులను దనబసకుఁ బిలుచుకొనివచ్చెను. గులాముకొఁడు పట్టుపడినతర్వాత నిం కేమున్నది? వానివలన రజాకుగుట్టంతయు బట్టబయలగును. వానిని కూడ నిరాయాసముగ బంధింపవచ్చునని ప్రసాదరావు తలంచెను. దీపములవేళకే యతఁడు నందలాలుతో భుజించి పరమోత్సాహ ముతోఁ బోలీసువారినిఁ బిలుచుకొని తిన్నగ **2019** నంబరు మందిరముకడ కేతెంచెను. రంగనాయికి యంతకుఁ బూర్వమే వారి కొఱకు నిరీక్షించుచుండుటచే వెంటనే వారిని లోపలికి గొంపోయి

రహస్యస్థానమును జూపెను. ఆ గదిద్వారము శయ్యామందిరములో నున్నది. రహస్యమునకది యనువుగనుండెను. రంగనాయకిని పొగడి వేణీప్రసాదు నిజానుచరులతో "ఇకనాలసింపవలదు. వాఁ డెప్పుడైన రావచ్చును. సత్వరము మనస్థానమును జేరుదము రండ" ని వారినిఁ దోడ్కొని యాగదినిఁ బ్రవేశించెను. వెంటనే ద్వారబంధన కావింపఁబడెను.

అనిశ్చబ్దనిశాకాలమున నమృతగర్భమున హాలాహల ముదయించునని గులామునకేమి తెలియును ? తనప్రియురాలాకస్మికప్రాణాపాయురాలు కాఁగలదని వాఁడేమెఱుఁగును ? మృగయుఁడు ధనురాయుధుఁడై కాచియున్నాఁడు — అజశాబకము కూయుచున్నది — తదాకర్షితమై ముందు వెనుక లరయక భీకరవ్యాఘ్రము లఘించుచు మీఁద బడ వచ్చుచున్నది—.

గులాం యింకను రాలేదని రంగనాయకి యొకపాతపుస్తకమును దీసి దీపముముందర విప్పి వచ్చియు రానినేర్పుతో నేవో రెండుపాటలఁ బాడుకొనసాగెను. వీథితలుపులూరక మూయఁబడి యుండెను. ఏమియు నెఱుంగనిదానివలె సురభిళప్రసూన మాలికాతిరోహిత కాలాహియై రంగనాయకితనవలపులచిలుకను గుఱించి వింతవింతపాటలుపాడుచుండెను

సరిగఁ బదిఘంటలకు వీథితలుపు తీసి మరల గొళ్ళెముంచిన చప్పుడయ్యెను. సమయనిరీక్షితయై యున్నయాచెలువ వచ్చినవాఁడు గులాము కాఁబోలు నని తలఁచియు నేమియు నెఱుఁగనిదానివలె "ఎవరువారు ?" అని పిలిచెను. అంతరాత్రివేళ రంగనాయకిమందిరమునకు వచ్చువాఁడు గులాముకాక యితరు లెట్లగుదురు ?

గులాము చిఱునగవుతో వచ్చి రంగనాయకియెదుట నిలుచుండి మెల్లఁగ "నేను—నీదాసుఁడనే" యనెను. అనుదినము ప్రేమాదరభావములతో మన్నించుచుండిన యాయువతికి నేఁడుగులామురూప మసహ

మయ్యెను. ఆమె బహుచాకచక్యముతో భావగోపనఁ గావించు కొని తెచ్చుకొనుచిఱునగవుతో "నేఁడేల చాలప్రొద్దుపోయినదే ?" యనెను. గులామ్‌శాహి దానికరపల్లవమునుబట్టి "ప్రొద్దు పోయినదా ? లేదే. ఎప్పటివేళకే వచ్చినాను" అని ప్రత్యుత్తరమిచ్చెను. రంగనాయకి తనచంచలకటాక్షమాలికలఁ బఱపి "నీకట్లు తోఁచుచున్నదేమో కాని నాకుమాత్రము నినుఁజూడనినిమిష మొకగంటయై యుండును" అనెను. గులాము మహానందమున నామెను శయనాగారములోనికిఁ దోడ్తెచ్చుచు "ఏమిచేయుదును, రంగనాయకీ! నిన్నుఁజూడనిది నాకుఁ గూడ నక్లేయుండును. అందుకనియే దినమంతయుఁ జేయువలసిన పనుల నతిత్వరితముగ నిర్వర్తించుకొని నీదర్శనలాభ మొందుటకు సమయాతీతము కాకుండ పారి వచ్చుచుందును" అనెను. రంగనాయకి వానిని మంచముపై నాసీనునిఁ జేసి గదితలుపులు మూసివైచెను. ఆప్రక్క గది తలుపులు మూయఁబడి యుండెనని చెప్పియుంటిమి కదా. లోపల పోలీసువారప్రమత్తులై యుండిరి. ద్వారమున నున్న యొకచిన్న కలుగు గుండ ప్రసాదరావు తొంగిచూచుచుండెను. లోపలనిశ్శబ్దముగ నుండ వలసినదని యతఁడు భటులకుఁజెప్పి యుండెను. వారుధారాళముగ నుచ్ఛ్వాస నిశ్వాసములఁగూడ జరుప వెఱచియుండిరి. గులామునకు దాపుననే యొకయాసనముపై రంగనాయకి యుపవిష్టయై సాహేబు గారికి తాంబూలపత్రముల నందించుచుండెను. గులాము నములుచు "రంగనాయకీ! నీతో నేనిప్పు డొకవిచారకర మగుసంగతిని దెలుప వలసి యున్నది." అనెను. విలాసిని యదరిపడి "ఏమిసమాచారము" అని యడిగెను.

గులా : మేము రేపీపట్టణమువీడి పోవలసియున్నది.

రంగ : ఎప్పటికిఁ బోవుదురు ?

గులా : స్థలనిర్దేశము లేదు. వెచ్చనిచోట పరుండుట, పచ్చని చోట మేయుట మావ్యాపారధర్మము. మాయజమానుఁడు రేపే ప్రయాణము పెట్టినాఁడు.

రంగ : మీ యజమానుని పే రేమి ?

గులా : శంకరలాలు.

రంగ : అతనికి భార్యాబిడ్డ లున్నారా ?

గులా : లేరు. ఏకాకిగ నున్నాఁడు.

రంగ : మీరు మరల నహమదునగరున కెప్పుడు చేరుదురు ?

గులా : ఆమాట నిప్పుడు చెప్పఁజాలను. శాశ్వతముగ నాస్థలమును విడిచి వేఱొకతావున నివసింపవలయుననియే మాయాశయము. అహమదునగరు మావ్యాపారయోగ్యస్థానము కాదు. అందు మాకు శత్రుకోటియెక్కువ.

రంగ : (నవ్వుచు) శత్రువుల కోడి పాఱిపోవుచుంటిరా ?

గులా : వారిప్రాబల్య మధికమైనప్పుడు చేయవలసినదేమి ? విరోధములకుఁ బూనిన మాపని సాగదు.

రంగ : మాయింటికి ప్రొద్దుననే యొక సాహుకారు వచ్చియుండెను. అతనిదికూడ నహమదునగరేనఁట. అతఁడొక వింతవృత్తాంతమును దెలిపినాఁడు. నాకది కట్టుకథవలె తోఁచినది.

గులా : ఏమది ?

రంగ : ఆయూర నెవఁడో ధనికుఁడు హత్యకావింపఁ బడినాఁడనియు, హంతకునిపేరు గులామనియు, వాఁడెందో తప్పించుకొని తిరుగుచున్నాడనియు, పోలీసువా రతనికై వెదకుచున్నా రనియుఁ దెలిపెను. వానిముఖము వివర్ణ మయ్యెను. గుండెదడదడ హెచ్చెను. కాని సూక్ష్మగ్రాహి యగుగులాము తటాలున భావగోపనఁ గావించుకొని "నీకీచరిత్రను చెప్పినవానిపేరేమి ?" అని యడిగెను.

రంగ : తనపేరు విశాలసింగని చెప్పినాఁడు.

గులా : అతఁ డిచ్చటి కేల వచ్చి యుండెను ?

రంగ : నీ వెందుకు వచ్చితివి ? అట్లే యతఁడును వచ్చెను.

గులా : పోనిమ్ము. ఎవఁడైన నాకేమి ? నీవు చెప్పినచరిత్ర నాకేమియుఁ దెలియదు. మేమాపురము విడిచి బహుకాల మైనది. దేశములు తిరుగుచున్న మాకిప్పుడు స్వస్థానవృత్తాంత మేమియుఁ దెలియదు.

రంగ : నీవీయూరు విడిచినను నన్ను మఱవవుగదా ! మఱువవు కదా !

గులా : ఆహా ! ఏటిమాటలివి. నిన్ను మఱతునా ? ఎచ్చట నున్నను నీకుఁ క్షేమలేఖలఁ బంపుచుందును.

రంగ : సరి. సంతోషమైనది. నీపేరు హాసన్ ఫీరూఖానని జ్ఞాపకముంచుకొనవలయునా లేక మఱేదైన నామధేయము కలదా ?

గులా : ఒకనికి రెండు పేర్లెట్లుండును ?

ఇఁక నూరక వారిసంభాషణ నాలకించుచు నిలుచుండిన వృథా కాలయాపనకుఁ గారణ మగునని వేణీప్రసాదు తలంచెను. వారి నుండి గ్రహింపవలసినవిషయము లప్పటి కేమియు లేవని యతఁడు గ్రహించెను. వాఁడు గులామ్‌షాహియే యని స్పష్టముగఁ దెలిసిన తర్వాత నిఁక వానిని బంధించుటకు జంకెందుకు ? ఇంకను దెలిసికొనఁ దగినయంశములఁ దెలిసికొనుట కిది మార్గము కాదు. రంగనాయకి యెదుట వాఁడు తననిజచారిత్రము నెన్నఁటికిని వెల్లడింపఁడు. పట్టుపడినతర్వాత వాఁడు సర్వమును వెడలఁగ్రక్కక తప్పదుకదా ! ప్రసాదరావిట్లు వితర్కించుకొని నందలాలుతో నిట్లనెను. " ఇఁకేఁ దడవేల ! పులి బోనున దూరినది. దానిని బంధింతము. " నందలాలు తనసమ్మతి నొసఁగెను. వేణీప్రసాదు రక్షకభటులచెవిలో " నేను తలుపులుదీసినంతనే మీరిరువురు లంఘించి పోయి మా మహమ్మదీయుని చేతులకు సంకెళ్లు తగిలింపవలెను ఆలసింపకుఁ " డని చెప్పెను. అందఱును సిద్ధముగ నుండిరి. అప్పుడు వేణీప్రసా దతిరభసమున గదితలుపులఁ దెఱచి

వైచెను. అక్షణమే పోలీసువారు సాయుధులై వచ్చి గులామ్‌శాహీనిఁ బట్టుకొనిరి. అంతయు నొక్క తెప్పపాటు కాలమునఁ గడచిపోయెను.

అమాంతముగఁ దుపాకిదెబ్బదిన్న పుండరీకమట్లు గులా మొరిగి పడెను. అది కలయో కల్లయో తెలిసికొననేరఁ డయ్యెను. అప్పటి వాని స్థితి యూహావేద్యమేకాని నిర్వచనాతీతము. వానికి తనదృష్టి యందు నమ్మక మొదవలేదు. ఎదుట నిలుచున్నవారెవరు ?—పోలీసు యిన్స్పెక్టరగు వేణీప్రసాదు—అతనిమిత్రుఁ డగునందలాలు—రక్షక భటులు ! !—వారు తన్ను నిర్బంధించినారు. గులాముశరీర మాద్యంతము భయవిస్మయక్రోధభావసంచలిత మయ్యెను. చేతులకప్పుడే శృంఖలాబద్ధము లైనవి. ఇంకేమి చేయఁగలఁడు ? వానికి రంగనాయకికుత్సిత మెల్ల తేటతెల్లమయ్యెను. ఔరా ! ఆరోకాంత యెంతమోసగించినది ! ఇట్లగునని వానికేమి తెలియును ! గులాముకన్నులు గిఱ్ఱునతిరుగుచుండెను. నోటమాట రాకుండెను. వాఁడట్లే కొంతకాలము చిత్రప్రతిమవలె నిలుచుండెను.

అంతట వేణీప్రసాదు తనహృద్భార మొకించుక తీరుటకై యొకమారు రట్టహాసమును గావించెను. తనకిఁక సర్కారునుండి పారితోషికము రాకపోదని యారో వెలది లోలో నానందించెను. గులాము తన భావిపరిణామమును దలంచుకొని మిగుల తల్లడమందెను. ప్రసాదరావు వానికడకేగి "గులామ్ ! కడకు పాపము పండినది. మీరే యుద్దేశములతో నట్టిఘోరహత్యలఁ గావించితిరి ? అది క్రూర మృగవృత్తి యనియు, నందులకై కఠినశిక్షల నిహపరములందుఁ బొందవలసి వచ్చుననియు నూహింపరైతిరికదా ! ఇప్పటికి నిన్నుఁ బట్టఁగలిగితిని. రజియా యబ్దుల్‌రజాకు లెందున్నారో తెలుపఁగలవా ?" అనెను—గులాము నిరుత్తరుఁడై నతగ్రీవముతోఁ గాల నేల రాచుచుండెను. ఇన్స్పెక్టరు మరల నిట్లనెను. "ఓరీ ! మీ సంగతి నాకుఁ దెలియక

పో లేదు, అధర్మ మెన్నఁటికిని ధర్మమును వంచింపనేరదు. పాపమునకుఁ బ్రాయశ్చితవిధి దైవసంకల్పితము. ఇప్పుడిఁక మీ యుదంతమును మఱుఁగు పఱుచుటచే రాఁగలలాభమేమి ? అంత్యకాలమునసైన సత్యము వచించిన పాపమింత యుపశమించును. ”

గులా : నేను జీవించి యుండ నానోట నాయజమానుని రహస్యము నొక్కదానినికూడ మీరు వినఁజాలరు. నిట్టనిలువున దహింపుఁడు. చిత్రవధ చేయుఁడు. నేను స్వామిద్రోహిని కాఁజాలను.

వే : ఓహో ! పరమఘాతుకహృదయమునకు స్వామిభక్తియా ! ఇది యెంతయాశ్చర్యము. ఓరీ ! స్వామిద్రోహమన నేమో నీ వెఱిఁగినట్లు లేదు. నీయజమానుఁడు సజ్జనుఁడై యున్న నీవాతనిమోసగింపరాదు. కాని లోకకంటకుఁడైనవాఁడు స్వామియైన నేమి, గురువైననేమి, తుదకు తండ్రియైననేమి ? వానికిఁ దగినశాస్తిని గావింపవలసినదే. ఇందుకు నీరంగనాయకి యొకయుదాహరణము.

గులామ్‌శాహీ యాసుందరివైపు రూక్షవీక్షణములతోఁ జూచి దశనసంఘట్టనఁ గావించెను. వానినయనగోళములం దులాకపాత మగునట్లుండెను. బంధితుఁడై యుండెనుకాని లేకున్న నొక్కయుదుటు నఁబోయి మృగశాబకమును జించుఘోరపంచాస్యమువలె నామహాశూద్రి నేమిచేసియుండునో. అనరానిదుర్భాష లెన్నియో యాడెను. రంగనాయకిమాత్రము మాట దక్కించుకొనలేదు. “దుర్జాతీ ! ఘో నృశంసుఁడవు. నిన్నా నేనుమన్నింపవలసినది ? నీనుండి నాకేమిలాభము కలదు ? నిన్నిన్నిదినంబులదాఁక మన్నించినది నాదిగొప్పప్రమాదము. నొసటిచ్రాత మంచిదగుటచే నేఁటివఱకు నెట్టికీడును మూడదయ్యె. ఇంకను మాటాడుటకు నీకుసిగ్గులేదా ? ” అని తలవాచునట్లు చీవాట్లు పెట్టెను. వేణీప్రసాదరా వెంత హెచ్చరించినను వాఁడు రజాకును గురించి తెలుపనియ్యకొనలేదు. “సరి. నేను మీచేఁ జిక్కితినికదా

నేను భయము నొందుట లేదు. రజాకెట్లయినను నన్ను మీనుండి విడిపించు కొని పోవును. మీయట్టి యధమజీవుల కతఁడెన్నటికిని దొరకఁడని నమ్ముఁడు.” అనెను.

వే : కోటవీథిలోని **4900** నంబరు గృహమున నున్నవా రెవ్వరు ?

గులామ్‌శాహీ నిర్ఘాంతపడి చూచెను. ఆయింటిసంగతి యితని కెట్లు తెలిసెనని మిగుల నాశ్చర్యచకితుఁడయ్యెను. నోటమాట వెడల లేదు. చిత్రప్రతిమాకారము నొందెను.

వే : ఓరీ ! నాకంతయుఁ దెలియును. నన్ను సామాన్యునిగా దలంచితివి కాఁబోలు. నీవు చెప్పకపోయినను నేను రజాకువాసస్థానమును గుర్తించియే యున్నాను. మీరహస్యమెప్పటికప్పుడు బయలు పడుచునే యున్నది. నన్నుమీరు వంచింపఁగలరా ? మీరునన్నుఁ జూడకపోయినను నేనుమాత్రము మీరెందున్నను—ఎట్లున్నను మిమ్ము ననుసరించుచునే యున్నాను. మీయజమానుఁడుకూడ చిక్కినట్లే తలంపుము. అదియేనా వాఁడుండుమందిరము ?

గులాము నిట్టూర్చెను. తల వ్రేలవైచెను. ఇంకేమున్నది ? అంతయు విశదమైపోయినది. శిరమున శీతాచలపతనమైనట్లు క్రుంగి పోయెను. ఇఁక తాను దాచినను పోలీసువా రాయపరాత్రియం దాకస్మికముగఁ బోయి యాయింటిని ముట్టడింపక మానరుగదా—ఇంకేది యాలోచన ? కడకు వాఁడు “అదియే” యని తిన్నగఁ బ్రత్యుత్తరమిచ్చి దీర్ఘనిశ్వాసమును వెలిబుచ్చెను. వేణీప్రసాదు రంగనాయకిని గాంచి “రంగనాయకీ ! నీవు సర్కారునకు మహోపకారిణివి. నీకుఁ ద్వరలోఁ దగినబహుమానమబ్బును. విచారింపకుము” అని యూరడించెను. ఆ విటకత్తె కృతజ్ఞతాభివందనములర్పించి యానందమును వెలిబెట్టెను.

ఇఁకనాలస్య మయుక్తమని యిన్‌స్పెక్టరు వెంటనే గులామును పోలీసువారి కాపుదల క్రింద ఠాణాకుఁ బంపి తాను నందలాలుతో మఱి యిరువురు రక్షకభటులతో **4900** నంబరు మందిరాభిముఖుఁడై చనెను.

# ఇరువదినాల్గవ ప్రకరణము

## ప రి ణా మ ము

**2019** నంబరు గృహమునకును **4900** నంబరు మందిరమునకు సుమా రరమైలుదూర ముండును — పురమునందెందుచూచినను గాఢ నిశ్శబ్దత నిండియుండెను. అందం దొకటిరెండు బాజారుదీపములు వెలుగుచు సాధ్యమగునంతవఱకుఁ జీకటిని దొలఁగించుచుండెను. సకల ప్రాణికోటిని నిద్రాదేవి లాలించుచుండెను. క్రమక్రమముగ వేణీ ప్రసాదాదులు గమ్యస్థానమును జేరవచ్చిరి. ఇంటిద్వారము మూయఁ బడి యుండెను. ఆ గృహ మతివిశాలమై యున్నట్లు చూపట్టుచుండెను. లోపల నెందఱు కాపురమున్నను నిబ్బందిలేదు. ప్రసాదరా వాయింటి నంబరును గుర్తించెను. అతఁడు పొరపడలేదు. 4900 నంబరు గృహమే యది. అతఁడు తలుపు కొట్టుచు "అయ్యా! రజాక్‌సాహేబుగారూ! తలుపు దీయుఁడు." అని కేకరించెను. కాని యెవరును వచ్చి వాకిలి దీయలేదు. ఒకనిమిష మూరకుండి వేణీప్రసాదు మరల తలుపులు చఱచి పిలిచెను. వెలుపలివా రెన్నియోతడవులు కూసిరి. కొంతసేప టికి లోపలినుండి "ఎవరు వారు?" అను ప్రశ్న వినవచ్చెను. ఇన్‌స్పెక్ట రుచే నాజ్ఞాపితుఁడై యొకకర్మచారుఁడు "అయ్యా! మీ గులామ్ శాహీని పాము కఱచినది. మేము రైల్వేకూలీలము. మోసుకొని వచ్చి

సాము." అని ప్రత్యుత్తరమిచ్చెను. మరల లోనుండి "ఎచ్చట కలిసి నది?" అని ప్రశ్న వినఁబడెను. "రైలుస్టేషనులో" అని జవాబు. ఇంతలో మఱియొకరక్షకభటుఁడు బాధ నభినయించుచు లోపలివారికి వినఁబడునట్లు గట్టిగా మూల్గఁదొడఁగెను. అప్పటికిని తలుపులు తీయ బడలేదు. లోపల నేదో మాటాడుకొన్నట్లు వినవచ్చెను. ఒకమారు కంకణనిక్వణంబును, పదనూపురధ్వానంబును వినఁబడెను. వెలుపలఁ బోలీసువారిపిలుపు లధికము కాఁజొచ్చినవి. ఎట్టకేలకు చేయునదిలేక యెవరో తిన్నగవచ్చి తలుపులఁ దీసిరి—వెంటనే యమాంతముగఁ బోలీసువారందఱొక్కుమ్మగి లోపలికిఁ ద్రోసికొని వచ్చి తలుపుఁ దీసినవ్యక్తి నల్లెపట్టుకొనిరి. తక్షణమే వేణీప్రసాదు కరదీపికను వెలిఁగించిచూచెను—ఆదీపప్రకాశమున వారికిఁ గాన్పించినవ్యక్తి యెవరు? ఎవరిని వారు పట్టుకొన్నారు?—ఎవనిచిత్రచర్య లనుమానాస్పదములై రక్షకోద్యోగులఁ గలంచుచుండెనో, ఎవనిని ఘోరదానవసదృశ నరహంతగ భావించి కర్మచారు లన్వేషించుచుండిరో, ఎవనిమూలమున వేణీప్రసాదు సుఖజీవన మిన్నిదినంబులనాఁక పలుకష్టముల కాకర మయ్యెనో, ఎవని వినిందితచరిత్ర శ్రవణకారణంబున నహమ్మదు నగరునం దాబాలగోపాలము నట్టుడికిపోయెనో, యెవనిని బట్టుటకై పోలీసువా రాహారనిద్రాసుఖవిదూరులై యిన్నాళ్లు కష్టించిరో—ఆ యబ్దుల్ రజాకే యతఁడు!! వేణీప్రసా దొకప్రళయాట్టహాసమును గావించి "రజాకుసాహేబుగారూ! క్షేమమా?" అని యుపహసించెను.

ఆహా! అబ్దుల్ రజాకు స్థితిని వర్ణింపవలెనా? తరము కాదు. అతఁడు నిర్విణ్ణప్రభలతోఁ జిత్రితాకారమువలెఁ గదలక మెదలక నిలుచున్నాఁడు. పోలీసువా రప్పుడే వాని బాహుయుగళమును బంధింపఁ జూచిరి. కాని యతని కెడమహస్తము లేదు. అది ఖండితమైనట్లుచూపట్టుచుండెను. వేణీప్రసాదు దానిని గమనించి తన కహమ్మదునగరున

నిస్సామలుఖాను మందిరమున దొరకినయాంగుళ్యాభరణాలంకృతకరమును స్మరించుకొని యది వీనిదే యని పోల్చుకొనెను. అప్పుడు రెండు చేతులకును సంకెళ్లు తగిలించుట కనుకూలము లేనందున కుడిచేతికిమాత్రము బంధనఁ గల్పించిరి. రజాకు హృదయసంజనితక్రోధ విస్మయదుఃఖాది భావంబు లనిర్వచనీయములు. గులామ్‌షాహీకి తటస్థించిన దుస్థితియే యిప్పుడు వీనికిఁగూడ కలిగినది. ఔరా! నేఁటికీదుర్జాతి హంతక నికృష్టుల పాపంబులను భగవంతుఁడు బ్రద్దలు కావించివైచెను—

రజాకు నింతసులభముగాఁ బట్టఁగలుగుదు నని వేణీప్రసాదు కలనైనఁ దలంచియుండలేదు. ఆకస్మికముగ హంతకులిరువురు నొక్కమారతనివశమై పోయిరి. భగవంతున కతఁ డెన్నియో ధన్యవాదములర్పించెను. అబ్దుల్లా పట్టుపడినతర్వాత నొకదీర్ఘనిశ్వాసమును వెలిబుచ్చెను. రజియాబీబీకూడ నందే యుండవలయునుకదా యని యతఁడంత నబ్దుల్లాను గాంచి "రజాక్! రజియా నెందుదాచితివి?" అని ప్రశ్నించెను. వాఁడు మాటాడలేదు, క్రోధానలకీలలచే నిన్స్పెక్టరును దహించువానివలెఁ జూపట్టెను. రదనసంఘట్టన గావించెను. హుంకరించెను—ఆతఁ డేమి చేయఁగలఁడు? బోనునఁ జిక్కిన బెబ్బులివలె హుంకరించెను.

ప్రసా: ఇంక నీ చేష్టలను మార్చుకొనుము. ఈ వేషముతోఁ బ్రయోజనము లేదు. నీ మాయోపాయము లన్నియు నిరర్థకములయ్యెను. పాపము ఫలింపకుండునా? దానికి దండన లేదని తలంచితివా? దానికి దండన లేదని తలంచితివా? రజాక్! నీవిఁక మాచేఁ జిక్కితివి. తప్పించుకొని పోఁజాలవు. ఇంకను నేల యీ యంత్యకాలమున నీకపటనాటకము! సమస్తవృత్తాంతమును మాయెదుట విశదీకరింపుము. దాచుటవలన లాభమేమి? పశ్చాత్తాపమునఁ బాపము శమించును. సత్యము వచింపుము.

అబ్దుల్ : అయ్యో! తప్పించుకొని పోఁజాలననుట నాకిప్పుడు తెలిసినది. కాని మనసునఁ జెలరేగు క్రోధాసహ్యాముల నుపసంహరించు టెట్లు? దానికొకవ్యక్తి యాహుతియైనఁ గాని యది శాంతింపదు. నాబంధములఁ గొంచెము వదలింపుము. నీమెడ కొఱికి నీయుష్ణరక్తము నింత పానము గావించినతర్వాత నన్ను మీరు బంధింతురుగాక.

వానిమాటలు కండలు ఫక్కున నవ్విరి. "కడతేరుటకు సిద్ధమై యున్నను నీ కాతిథ్యమును మానవుకదా. కానిమ్ము! నీనోటినుండియే సర్వము వెడలఁగక్కించెదను. రజియాబీబీ నీవున్నతావునఁ గాక మఱెం దుండఁగలదు? ఓరీ! భటులారా! నావెంట రండు." అని వేణీప్రసాదు పోలీసువారితో రజియా నన్వేషించుటకై యాయింట దూఱెను. వా రందఱి చిన్నచిన్న గదులను పెక్కింటిని పరిశీలించి కడకొకదానిలో మూల దాగుకొనియున్న బీబీని పట్టుకొని యామెచేతికిఁగూడ సంకెళ్లు తగిలించిరి. అదికాంచి యబ్దుల్లా స్తంభితుఁడయ్యెను. అది చూచి యిన్‌స్పెక్టరు "రజాక్! ఇపు డేమందువు? ఇఁకనైనఁ దెలివి కలిగి నదా? నామాట వినుము. మీయాయువు లంతరింపక పోవు. మృత్యువు ప్రాణికి సహజము. మీరు కృషిచేసి పాపవృక్షమును పెంచితిరి. అది ఫలించినది. దానిని మీరుకాక మఱెవ్వ రనుభవింతురు? ఇంకనైన మీ వృత్తాంతము నెఱింగించి హత్యాపరాధములఁగూర్చిన మాసంశ యముల నన్నిటిని విచ్ఛేదము కావింపుము. చేసినపాపమును మోసు కొని పరలోకమున కేఁగుదురేల? వలదు? అది దుర్భరముగా దోఁచుట లేదా? నీశిక్ష యందు మఱింత దారుణమగును. చెప్పుము. మఱుగు పుచ్చకుము. నీవు మే మనుమానించినట్లు హంతకుఁడవేకదా?" యనెను—రజాకు మాటాడఁడయ్యెను. ఊరక తలవాల్చి యన్యాలోచ నాయుత్తుఁడైనట్లు చూపట్టెను. రజియా విభీతహరిణివలెఁ గాతరనయనయై వానిని విలకింపసాగెను. ఎట్టకేలకు రజాకిట్లనెను. "వేణీప్రసాద్‌జీ!

నీవన్నదంతయు నిజము. నావృత్తాంతమును వినఁదలంతువేని యిది స్థలముకాదు. రేపటిదినము నీ వొంటరిగ నేనుండుతావునకు వచ్చిన సర్వము విశదపఱతును.

వే: నిన్నిప్పుడు కారాగారమున బంధింతుము.

రజా: అవును. నాకాసంగతి తెలియును. ఈరజియాకూడ నాతోనే యుండఁగలదుకదా ?

వే: నీతోనుండక యింకెందు పోఁగలదు ? మీరీయింట నుండుటకుఁ గారణమేమి ?

రజా: అయ్యా ! సంగతు లన్నియుఁ దెలిసియు నిట్లడుగుచున్నావు. మీవారినుండి తప్పించుకొని యిటువచ్చితిమి. ఇఁక రేపే మఱియెచ్చటికైనఁ బోఁదలంచితిమి. కాని యింతలో మాయాశలన్నియు నాకాశహర్మ్యము లగునని నమ్మియుండలేదు. మీరు గులాము నెందైనఁ జూచితిరా !

వే: ఊరక చూచుటయేకాదు. నీకన్నను ముందుగఁ జెఱసాలయందునిచి వచ్చితిమి.

రజా: (నిర్విణ్ణుఁడై)—ఎప్పుడు ?

వే: ఒకగంటక్రిందట వానిని బట్టుకొంటిమి.

రజా: మేమిందున్నట్లు వాఁడే తెలిపెనా ?

వే: లేదు. నేను స్వయముగ కనుగొంటిని. రజాక్ ! ఇఁక కాలహరణము తగదు. మీరిప్పుడు మావెంటరావలయును. మీముద్దరిని రేపటిదిన మహామదునగరు చేర్చవలయును. అందే విచారణ జరుగగలదు.

అబ్దుల్ రజాకు చిన్నవోయినముఖముతో మరలమరల నిట్టూర్పులు నిగుడించెను. రజియాబీబీ యేడుపు మొదలుపెట్టెను. ఆమె తనకికఁ జేకూరఁబోవు దారుణశిక్షను, దుష్కీర్తి నిదలంచుకొని భయ

పడెను. వేణీప్రసాదు జాలిపడలేదు. కాలవ్యాళమును కనికరించి విడుచువా రెవ్వరు! వెంటనే వారిరువురు పోలీసుఠాణాకుఁ గొంపోఁబడిరి. వారున్నయిల్లుకూడ పరిశోధింపఁబడెను. కాని విశేషము లేవియు గోచరింపలేదు.

ఆయుదయముననే రైలుమీద ఖైదీలు గ్వాల్చుర్గానుండి యహమదునగరునకుఁ గొంపోఁబడి యందు నిర్బంధింపఁబడిరి. పురవాసులందఱు తుట్టతుద నపరాధులు పట్టువడినవార్త నాలకించి సంతోషముతో కారాగారముకడకు వారినిఁ గాంచవచ్చిరి. అపరాధులు తాజుద్దీన్‌ఖాను భార్యయగు రజియాబీబీయును, పరిచారకుఁడు గులామ్ శాహీయును, ఆయూరివాఁడే యగు నబ్దుల్‌రజాకు నని విన్నపుడు వారొందినవిస్మయ మపారము. ఇఁక లోకమున నమ్మఁదగినవా రెవ్వరు! ఈ పాపప్రపంచమున ప్రేమ యెంతనశ్వరమైనది! భర్తను భార్యయూ వంచించుట! అని పలువురు పలువిధముల మాటాడుకొన సాగిరి. రజియా కానాఁడు లభించిన సహస్రనామకదంబము మఱెవ్వరికిని చేకూరలేదు.

అబ్దుల్‌రజాకును, రజియాను, వేర్వేఱుగ నిర్బంధించిరి. వారివారిమోము లప్పుడే ప్రేతకళలచే నావరింపఁబడియుండెను. మచ్చునకైన నెత్తురు కానరాదు. ఆదినము మధ్యాహ్నము మూఁడుగంటలకు వేణీప్రసాదు రజాకున్నగదిలోనికి వచ్చి రజాక్! ఎల్లుండియే విచారణ! ఎట్టును శిక్ష తప్పునది కాదు. ఇంకేల సంశయింతువు? నాయడుగు ప్రశ్నలకు జవాబు నిమ్ము. రజాయానుకూడ నిటకు దోడ్తునా?" అనెను. రజాకు విన్నదన మొంది "తోడ్కొనిరమ్ము" అనెను. ప్రసాదరావు వెంటనే పోయి యిరువురు రక్షకభటులతో బీబీని పిలుచుకొని యచ్చటికి వచ్చెను.

రజా: వేణీప్రసాద్‌జీ! నాచరిత్రను వినఁదలంతువా? కానిమ్ము, వినిపించెదను. దాచుటచే నింకేమిలాభము! కడకు నేనోడితిని

నిన్ను జయలక్ష్మి వరించినది. నీకుఁ గావలసినదెల్ల నగుఁగాక. దాఁచక చెప్పెదను. దాచి యింకెవరి నుద్ధరింపఁగలను ? అందుమూలమున నీవన్నట్లు నాపాపఫల మనుభవించు నేమో కాని లాభముండదని తెలిసి కొంటిని.

వే : మంచిది. భగవంతుఁడు నీకిట్టిసద్బుద్ధినొసగుట చాల మంచిదే. నీయనుతాపముచే నీపాపాగ్ని గొంతశమింపఁగలను. నీవు తాజుద్దీన్ ఖాను హంతకుఁడవే కదా ?

రజా : అవును.

వే : ఇంకను ప్రశ్నోత్తరము లేల ! నీచరిత్రను సర్వమును విని పింపుము.

రజా : అయ్యా ! నాపూర్వవాసస్థలము బొంబాయి. నాకహ మదునగరునందే వివాహమైనది. మాశ్వశురుఁడపుత్రుఁడగుటచే నన్ని ల్లటము చేసికొనెను. నాటినుండియు నేను శ్వశురగృహాధివాసంబుఁ జేయుచు నీపురియందే కాలముఁ గడపుచుంటిని. కాలక్రమమున నాయత్తమామలు నశించిరి. వారియాస్తి సర్వస్వమును నాకే చెందెను. అప్పటి కింకను నేననపత్యుఁడుగనే యుంటిని. ఇంతలో నాయర్ధాంగి పరలోకగతమయ్యెను. తర్వాత కొన్ని మాసములకే నాకు సుహా బలేశ్వరమునందు ద్వితీయలగ్న మయ్యెను. కొన్నియేండ్లకా రెండవ భార్య నాకొక పుత్రికామణిమాత్ర నొసంగి తనసోదరి పోయిన జాడనే పోయెను. నేనంత చేయునది లేక నాకుమారీరత్నముతో సర్వ కష్టముల మఱచి యీ యిహసంసారము నీదుచుంటిని. దిలారామ్ అనుకన్యయే నాతనూజ. నామామ చర్మవ్యాపారి. నేనుకూడ నదే వృత్తి నవలంబించితిని. ఈనడుమ నాకు తాజుద్దీన్ ఖాన్ నేస్త మబ్బెను. అప్పటినుండి నేనడపదడప వారియింటికిఁ బోవుచువచ్చుచు నుంటిని. ఇంతలో నతని ప్రథమకళత్ర మొకకుమారునిగని గతించెను. ఆవృద్ధుఁ

డప్పుడు తనవార్ధక్యమున కొన్నిరోజుల కీనజమాబీబీని పరిణయ-
మాడెను. నాకప్పటి కీమెపరిచయము బొత్తిగా లేదు. ఈయూరనుండు
ముంతాజ్ జులియాసంగతి నీ వెఱింగినదే కదా. ఆమె వారాంగన. చిర
కాలమునుండి తాజుద్దీన్ ఖానునకు నామెకును బరస్పర ప్రేమభావముం
డెను. ఆతనికై యామె యెంతో ధనము వెచ్చించినట్లు వింటిని. నాకా
మెతో నొకమారు పరిచయము కల్గినది. అది దినదినాభివృద్ధి నొంది
తుదకు దృఢపడెను. నేను తాజుద్దీనునకుం దెలియకుండ రేయింబవ
ళ్లామెదాపుననే కాలముం గడపుచుంటిని. ఈసంగతి నెట్లో ఖాన్
సాహేబు గ్రహించెను. అతఁడు జులియాను కృతఘ్నురాలని తూలనా
డెను. అట్లయినను నాపొలఁతి నన్ను రహస్యముగనైన నాహ్వానింపక
మానలేదు. ఆసంగతి తాజుద్దీనునకు తెలియుచునే యుండెడిది. అతఁ
డంత నొకనాఁడు నన్నామెయింటనే చూచి నోటికి వచ్చినట్లు తిట్టి
భయపెట్టుచు నిఁక నిచ్చటికి రాకుమని హెచ్చరించెను. కాని నేను
సరకుగొనలేదు. ఇఁక సహింపలేక యొకనాటిరాత్రి జులియా జ్వర
పీడితయై వేఱొకమందిరమున శయనించియుండఁగా నతఁడు నాతో
పై మేడయందు ద్వంద్వయుద్ధమునకుం గడంగెను. అయ్యా! అదిస్త్రీకార
ణంబుగ జరిగినకలహము. దానితీవ్రతను తెలుపనలవే! వృద్ధుఁడగు
తాజుద్దీను తనయశక్తతనుగూడ లక్షింపక నాతో ఢీకొనెను. కాని
బలవంతుఁడ నగుటచే నేను సులభముగ నతనిని క్రిందికి నూకి గాయ
పఱచితిని. జులియా కాసంగతి తెలియవచ్చుటచే నామె నొచ్చుకొని
తాజుద్దీన్ ఖానును తిన్నగ స్వగృహమున కనిపెను. అది మొదలు నన్నా
యింట నాక్షేపించువారు లేకపోయిరి. నాఁటినుండి నాకు తాజుద్దీన్
ఖానుపైఁ జెప్పరానంతయసహ్యక్రోధములుద్భవించి యెట్లయిన నతని
నామార్గమునుండి తొలగించివైచుట మంచిదని యోచించితిని. ఈ
సంకల్పము నెఱవేర్చుకొనుటకు ముందు నేను వారిసేవకుఁడగు గులామ్

శాహీంని లోఁబఱచుకొంటిని. వాఁడు నాకు సంపూర్ణముగ వశుఁడయ్యెనని గ్రహించినతర్వాత నొకనాఁడు రహస్యముగ వానికి నామనోరథము నెఱింగించితిని. వాఁడును నాతో నేకీభవించెను. పిదపఁ గొన్నాళ్ళకు తాజుద్దీన్ ఖాఁ తనయుఁడగు నజీబుద్దీను రాజకోటకు వెడలినట్లును, ఇంట నిస్మాల్ రజియాలు తాజుద్దీనును బలుసంకటములఁ బెట్టుచున్నట్లును గులామువలన తెలిసికొంటిని. ఒకనాఁటిరాత్రి గులాము నాకడకు వచ్చి యింట నిస్మాల్ ఖాను లేఁడనియు, నాటకశాలకు పోయె ననియు, నారాత్రి తాజుద్దీనును గడతేర్చుట కనువగు ననియుఁ జెప్పెను. నేనును ముందు వెనుక లరయక కౄరమృగమువలె వాని మాటల కియ్యకొంటిని. ఆరాత్రి సుమారొంటిగంటకాలమప్పుడు నేను ప్రచ్ఛన్నరూపముతో తాజుద్దీఁ మందిరమున కేగితిని. అవి చీకటి రాత్రులు. గాఢాంధకారము నలుగడల నలమికొని యుండెను. వీథులు నిర్జనములును, నిశ్శబ్దయుతములునై యుండెను. అంత మూసంకేతము ననుసరించి నేను సందడిచేయుటచే గులాము మెల్లఁగ తలుపులు దీసి "లోపలికిఁ బిలుచుకొనిపోయి మరల తలుపులు బంధించివైచెను. నేను వానితో మూఁడవమేడలోనుండు తాజుద్దీఁ శయనాగారమునఁ బ్రవేశించి చూడ నందొకచిన్నదీపము వెలుఁగుచుండెను. పాపము ! వృద్ధుఁడగుతాజుద్దీను నిశ్చింతుఁడై నిద్రించుచుండెను. అప్పుడు నేఁగావించిన ఘోరాసురకార్యము నేమని తెలుపుదును ! నామేను జలదరించుచున్నది. కన్నులు చీకట్లు క్రమ్ముచున్నవి. నోరు తడబడుచున్నది——హాహా——యాఘోరాఘమునుండి నాకెన్నఁటికైన నిష్కృతి కలుగునా ? లేదు. లేదు. నిరపరాధియు, నిద్రాపరవశుఁడును, వయోవృద్ధుఁడు నగునాతని నరకి చంపి నాజీవితమునకుఁ దీరనికళంకము నాపాదించుకొంటిని. అకటా ! ననుఁబోలు ప్రళయదానవుఁ డెందుండును ? అయ్యో ! ఇన్‌స్పెక్టరుజీ ! నాకుత్తుక కురిఁదగిలింతు నని భీతిలుటలేదు సుమా

నను బోలిన కటిక చండాలున కది యొక లెఖకాదు. కాని నా హృదయాంతరాళ సంజనితమహాగ్ని నడంచు టెట్లు? అది నన్ను దహించుచున్నది. అదిగో, తాజుద్దీను — హా — హా — శిరోవిహీన కళేబరముతో నాపైఁ బడవచ్చుచున్నాఁడు. ఆనాటినుండి నాకన్నుల మ్రోల చిందులాడుచున్న యాతనిశిర మదిగో నన్నుఁ దిగ మ్రింగవచ్చుచున్నది — ఆహా! ఇంకేగతి — ఈపాపాగ్నిసంతాపము నెట్లు భరింపనోపుదు! కటకటా! కాలరాత్రీ! జలియాబీబీ! నీకై కడ కెట్టిఘోరకల్బిషపతితుఁడనై కొట్టుకొనుచున్నాను — అయ్యో — అయ్యో —

ఇఁకఁ రజాకు మాటాడ నేరక పెద్దనిట్టూర్పు విడిచి వెనుకకుఁ బడిపోయెను.

# ఇరువదియైదవ ప్రకరణము

## పరిశిష్టము

వేణీప్రసాదు వానిని లేపి కూర్చుండఁబెట్టి "నీవు నిక్కముగఁ బశ్చాత్తప్తుఁడవై యున్నచో నిన్నల్లా క్షమింపఁగలఁడు. చెప్పుము తర్వాత సంగతిని." అనెను.

రజాకు రెండుచేతులతో ముఖమును గప్పుకొని కూర్చుండెను. మఱిమాటాడలేదు. తాను కావించిన మహాక్రౌర్యమును తననోటినుండియే చెప్పవలసివచ్చుటచే వానికట్టిహృదయావేదన కలిగెను. కొన్ని నిమేషములదాక ప్రసాదరావుకూడ నూరకుండి "పిమ్మట నీవుచేసిన దేమి?" అని యడిగెను.

రజా: అయ్యో! ఆనాఁడు కలుగవలసినభయము నేఁడు బాధించుచున్నది. ఏమని చెప్పుదును.

వే: భయము లేదు. చెప్పుము. గులామప్పుడు నీకడనే యుండెనా?

రజా : అవును. అప్పు డాగదిలో నొక ట్రంకుపెట్టె యుండెను. దానిపైన గోడ కొక తాళపుచెవి తగిలింపఁబడియుండెను. అది యీ మందసముదే కావచ్చునని నేను పరీక్షించి చూడ నాతలంపు నిక్కువమయ్యెను. అవి యజీజుద్దీనువని గులాము చెప్పెను. నేనంత చక్కగ నాలోచించి యీ ఖండితశిరమును భద్రముగ నాదుస్థలమును నుంచి యథార్థపు బీగపుచెవి పరులకు పూర్తిగ ననుమాన మొదవకుండ నేమి చేయవలయు నని గులాముతో నాలోచించితిని. వాఁడు యోచించి “ఇస్మాయిలుఖానునకును తనతండ్రికిని వైరమని యజీజునకుఁ దెలియును. ఆ సంగతి యీ వీథియందు పలువురకుఁ దెలియును. ఈ నేరమిప్పుడు సులువుగా నిస్మాయిలుపై దొర్లిపోవునట్లు చేయుట మంచిది. అతని కోటును దెచ్చి యందు తగిలించి దానిలో నీబీగముచెవిని పడవైవుఁడు. పోలీసు వారిద్దానిని జూచి నిక్కముగ నిస్మాయిలును సంశయింపక మానరు.” అని యుపాయ మెఱింగించెను. అది నాకప్పటికి సముచితమై కాన్పించుటచే వానిచే నతనికోటును దెప్పించి దానిలో నాబీగపు చెవిని దాఁచితిని. తర్వాత గులాముచే నామందసమును మోయించుకొని వెలుపలికి వచ్చితిని. అప్పటికి రెండుగంట లైయుండును.

వే : గులామునుగూడ మీ యింటికిఁ దోడ్కొనిపోతివా ?

ర : లేదు. ఆ పెట్టెను నేనే మోసుకొని యింటికిఁ బోవుచు వాని కిట్లు చెప్పితిని. “రేపు సంతదినము. నీవు మధ్యాహ్నము మా యింటికి వచ్చిన నీపెట్టెను నీచేతి కిత్తును. నీవిద్దానిని గొంపోయి నీచాతుర్యము మెఱయ నెట్లయిన నితరుల కొప్పగించి నీవు తప్పించుకొని రమ్ము. గొప్పబహుమానము నిత్తును.” అని నేను స్వగృహమునకుఁ బోయితిని. గులా మింటిలోనికిఁ బోయి తలుపులు మూసికొనెను.

వే : మఱునాఁడు వాఁడు నీవు చెప్పినట్లు చేసెనా ?

ర : మీకుఁ దెలియదా ? పల్లెవాండ్రయధీనములో నాపెట్టెను పెట్టి పాఱివచ్చిన యల్లాభక్షు వాఁడే.

వే : వాఁడు మహోద్యానమందిరమున మీతోఁ నున్నయూఁడవాఁ డెవఁడు ?

ర : వాఁడు మహబూబ్ అను నా సేవకుఁడు.

వే : వాఁడిపు డెందున్నాఁడు ?

ర : నాకుఁ దెలియదు. మేము గుల్బర్గాకుఁ బారిపోవునపుడు వాఁడు నాకంటికిఁ గాన్పింపలేదు. ఎందేగెనో తెలియదు.

వే : మీరు గుల్బర్గాకు పారిపోయిన దెందులకు ?

రజా : మీబారినుండి తప్పించుకొనుటకు — కాని మాతంత్ర మొక్కటియు నెఱవేఱదయ్యె.

వే : రజియాబీబీ నీయొద్ద కెట్లువచ్చెను ?

ర : నేఁ దోడ్కొనివచ్చితిని.

వే : ఇస్మాల్ ఖానును కడతేర్చి వచ్చినదా ?

ర : ఆ సుకుమార కరపల్లవము లెట్టితీక్ష్ణాయుధంబును బట్టి యెఱుంగవు. ఆమె యెన్నఁడు నట్టిదారుణకృత్యములను నాచరించి యెఱుఁగదు.

వే : ఆయింట మాకొకహస్తము దొరికినది. అది నీదే యని నిశ్చయించితిమి. ఇప్పుడు నీకుఁగూడ నాహస్తము లేదు. దీనితత్వ మేమి ?

ర : అయ్యా ! ఇంతకు వచ్చి యిఁక దాఁచుటేల ! అంతయు మీకుఁ దెలియవచ్చియే యున్నది. మీకు దొరకినహస్తము నాదే.

వే : దాని నెవరట్లు నఱికిరి ?

ర : ఇస్మాల్ ఖాను.

వే : ఏల ?

ర : గులామ్‌శాహి తాజుద్దీన్‌ఖానును జంపుటకు సహాయపడుటయే కాక రజియాను నాకొప్పగించుటకుఁగూడ మిగులపాటు పడెను. ఆమెకు నావిషయమై బహుభంగుల బోధించి నాపై మరులుగొలిపి యిస్మాల్‌ఖానును ద్వేషించునట్లు చేసినాఁడు. అందుపై నాతని నంచించి రజియా నెట్లయిన దీసికొని పోవలయు నని నిశ్చయించుకొంటిని. హత్య జరిగిన నాఁటిరాత్రి గులాము నాకడకే తెంచి "రజియా తను వెంట రావలయు నని యున్నది. ఈరాత్రి యామెను తోడ్కొనిరావలయు" నని చెప్పెను. అందులకు సమ్మతించి నేనారాత్రి వారియింటికిఁ బోయితిని. గులాము సేవకుల కేదో స్మృతితప్పినట్లు త్రాగనిచ్చి నన్ను లోనికిఁ గొంపోయెను. లోపల మఱియెవ్వరును లేరు. ఇస్మాలు రజియాయొక్కయు, నాయొక్కయు తలంపులెఱింగి యామెననరాని దుర్భాషలాడి కత్తితోఁ బొడువఁబోయెను. నేనాసమయమున కడ్డుపడుటచే రజియాహృదయమున దూసికొనిపోవలసిన బాకు నా చేతినికత్తిరించివైచెను. మాయిరువురికి పెద్దదొమ్మియుద్ధము జరిగినది. నేనిఁక సహింపనేరక నాచేతనున్న ఛురిక నతనివక్షముపైఁ బ్రయోగించితిని. వెంటనే యిస్మాలు హాహాకారములఁ జేయుచు క్రిందికిదొర్లిపోయెను. నాలుగుదెబ్బలుకూడ మర్మస్థానములలోఁ దగులుటచే నతఁడు కిక్కురుమనకుండ విగతప్రాణుఁడయ్యెను. అప్పుడే నేను రజియాను, గులామును దోడ్కొని బొంబాయికిఁ బ్రయాణమైపోయితిని.

వే : మీరు మరల గుల్బర్గా కేలపోయితిరి!

రజా : మారహస్యములన్నియుఁ గొంతవఱకు ప్రతినుఁడను వానికిఁదెలిసియుండెను. గులామారాత్రి వానికిఁగూడ మత్తునిచ్చి తెలివి లేకుండఁ జేసియుండెను. తర్వాత మేమాయిల్లువిడిచి పోవునపుడు వానిని విడిచిపోయిన మాగుట్టు బయల్పడునని జంకి వానినికూడ

బొంబాయికిఁ బోవ నిశ్చయించి విగతస్పృహతోఁ బడియున్న ప్రత నునికూడ నొకబండిలో వైచుకొని స్టేషనునకు వెళ్లితిమి. విషపురి స్టేష నును జేరుసరికి వాఁడు తెలివొంది లేచెను. వాఁడు మామోసమును గ్రహించెను కాఁబోలు. అయినను మాతో సమయానుకూలముగనే మాటలాడి తర్వాత నేదోయొకమిష కల్పించుకొని దిగిపోయినవాఁ డట్లే పాఱిపోయెను. వాఁడు నీయూరికే వచ్చి మీకు మావృత్తాంత మును వెల్లడించునేమో యనుభీతిచే మేముప్పుడు దోండ్ స్టేషనువద్ద రైలుమార్చి బొంబాయికి పూరుగ గుల్బర్గాకు వెడలిపోయితిమి.

వే : నీకూతురుదిలారా మిపు డెందున్నది ? పరమశాత్రవుఁడ వయ్యు నీవు నీకుమార్తె నజీజున కిచ్చి వివాహము చేయఁ బ్రయత్నిం చితివఁట యెందుకు ?

రజా : నేరమంతయు నిస్సార్మలుపైఁ బడుటచే మేమిఁక నెన్నఁటి కిని హంతకులుగ సంశయింపఁబడమని ధైర్యమొంది, యంతలోపలనే యజీజు నల్లుని గావించుకొన్నచో నొకవేళ నేను దైవవశమున బట్టువ డినను నన్నతఁ డభిమానముచే నుద్ధరింపవచ్చుననియు, నేదియెట్లు న్నను మాదిలారాము వివాహితయై సుఖించుచుండుననియుఁ దలంచి యీయత్నమును జరిపితిని. కాని మానవసంకల్పములన్నియు నెఱ వేఱుచో నిఁకఁ దుఃఖమునకుఁ దావెందున్నది ? నరుఁడుసంకల్పిం చును. భగవంతుఁడు వికల్పించును. నాయాశయు మీఁదేర లేదు. నా వృత్తాంత మిపుడు జగద్విదితమైనది. మాదిలారాము నెవరిఁక పెండ్లి యాడుదురు ? నాయట్టిజనకునిఁ గల్గినదగుటచే నాబిడ్డయు నిఁకఁ దీరా నిసంకటములపాలుఁగావలసియున్నది.

వే : అవును. తలిదండ్రులతప్పులు పిల్లలకుఁ దగులకుండునా ? నినువంటి కరాళజానవుని మానవుఁడని తలంపవచ్చునా.

రజా : అయ్యా ! ఆ మాటలచే నీవు ఫలమేమి ? నా నృగ త్వమును నానోటినుండియే చెప్పచుంటినికదా. ఇంక నీయంత్వకాల మున, నీపశ్చాత్తాపానలకీలలకుం దోడు నీవాక్కీలలచే నన్నేల నొవ్వ నాడెదవు ?

వే : నాంటిరాత్రి బాంబును బుట్టలో నుంచి ఫలకరండ మని, వందలాలు పేరుతో నాకనిపినవాండవు నీవేనా ?

రజా : సందేహ మేమి.

వే : అట్లేల చేసితివి ?

రజా : నిన్నుం గడముట్టింపవలయు నని. కాని నాకర్మమిట్లుండ నీవేల చత్తువు ? నావంటివారి సింకెందఱిని రూపుమాపువఱకు నుం దువో ! నీకు జయమును దీర్ఘాయువును, నాకపజయంబును క్షీణాయు వును భగవంతుడు కలిగించెను.

వే : నీవు చెప్పిన దంతయు నాలకించి చూడ నీరెండుహత్య లును నీచేతులమీఁదనే జరిగినవనియు, రజియాబీబీ కిందఱుహత్యా త్రి మును సంబంధము లేదనియు, గులామ్‌షాహీ నీసహాయకరుండై యుండెననియు మేము నమ్మవచ్చునా ?

రజా : అభ్యంతరము లేదు. జరిగినదంతే. రజియా మొదట తాజుద్దీన్ఖానును వంచించి యిస్మాయిలుతోం గలసి తర్వాత యిస్మా లును మోసగించి నావెంటవచ్చిన తప్పునకు మాత్రము బాధ్యురాలు. తదితరదోషములందామె యమాయికురాలు.

వే : గులాముమాత్రము నీతో సమానుండే.

రజా : మీాకెట్లు తోంచుచున్నది ?

వే : వాండు హంతకుండు కాకున్నను హత్యలకు సహాయుండు.

వేణీప్రసాదు కొందఱు రక్షకభటులతో గులామున్నగదిలోని కేగెను. గులాము గ్రుడ్లుమిణుకరించుచు రాఁగల మహాశిక్ష కెదురు చూచుచుండెను. ప్రసాదరావు వానిదాపునఁజేరి యెన్నియో ప్రశ్నలడిగెను. వాఁడును దనయంత్యకాలమున నొక్క-సంగతిని దాపక సర్వము నొప్పుకొని తన్ను క్షమింపవలయునని వేడుకొనుచు పొరలి పొరలి యేడ్చెను. కాని మన్నించు నధికార మెవరిది ? — అతనిది కాదు. గులామ్‌శాహీ రజాకుల వాఙ్మూలమునం దెట్టివ్యత్యాసమును గోచరింపలేదు. ఇప్పటికి సత్యమంతయు వెల్లడి యగుటచే వేణీప్రసాదు హృద్భారము తీర నిట్టూర్చి నిజావాసమున కేగెను.

ఇంకేమున్నది ! సంశయము లన్నియుఁ దీరినవి. అపరాధులు తమ సర్వాపరాధములను దమనోటినుండియే యొప్పుకొనిరి. వేణీప్రసాదరావుచిత్త మిప్పటికి స్వస్థతనొందినది. అతఁడు తనకు సాయపడిన నందలాలును మిగుల నభినందించెను. కష్టతరమును, సాహసయుతంబు నగు పోలీసువృత్తియందే తుదకు తనతనయుండు విజయధ్వజమును ధరించి లోకనుతంబగుకీర్తి కళ్యాణుఁడైనందున వృద్ధుఁడగు గిరిధరరావు పొందినయానందము వర్ణన సాధ్యము కాదు. అబ్దుల్‌రజాకే తనతండ్రిని జంపెనని గ్రహించినప్పు డజీజుద్దీనుపొందిన విస్మయక్రోధము లనంతములు. అతఁడు పరిపరివిధముల రజాకును నిందింపసాగెను. వేణీప్రసా దతనికడ కేతెంచి " అజీజ్ ! హంతకు లందఱు నేఁటికి పట్టుపడినారు. నాహృదయశల్య మూడిపోయినది. కాని నీదంతసుళువుగాఁ బోవునది కాదని నేనెఱుఁగుదును. అబ్దుల్‌రజాకు హంతకుఁడై యుండఁడని నీవేకాక యీనగరవాసు లందఱును తలంచి యుండిరి. కాని యానృశంసుఁడు తననేరమును తానే యొప్పుకొన్నాఁడు. వాఁడుతన యపరాధమున కనుగుణమగుశిక్ష నొందును. ఇప్పుడు నీకొకసంగతినిఁ

జెప్పవచ్చితిని. రజాకు తనయ యగు దిలారామ రూపవతి యనియు సద్గుణనిధాన యనియు వినియున్నాను. ఆమెను నీకే యివ్వవలయు నని రజాకు తలంచుచుండెనుగదా. ఇప్పుడా తండ్రి యాతనూజకు లేఁడని నమ్ముము. అతఁడు నీకాకన్యను దత్తము చేయలేఁడు. కావున నేనే జనకాధికారమును వహించి కన్యాదానము చేసెదను. నీవా కన్యామణిని బరిగ్రహించి యామెను సనాథనుగావింపుము. అట్టి తండ్రికి జనించినబిడ్డకదా యని శంకింపకుము. ప్రళయరాక్షసాన్వయ మునందే ప్రస్తుతిగుణాఢ్యుం డగు విభీషణుఁడు జనించెను. కఠినచిత్తుఁ డగు కాలరాక్షసునికి సదయహృదయుం డగు ప్రహ్లాదుఁ డుదయిం చెను. లోకభీకరహాలాహల ముదయించిన సుధాబ్ధియందే సుధాధార లుద్భవించినవి, ఇన్నియు మా హిందూపురాణగాథలలోనివి. నామాట వినుము. దిలారామ నీకనుకూలవతియగు భార్య" అని బోధించెను.

అజీజు కొంతదూరము వాదించెను. కాని యతని బంధుగులుకూడ వేణీప్రసాదుతో నేకీభవించి మాటాడుటచేతను — తాను స్వయముగ దిలారామనయవినయాదిసుగుణసంపత్తిని కన్నారఁ గాంచినవాఁడగుట చేతను వారిమాటల కియ్యకొనెను. మఱునాఁడు వేణీప్రసాదు బంధనా గారమున కేగి రజాకున కీసంతోషవార్త నెఱిఁగించెను. "గ్రుడ్డిలో మెల్ల" యన్నట్లు తన కొదవినమహాదుఃఖకాలమున తనకూర్మిసుత నజీజుద్దీను పరిణయమాడ సమ్మతించెనను నానందవార్త నాలకించి యబ్దుల్లా నిట్టూర్చి వేణీప్రసాదరావు కావించిన యుపకారంబున కతనిని వేనోళ్ళ నుతించెను. తర్వాత నబ్దుల్ రజాకు వా[illegible] బొంబాయిలో నున్న యతనిబంధు వొకఁడు దిలారామను దోడ్కొని యహమదు నగరునకు వచ్చెను.

ఇంతతో వేణీప్రసాదు తనయపరాధ వివరణపత్రమును (Charge Sheet) ముగించినట్లు లేదు. ఈయభియోగమున తానెవరెవరిని శంకించి యుండెనో వారందఱి సంగతులనుకూడ గ్రహించుచుండెను. తుదకతఁ డిస్మాయిల్ ఖానుగుమాస్తా యగురోషిన్ వారాను పట్టుకొని నయభయంబులతో హెచ్చరించి చిట్టచివరకు వానినుండియే మహామ్మద్ యిస్మాయిలు తాజుద్దీను వ్రాసి యిచ్చినదని చూపినపత్రము కేవల కృత్రిమ మనియు, సర్వమును దెలిసికొనియెను.

ఇంకేమున్నది? సర్వము సంపూర్ణమైనది. వేణీప్రసాదు వివరణపత్రమును తయారుచేసి (Charge sheet) కోర్టువారియెదుట నుంచెను. విచారణ సలుపఁబడెను. అపరాధు లందఱు తమ నేరముల నన్నిఁటి నొప్పుకొనిరి. తర్వాత వ్రాయవలయునా? పాపమునకుఁ బరిణామము— తదనుగుణంబగు శిక్ష చేకూరినది — పాపము! అబ్దుల్ రజాకునకు తనగాదిలికూతురు వివాహమహోత్సవంబును కన్నారఁగాంచుభాగ్యము లేకపోయెను. ఉరికంబముపై వ్రేలాడుచున్న యతని కళంకగాత్రమును వీడి యా ప్రాణవాయువు లెన్నఁడో యనంతవాయువున లీనములై పోయినవి — ఈ దుర్వార్త నాలకించినపుడు శిరీషకోమలచిత్తయగు దిలారామ యెంతగ దుఃఖించెనో యెవ్వరు చెప్పఁగలరు? కాని యజీజుద్దీన్ మున్నగువారి యాశ్వాసనసుధాధారలచే నామె సంతాపాగ్ని చాలవఱకు నుపశమించె నని చెప్పవచ్చును—ఇఁకరజియాను మాత్రము మన్నించువా రెవ్వరు! ఆమె దీర్ఘకాలము కఠినకారాగారవాసంబు చేయవలసినట్లు విధింపఁబడెను—గులామునకు యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష చేకూరినది—రోషిన్ వారాకు రెండేడులును రహిమాయను వాని కొకయేడును బంధనాలయాధివాసము తప్పదయ్యెను.

# తుదిమాట

కొన్నిదినంబులకే దిలారాము సర్వజనాపనిందాపాత్ర జీవనుఁడగు నబ్దుల్ రజాకు తనతండ్రి యనుమాటను మఱచి, యతనిదుర్మార్గమున కొంతయుఁ జింతింపక యజీజుద్దీనును బెండ్లాడెను. అజీజు తన హితు లగు వేణీప్రసాద్ నందలాలుల ననేకవిధముల బహూకరించెను. ఈ సందర్భమునఁ బ్రసాదరావు వాగ్దానము చేసినట్లు రంగనాయకికి బహుమాన మిప్పించెను. మొదటిప్రకరణమునఁ బేర్కొన్న వేటపాళ్యము గ్రామనివాసు లగులచ్చన్నయు, భద్రుఁడును తనుకబ్బినపెట్టె యొక్క విచిత్రగాథనాలకించినప్పుడు పొందిన యానందవిస్మయముల నేమని వ్రాయుదుము! ముంటాజ్ జులియాను సర్కారువారు దండింపక పోయినను నామెకు స్వీయానుభవమే పెద్దశిక్ష యయ్యెను. ఇఁక నెన్నఁటికిని రజాకువంటి కులనాశకులఁ జేరఁదీయరాదని యామె సంకల్పించుకొనెను — ఇప్పటి కిన్‌స్పెక్టరు వేణీప్రసాదరావునకుఁ దీరిక యబ్బినది— మనసు కుదుటపడినది— హృదయభారము—తీరినది— అంతటినుండి గిరిధరరావు కుమారునితోఁ బోలీసుడిపార్టుమెంటున దూషింపక తనయుని సాహసధైర్యములను, నాతనికబ్బిన నిష్కళంక యశస్సౌభాగ్యమును దలంచి లోలోన నానందింపసాగెను. కమలమణికిని, తదితరులకును నుబుసుపోక కప్పుడప్పుడు ప్రసాదరావు తాఁ "హాత్యారహస్యము"ను భేదించుటలోఁ బడినపాట్లను చిత్రకథవలెఁ జెప్పుచుండెడివాఁడు.

సంపూర్ణము.

---

రాజేశ్వరి ప్రెస్ ::: రాజమహేంద్రవరము.